అవిశ్రాంత అన్వేషి

# ఎం.ఎన్.రాయ్

CHAITANYA



కోడూరి శ్రీరామమూర్తి

# రెండు మాటలు ...........

"ఎం.ఎన్.రాయ్ జీవితం, సందేశం" అనే అంశంపై ఒక పుస్తకం రాయాలన్న కోరిక నాలో చిరకాలంగా వుంది. రాయ్ చేసిన సాహసకృత్యాలు, స్వయం కృషితో అతడు సముపార్జించుకున్న అపారమైన జ్ఞానం, వీటన్నింటి గురించి తెలుసుకున్నప్పుడు నాకెంతో ఆశ్చర్యంగా వుండేది. అతడి దేశ భక్తి, మానవవాదము, నన్నెంతో ఆకట్టుకునేవి. అయితే – ఈ భావాలను ఒక పుస్తక రూపంలో తేవడానికి ఇది సరిపోదు. విషయాలను లోతుగా చర్చించేందుకు మరి కొంత సమాచారం కావలసి వుంది. అందుచేత – ఈ ఆలోచనను అప్పటికి పక్కన పెట్టాను. ఇతర గ్రంథాల రచనలో తలమునకలుగా వుండడం ఇందుకు మరొక కారణం.

తీరా,ఈ పుస్తకం రాయడానికి కూర్చున్న తర్వాత, తెలిసిన దానికన్నా – తెలుసు కోవాల్సింది చాలా ఎక్కువ అని అర్థం అయింది.

ఈ అధ్యయనం కలగడానికి పలువురు పలు విధాలుగా సహకరించారు. కావలసిన పుస్తకాల కోరికను మా పిల్లలు చి॥ శ్రీకిరణ్, చి॥ శ్రీకిశోర్‌లు చాలా వరకూ తీర్చారు. అదే విధంగా మిత్రులు పసలి భీమన్నగారు, రాయ్ మీద వచ్చిన కొన్ని పుస్తకాలు తెచ్చి ఇచ్చారు. మా పూర్వ విద్యార్థి విద్యాసాగర్, మిత్రుడు గంగాధరరావుగార్లు కూడా మరికొన్ని పుస్తకాలు అందించారు. ఇలా మొత్తంమీద, కావలసిన పుస్తకాలు సమకూరాయి. వాటన్నింటినీ అధ్యయనంచేసి, పుస్తకంగా రాయాలని కూర్చునేసరికి, – ఇంతపెద్ద పర్వతాన్ని చిన్న అద్దంలో చూపడం ఎలా ? అనిపించింది – ఆ సమస్యను అధిగమించేసరికి – అనారోగ్య సమస్య పీడించింది. రాయడానికి కష్టంగా వుండేది.

అట్లాంటి పరిస్థితిలో – రాజమండ్రిలోని ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ.చివరి సంవత్సరం చదువుతున్న (ఇది రాసేనాటికి) కుమారి రేవతి – నేను డిక్టేట్

చేస్తుంటే వ్రాతప్రతి రాయడానికి ముందుకు వచ్చింది. ఇలా – ఆమె 120 పేజీల వ్రాత ప్రతి రాసే నాటికి – తిరిగి నేను రాయగల పరిస్థితి ఏర్పడ్డంతో మిగతాది నేనే రాసుకోవడం జరిగింది. పలువిధాలుగా సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు.

ఇలాంటి పుస్తకాలు రాయడం ఒక ఎత్తు అయితే ఇందుకు పూనుకునే పబ్లిషర్లు దొరకడం మరొక ఎత్తు. ఎప్పటి వలెనే – నా పుస్తకాలను ప్రచురించే పల్లవీ పబ్లికేషన్స్ (విజయవాడ) అధిపతి వెంకట నారాయణగారు ఇందుకు అంగీకరించారు. అందుకు వారికి కృతజ్ఞతలు.

ఎం.ఎన్.రాయ్ జీవితాన్ని, సందేశాన్ని, సంగ్రహంగా అందించే ఈ పుస్తకం పాఠకుల ఆదరానికి నోచుకుంటుందని ఆశిస్తాను. ఎన్నో సంకెళ్లతో బందీలుగా వున్న ఈనాటి ప్రజలకు – ఏనాడో రాయ్ పూరించిన స్వేచ్ఛా శంఖారావం కొత్త ఊపిరిని పోయగలదని ఆకాంక్షిస్తాను.

21-12-18,
డోర్ నం.5, అఖిల్ ఎపార్ట్‌మెంట్స్,
దానవాయిపేట, రాజమండ్రి – 5.

**భవదీయుడు,**
**కోడూరి శ్రీరామమూర్తి**
సెల్ : **9346968969**

★ ★ ★

# ఇందులో......



అనుబంధం :

# 1. పరిచయం

**ఎం.**ఎన్.రాయ్ (1887-1954) గా ప్రసిద్ధుడైన మానవేంద్రనాథ్ రాయ్‌వంటి విలక్షణమైన వ్యక్తులు ప్రపంచంలోనే అరుదుగా ఉంటారు. ఒకరు ఒక రంగంలో నిష్ణాతులు కావచ్చు. అందులో ఉన్నత శిఖరాలు అధిరోహించవచ్చు. మరొకరు అదే విధంగా మరో రంగంలో విశేష ప్రతిభను కనబరచవచ్చు. కాని అనేక రంగాలలో ఉన్నత స్థాయిని చేరుకొని అంతలోనే దానిని వదిలిపెట్టి మరొక రంగంలో ప్రవేశించి - ఒక జీవన స్రవంతి నుండి మరొక జీవన స్రవంతికి చేరుకుంటూ, తన జీవితాన్ని పలురకాలైన జీవన స్రవంతులతో పరివృతం చేసుకుంటూ అన్ని రంగాలలోనూ మహోన్నత స్థాయినందుకున్న వ్యక్తులు ఊహకు అందని రీతిలో విలక్షణంగా ఉంటారు. అలాంటి వ్యక్తులకు ఉదాహరణ ఎం.ఎన్.రాయ్.

రాయ్ జీవితంలో అనేక దశలు ఉన్నాయి. మొదటి దశలో అతడు ఉగ్ర జాతీయవాది. తరువాత దశలో ప్రపంచంలో పలుచోట్ల కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించడానికి అంకితభావంతో కృషి చేసిన అంతర్జాతీయ కమ్యూనిస్టు. మూడవదశలో కాంగ్రెస్‌లోచేరి, భారతదేశ ప్రజా ఉద్యమంలో అప్పటికే ప్రముఖ స్థానాన్ని పొందివున్న కాంగ్రెస్‌ను కమ్యూనిస్టు పంథాలో నడిపించటానికి ప్రయత్నించిన జాతీయవాది. నాల్గవ భాగంలో కాంగ్రెస్‌తో తెగతెంపులు చేసుకుని భారతదేశంలో కమ్యూనిజంను బలపరిచేందుకు పరితపించిన కమ్యూనిస్టు. చివరి భాగంలో కమ్యూనిజంతో తెగతెంపులు చేసుకుని ఒక తత్వవేత్తగా, మానవతావాదిగా మారిన మేధావి.

ఈ దశలన్నింటిలోనూ ఒకదాని నుండి మరొక దానికి మారడానికి బలమైన కారణాలు ఉన్నాయి. భారతదేశానికి స్వాతంత్ర్యము సాధించాలనే లక్ష్యంతో చిన్న వయసులోనే టెర్రరిస్టు రాజకీయాలలో దూకి సాయుధ పోరాటం ద్వారా తెల్లవారిని ఈ దేశంనుండి తరిమివేయాలని పరితపించాడు. అనేక దేశాలకు తిరిగి ఆయుధాలను సేకరించే ప్రయత్నం చేసాడు. కాని ఆ తరువాత తెల్లవారికి బదులు నల్లవారు రాజ్యం చేసినంత మాత్రాన ఆర్థిక దోపిడి అంతంకాదని, తెల్లవారి బదులు నల్లవారు దేశప్రజలను దోచుకుంటారని గ్రహించి, మనిషిని మనిషి దోచుకోకుండా చేసేది కమ్యూనిజం ఒక్కటే అని అనుకుని కమ్యూనిస్టుగా మారాడు. అయితే కొన్నాళ్ళు కమ్యూనిస్టుగా, అంతర్జాతీయ కమ్యూనిస్టుగా ఉన్నత శిఖరాలను అధిరోహించాక, ఆర్థిక ప్రజాస్వామ్యం పేరుతో కమ్యూనిజం కూడా మానవుని స్వేచ్ఛకు సంకెళ్ళు వేస్తున్నదని తెలుసుకొని దానికి కూడా దూరమయ్యాడు. మత, వర్గ తత్వాలకు మనిషి మనసును అప్పగించటం వల్ల స్వేచ్ఛ సిద్ధించకపోగా అది నశిస్తుందని గ్రహించి కమ్యూనిజాన్ని, మతాన్ని వదులుకున్నాడు. మానవ జీవిత రంగాలన్నింటిలోనూ అర్థవంతమైన స్వేచ్ఛను ఇచ్చే మానవవాద వైఖరి ఉండాలని భావించాడు.

మనిషిని బానిసత్వంలోకి నడిపించే పరిస్థితి ఎంతమాత్రం పనికిరాదని భావించాడు. మనిషి బానిసగా మారే పరిస్థితి వస్తే మతాధిపతికైతేనేమి ? రాజుకైతేనేమి ? పెట్టుబడిదారుకైతే నేమి ? వర్గాధిపతికైతేనేమి ? అది ఎంతమాత్రం వాంఛనీయం కాదు. మనిషిని సర్వస్వతంత్ర జీవిగా చేసే మానవవాదమే వాంఛనీయము అని తెలుపుతూ మానవవాద తత్వాన్ని ప్రతిపాదించాడు. మానవుని శ్రేయస్సుకు పాటుపడే విధంగా చేయడమే మానవవాద లక్ష్యం అన్నాడు. అంతేకాదు మానవవాద లక్ష్యము, దానికి సాధనం కూడా మనిషే అన్నాడు. ఇలా ప్రవచించిన ఎం.ఎన్.రాయ్ మానవవాద తత్వవేత్తగా భారతదేశ చరిత్రలో సుస్థిరమైన స్థానాన్ని కల్పించుకున్నాడు.

అతడు ఏ దశలో ఉన్నా, ఏ దిశగా పయనించినా అన్నింటా నిర్భయత్వమే ఆయన ఊపిరి. సాహసానికి మరోపేరు. అన్నింటికీమించి మానవతావాది. ఆ మానవతావాదమే అతడికి చరిత్రలో ఒక ఉన్నత స్థానాన్ని కల్పించింది.

మన దేశంలో జాతీయోద్యమంలో పాల్గొన్నవారిలో చాలామందికి ఈ దేశంలో జాతీయోద్యమంలో పాల్గొన్న అనుభవమే గాని ఇతర దేశాలలోని ఉద్యమాలలో పాల్గొన్న అనుభవం లేదు. అంతేకాదు, ఇతర దేశాలలోని వ్యక్తులతో కూడా సాన్నిహిత్య సంబంధం లేదు. అలా ఉన్నవారిలో చాలా కొద్దిమంది మాత్రమే కనబడతారు. మన జాతిపిత మహాత్మా గాంధీకి దక్షిణ ఆఫ్రికాలోని భారతీయుల హక్కుల సాధనకై విజయవంతమైన ఉద్యమాన్ని నిర్వహించిన ఘనచరిత్ర ఉంది. జవహర్‌లాల్ నెహ్రూకి కూడా ఎందరో విదేశీయులతో సాన్నిహిత్య సంబంధం ఉంది. విప్లవ నాయకుడు దరిశి చెంచయ్యగారు విదేశాలలో మహాసాహసోపేతమైన విప్లవాలలో పాల్గొన్న విషయం తెలుగువారందరికీ గర్వకారణం. ఇలాంటి ఉదాహరణలు మనకు చాలా తక్కువగా మాత్రమే కనబడతాయి.

మన కథానాయకుడు ప్రపంచంలోని పలుదేశాలలో సాహసోపేతమైన కార్యాలు చేసాడు. జర్మనీ, జపాన్, చైనా, అమెరికా, మెక్సికో, అన్నింటికి మించి రష్యా ఇలా ఒక్కటేమిటి ఒక్కో దేశంలో అతడు చేసిన సాహస గాధలన్నింటిని చెపితే–ఒక్కో దేశంలో అతడు చేసిన సాహసగాథలు ఒక్కో గ్రంథంగా చెప్పవచ్చు. అయితే ఈ సాహసగాథలన్నింటికి ఒక ప్రధాన సూత్రం ఉన్నది. ఎక్కడ ఉన్నా ఏం చేసినా, అతడి దృష్టి భారతదేశ స్వాతంత్ర్యం పైనే ఉన్నది. అంతేకాదు, అట్టడుగున దారిద్ర్యరేఖ దిగువ స్థాయిలో ఉన్న భారతీయుడి పైనే ఉన్నది. అన్నింటికీ మించి మానవుడి స్వేచ్ఛపైనే ఉన్నది. ఈ లక్ష్య సాధన కోసం ఎంతటి సాహసమైనా అతడు చేస్తాడు. ఎంతటి ఉన్నత స్థాయిలో ఉన్నవారినైనా ఎదిరించి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టు కుంటాడు. ఎక్కడున్నా తన ఆత్మ విశ్వాసాన్ని, చిత్తశుద్ధిని వదులుకోలేదు. రష్యాలో ఉన్న మహానాయకుడు "లెనిన్" అయినా సరే – ఉక్కుమనిషి "స్టాలిన్" అయినా సరే – మహాత్మాగాంధీ అయినా సరే – ఒకరికి

తలవంచడమన్న ప్రసక్తే లేదు. తార్కిక దృష్టిని విడిచి ఒకరిని గుడ్డిగా అనుసరించడమూ లేదు. స్వప్రయోజన సాధన లక్ష్యం కాదు. హేతువును, నీతిని, మానవతను నమ్మిన ప్రజల మనిషి ఎం.ఎన్.రాయ్.

ఎం.ఎన్.రాయ్ బహుభాషావేత్త, బహుగ్రంథకర్త. రాయ్‌కి బెంగాలి, ఇంగ్లీషు, జర్మన్, రష్యన్, స్పానిష్, ఫ్రెంచ్ వంటి పలు ప్రపంచ భాషలు తెలియటమే కాకుండా ఆ భాషలలో గ్రంథాలు రాసాడు. ఒక దేశంలో కొన్నాళ్ళు ఉన్నాడంటే ఆ దేశ ప్రజల భాషను తెలుసుకోకుండా ఉండేవాడు కాదు. అంతేకాదు ఆ దేశ భాషలలో పలు గ్రంథాలు, వ్యాసాలు రాసాడు. ఇలా బహుభాషావేత్తలు మరికొందరు ఉండవచ్చు గాని, తెలుసుకున్న ప్రతిభాషలోనూ లోతయిన భావాలతో గ్రంథాలను రాసిన వారు ప్రపంచ చరిత్రలోనే అరుదు. వేలాది సంఖ్యలలో ఆయన ముద్రిత అముద్రిత రచనలు ఉన్నాయి. ఆయన రచనల్లో కొన్నింటిని ఏరి ప్రచురించినవి అనేక వాల్యూముల్లో వచ్చాయి. అన్నింటినీ ప్రచురిస్తే ఎన్ని వాల్యూముల్లో వస్తాయో ఊహకు అందదు. ఇక్కడే ఇంకో విషయం కూడా చెప్పాలి. ఆయన రచనల్లో కొన్ని విషయాలను మాత్రమే ప్రస్తావించ లేదు. చరిత్ర, రాజకీయం, ఆర్థిక, సైన్స్, తత్వశాస్త్రం, మతం, హేతువాదం, నీతి ఇలా అనేక అంశాల మీద ఆయన రచనలు చేసారు. బెవర్ని నికోలస్ అన్నట్లు "సింహం జూలు మొదలుకొని బ్రాహ్మడి పిలక వరకు", అతడు పట్టించుకోని విషయము, విమర్శించని విషయమూ లేదు. బయట ఉన్నా, జైలులో ఉన్నా గ్రంథరచన వ్యాసంగాన్ని మాత్రం అతడు మానలేదు. జైలులో ఉన్నప్పుడు జైలు అనుభవాలతో ("Behind Prison Bars") (జైలు గోడల లోపల) అనే రచన కూడా చేసాడు. ఆయన ముద్రిత అముద్రిత రచనలన్నింటిని డెహరాడూన్‌లో ఉన్న "ఇండియన్ రినైజాన్స్ ఇన్‌స్టిట్యూట్"లో బద్రపరచటం జరిగింది. (భారత పునరుజ్జీవన కేంద్రం).

ప్రముఖ విద్యావేత్త ఆవుల సాంబశివరావు గారు రాయ్ దృక్పథ సారాంశాన్ని గురించి చెబుతూ ఇలా అంటారు– "అన్నింటికి మూలం మనిషి. ఒక రాజ్యానికే కాదు. సమాజానికి కూడా వ్యక్తి సూత్రప్రాయుడు. ప్రతి పౌరుడు ఒక వ్యక్తే ! – ఆ వ్యక్తిత్వం పూర్తి వికాసం పొందే రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక జీవితం అతడికి కావాలి. అతడిని పీడిస్తున్న మత, సామాజిక శక్తుల చెరసాల నుండి వ్యక్తిని విముక్తి చేయాలి.

అతడికి భావనాస్వేచ్ఛ ఉండాలి. అందుకు వికాసోద్యమం అవసరం. మానవుని ప్రాతి పదికగా భావించి ప్రవర్తించే సమాజమే ప్రజాస్వామ్య సమాజం. అతడి వ్యక్తిత్వ వికాసానికి అవకాశం ఇచ్చేదే సిసలైన ప్రజాస్వామ్యం". ఎం.ఎన్.రాయ్ తన జీవిత చివరి భాగంలో ప్రతిపాదించిన నవ్యమానవవాద సారాంశం ఇదే !

అదే విధంగా 'రాయ్' కలలు గన్న ఆర్థిక విధానం గురించి చెబుతూ ఆవుల వారు - అటు కాపిటలిస్టు విధానంగాని, ఇటు సోషలిస్టు విధానం గాని, ప్రజలను భాగస్వాములుగా చేయలేవు. ఒకదానిలో పెట్టుబడిదారు ఆధిపత్యం ఉంటే మరొకదానిలో ప్రభుత్వమే పెత్తం దారీతనం జరుపుతుంది. ఈ రెండింటి వల్ల ప్రజలకు ఒరిగేదేమీ లేదు అన్నాడు "రాయ్"-

ఇలా చూసుకుంటూ పోతే ఆయన జీవితాన్ని తడిమి చూసినపుడు రాయ్‌లోని ఒక మహామేధావి, సాహసి, దేశభక్తుడు మనకు పరిచయం అవుతాడు. వివిధ దశల్లో తన అభిప్రాయాలను వ్యక్తీకరిస్తూ రాయ్ పలు గ్రంథాలను వ్రాయడమే కాక, పలు పత్రికలను కూడా నిర్వహించాడు. "మాసెస్", "వేన్‌గార్డ్", "ఇండిపెండెంట్ ఇండియా", రాడికల్ హ్యూమనిస్ట్", 'ది మార్క్సియన్ వే", "ది హ్యూమనిస్ట్ వే" పంటి పత్రికలకు సంపాదకత్వం వహించడమే గాక, వాటిలో పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు రాసాడు. మారుతున్న రాయ్ మనోభావాలకు ఈ పత్రికలలోని వ్యాసాలు అద్దం పడతాయి.

రాయ్ భావపరిణామాన్ని వివరిస్తూ కొందరు విశ్లేషకులు దానిని "జాతీయవాదం (నేషనలిజం), కమ్యూనిజం, మానవవాదం, (Humanism) అని అభివర్ణించారు కాని ఆయన పరిణామాన్ని చెందిన అన్ని దశల్లోనూ మానవుడు, మానవుని స్వేచ్ఛకై జరిగే అన్వేషణ (Quest for freedom) అనేవే ప్రాతిపదిక అంశాలుగా ఉన్నవి.

ఈ దశలన్నింటిలో ఎన్నో నిమ్నోన్నతాలు ఉన్నవి. విజయాలు, వైఫల్యాలు ఉన్నవి. విదేశాలలో ఒక పరాయి దేశస్థుడు అధిరోహించడానికి ఊహకు కూడా అందని శిఖరాలను అతడు అందుకున్నాడు. అయితే ఆ శిఖరాల నుండి ఒక్కసారిగా క్రిందకు జారిపడ్డాడు. కీర్తి, గౌరవాలతోపాటు అవమానాలు, అప్రతిష్టలు, అభియోగాలు, అపనిందలు ఉన్నాయి. ముఖ్యంగా రష్యాలో అతడు పొందిన గౌరవాలు, పొందిన నిందలు, ఎదుర్కొన్న తిరస్కారాలు అసమాన్యమైనవి.

దేశంగాని దేశం మెక్సికోలో ప్రపంచంలో మొట్టమొదటిసారిగా రష్యా దేశం అవతల కమ్యూనిస్టు పార్టీని స్థాపించి చరిత్రను సృష్టించిన వ్యక్తి ఎం.ఎన్.రాయ్. అది చూచి నివ్వెరపడిన "లెనిన్" రాయ్‌ని రష్యాకు రావలసిందిగా ఆహ్వానించాడు. అంతేకాదు రష్యాలో లెనిన్, ట్రాట్స్కీ స్టాలిన్ వంటి వారితో సరిసమానమయిన రీతిలో రాయ్ కమ్యూనిస్టు పార్టీ భవిష్యత్తు కార్యక్రమాలను గురించి చర్చించాడు. కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్‌లో "రాయ్"ని అత్యున్నత పదవులలో నియమించారు. కమ్యూనిస్టు పార్టీకి అత్యంత ఉన్నతమైన "కమింటరన్" అధిష్టానంలో "రాయ్" ఒక ముఖ్యమైన సభ్యుడిగా వెలిగాడు. లెనిన్ మాటకు ఎవరూ ఎదురు చెప్పడానికి సాహసించని రోజుల్లో రాయ్ తన అభిప్రాయాలను నిర్భయంగా లెనిన్‌కు చెప్పి అతడిని మరోసారి ఆలోచింపచేయగలిగాడు.

కాని, చివరకు కమ్యూనిస్టు పార్టీ నుండి బహిష్కరింపబడ్డాడు. స్టాలిన్ ఆధిపత్యంలోని రష్యాలో అతడి నిరాదరణకు గురియై హత్యకు గురికాకుండా బయటపడ్డ అతి కొద్ది మందిలో

రాయ్ ఒకడు. స్టాలిన్ పరిపాలనా కాలంలో ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని బ్రతుకు జీవుడా అనుకుంటూ భారతదేశానికి తిరిగివచ్చాడు. నెత్తికెత్తుకున్న కమ్యూనిస్టులే అతడిని శ్రామిక ద్రోహి, తిరోగమనవాది, సామ్రాజ్యవాదుల ఏజెంటు, నిధులను దుర్వినియోగం చేసిన అవినీతిపరుడు అంటూ ఎన్నో రకాలుగా నిందించారు. భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఎన్నో శక్తులు అడ్డుపడ్డాయి. అతడు ఎన్నో విధాల పరితపిస్తే – అతనికి ఆవిధమైన గౌరవం దక్కకుండా ఇలా ఎన్నో రకాలైన అవమానాలు ఎదురైనా, ఆత్మవిశ్వాసంతో తాను నమ్మిన లక్ష్యాన్ని చేరుకొనేం దుకు నిరంతరం పరిశ్రమించిన అన్వేషి "రాయ్".

ఈ విధంగా పలురకాలైన వైవిధ్యాలతో నిండిన ఇంద్రధనుస్సు లాంటి జీవితాన్ని జీవించిన వ్యక్తి ఎం.ఎన్.రాయ్. ఈ ఇంద్రధనస్సులోని పలువిధమైన వర్ణాలను సంక్షిప్తంగా ఈ గ్రంథంలో వివరించడం జరుగుతుంది.

**– 2 –**

మన కథానాయకుడి అసలు పేరు "మానవేంద్రనాథ్ రాయ్" కాదు. తల్లిదండ్రులు అతడికి పెట్టిన అసలు పేరు "నరేంద్రనాథ్ భట్టాచార్య". భారతదేశం విడిచిపెట్టేంత వరకు అతడు తన అసలు పేరుతోనే వ్యవహరించబడుతూ ఉండేవాడు. అటు తరువాత అతడు పెట్టుకున్న రకరకాలయిన పేర్ల గురించి తరువాత చర్చించుకుందాం. ఇకనుంచి కొంత కథ నడిచేంతవరకు అతడిని "నరేంద్రనాథుడు" గానే వ్యవహరించటం జరుగుతుంది.

నరేంద్రనాథుడు బెంగాల్ రాష్ట్రంలోని ఒకప్పటి ఇరవైనాలుగు పరగణాల జిల్లాలో ఉన్న"అర్బేలియా" (Arbelia) అనే గ్రామంలో 1887వ సంవత్సరం మార్చి 21వ తేదీన అంటే ప్రథమ స్వాతంత్ర సంగ్రామం జరిగిన మూడు దశాబ్దాలకు జన్మించాడు. తండ్రి పేరు "దీనబంధు భట్టాచార్య", తల్లిపేరు "వాసంతీదేవి". అయితే వాసంతీదేవి, దీనబంధు భట్టాచార్యకు మొదటి భార్య కాదు.మొదటి భార్య "రోథన్ కుమారి" చనిపోతే దీనబంధు ఈమెను వివాహం చేసుకున్నాడు.

దీనబంధు భట్టాచార్యది వంశపారంపర్యంగా పూజారీ కుటుంబం. వారి కుటుంబీకులు "క్షేపుత్" గ్రామంలో ఉన్న "క్షేపుతీశ్వరీ దేవి" ఆలయంలో పూజారులుగా పనిచేస్తూ ఉండేవారు. కుటుంబానికి వంశపారంపర్యంగా వచ్చిన వృత్తిననుసరించి దీనబంధు భట్టాచార్య కూడా ఆ ఆలయంలోనే పూజారిగా పనిచేస్తూ ఉండేవాడు. అయితే పూజారిగా వచ్చే ఆదాయం కుటుంబ పోషణకు సరిపోయేది కాదు. అందుచేత దీనబంధు 'అర్బేలియా'కు చేరుకుని అక్కడి ఇంగ్లీషు పాఠశాలలో ఉద్యోగం సంపాదించుకున్నాడు. అక్కడే నరేంద్రనాథుడు జన్మించాడు.

దీనబంధు భట్టాచార్యకు ఎనిమిదిమంది సంతానం. వారిలో నరేంద్రనాథుడు నాల్గవ వాడు. నరేంద్రనాథుడి ప్రాథమిక విద్యాభ్యాసం అంతా 'అర్బేలియా'లోనే జరిగింది. అక్కడ ఉండగానే అతడు తండ్రి దగ్గర సంస్కృతం నేర్చుకున్నాడు. అంతేకాదు చిన్నవయస్సులోనే అతడు సంస్కృతంలోని ఎన్నో తాత్విక, తర్క శాస్త్ర గ్రంథాలను చదివాడు. ఈ పరిజ్ఞానం అతడికి ఆ తరువాతి కాలంలో ఎంతగానో ఉపయోగపడింది.

కొన్నాళ్ళ తరువాత నరేంద్రనాథుడి తండ్రి కలకత్తాకు పన్నెండు మైళ్ల దూరంలో ఉన్న 'చాంగ్రిపోటా" అనే గ్రామానికి కుటుంబాన్ని మార్చాడు. అక్కడే నరేంద్రనాథుడి విద్యాభ్యాసం కొనసాగింది.

చాంగ్రిపోటాలో ఉండే రోజుల్లోనే నరేంద్రనాథుడిపై శివనారాయణస్వామి అనే దేశభక్తుడి ప్రభావం పడింది. శివనారాయణ స్వామి 1857వ సంవత్సరంలో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నవాడు. వర్ణ వ్యవస్థ అనేది హిందూ మతానికి పట్టిన జాడ్యం అని - కుల మత భేదాలు అనేవి నిర్మూలించబడితేనేగాని భారత దేశానికి విముక్తి లేదని అతడు తరచూ చెపుతూ ఉండేవాడు. అంతేకాదు దాస్యశృంఖలాలతో బంధించబడిన భారతమాతకు దాస్య విముక్తిని కల్పించటం ప్రతీ భారతీయుడి కర్తవ్యం అని నమ్మిన వ్యక్తి. ప్రజలలో జాతీయ భావాలు పెంపొందింపబడాలని, యువతీ యువకులందరూ యోగాసనాలు, సాముగరిడీలు నేర్చుకోవాలని అతడు ఉపదేశించేవాడు. ఈ లక్ష్యసాధన కోసం అతడు 'కొడాలియా' అనే గ్రామంలో ఒక ఆశ్రమాన్ని కూడా స్థాపించాడు.

శివనారాయణ స్వామి భావాలతో ఆకర్షితుడైన నరేంద్రనాథుడు 'కొడాలియా' ఆశ్రమంలో చేరి యోగాసనాలు, సాముగరిడీలు అభ్యసించాడు. దేశభక్తుల వీర గాథలు వింటూ ఉత్తేజితుడయ్యేవాడు. నరేంద్రనాథుడి లేతవయస్సులో శివనారాయణ స్వామి జాతీయవాద స్ఫూర్తిని రగిలించాడు.

పాఠశాల చదువు ముగిసాక నరేంద్రుడు కలకత్తాలోని నేషనల్ కాలేజీలో విద్యార్థిగా చేరాడు. ఆ కాలేజీకి ఒకనాటి ప్రముఖ విప్లవవాది, ఆ తరువాతి కాలంలో ప్రముఖ తత్త్వవేత్త, యోగి అయిన అరవిందుడు ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు. అతడి భావాలు నరేంద్రనాథుడిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఆ తరువాతి కాలంలోని జీవితానికి ఆ భావాలే నరేంద్రనాథుడికి ఒక మార్గానికి చూపయ్యింది. ఇక అక్కడి నుండి మొదలయింది అసలు కథ. ఆ వివరాలు తెలుసుకునే ముందు ఆ రోజులలో బెంగాల్‌లో రగిలిన జాతీయవాద, ఉగ్రజాతీయవాద, జాతీయోద్యమ స్ఫూర్తిని, వాటిని రగిలించిన కొందరు ప్రముఖుల గురించి తెలుసుకోవలసి ఉంది. ఎందుకంటే వారందరి ప్రభావం ఆనాటి యువకులపైన ప్రత్యేకించి నరేంద్రనాథుడిపైన ఉన్నది



# 2
# భారత జాతీయోద్యమ స్ఫూర్తి ప్రదాతలు

**జా**తీయ భావము (Nationalism) అనేది జాతీయతావాదానికి ప్రాతిపదిక. వ్యక్తి లేదా వ్యక్తుల సమూహాల ప్రయోజనం కన్నా దేశం ముఖ్యం అనే భావన ప్రజలలో జాతీయతా వాదాన్ని రగిలిస్తుంది. జాతీయతావాద స్ఫూర్తి ఒక ఉద్యమంగా రూపొందినపుడు అది జాతీయోద్యమంగా కార్యరూపం దాలుస్తుంది.

భారతదేశ ప్రజలలో జాతీయతా భావాన్ని కలిగించినవారిలో బంకించంద్ర ఛటర్జీ, వివేకానందస్వామి, అరవిందుడు ముఖ్యులు. వీరందరూ రగిలించిన స్ఫూర్తి ప్రభావంగానే ఒకనాడు "వందేమాతరం" ఉద్యమం తెల్లదొరలను గడగడలాడించింది.

బంకించంద్ర ఛటర్జీ (1838-94) పేరు చెప్పేసరికి అతడు రాసిన "ఆనంద్ మఠ్" (1882) నవల జ్ఞాపకానికి వస్తుంది. బెంగాలీ భాషలో రాయబడిన ఈ నవల భారతీయ భాషలన్నింటిలోకి అనువదించబడి – ఆనాటి భారతీయ యువతీ యువకులలో ఎనలేని చైతన్యం రగిలించింది.

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సమరం ముగిసిన రెండు దశాబ్దాల తరువాత ఈ నవల వచ్చింది. సిపాయిల కలహాన్ని బ్రిటిషు వారు అతిక్రూరంగా అణచివేయటం ఆలోచనా పరులైన ఆనాటి భారతీయుల గుండెల్లో గాయాన్ని చేసింది. సహజంగానే మాతృదేశాభిమాని అయిన బంకించంద్రుడి గుండెల్లో ఇది ఎంతో ఆవేదనను రగిలించింది. 1573లో అంటే ప్రథమ స్వాతంత్ర్యానికి ముందే కొదరు సన్యాసులు కంపెనీ దొరలపై తిరుగుబాటు చేయడం ఈ నవల ఇతివృత్తం. ఇహలోక బంధాలన్నింటిని తెంచుకొని మాతృదేశ దాస్య విముక్తికి ఎంతటి త్యాగాన్నైనా చేయడానికి సిద్ధపడటంలోనే ఆనందం ఉందని భావించే సన్యాసులు ఉండే ప్రదేశమే ఆనందమఠం.

ఈ నవలలో బంకించంద్రుడు హిందూ దేశ ప్రజలను దోచుకు తింటున్న తెల్లదొరలపై హింసాత్మక చర్యలు చేసయినా సరే భరతమాత దాస్య శృంఖలాలు తెంచమని ప్రబోధిస్తాడు. 'ఆనంద్ మఠ్' నవలలో సర్వసంఘ పరిత్యాగం చేసిన వేలాదిమంది సన్యాసులు – కంపెనీ దొరలు ప్రజలను పీడించి, వసూలు చేసిన పన్నులను తీసుకువెళ్లే బండ్లపై దాడిచేసి, ఆ ధనాన్ని లూటీ చేయడం, దానిని కాపాడబోయిన తెల్ల సైనికులను హతమార్చాడం, వారి ఆయుధాలను దోచుకోవడం, ఫిరంగులను తయారుచేసే విధానాలను కనుగొనటం మొదల యిన విషయాలెన్నో ఉన్నాయి.

దేశదాస్య విముక్తి ముఖ్యం. దానిని సాధించడం కోసం ఎంతటి హిసాత్మక చర్యలు చేపట్టినా తప్పులేదు. ఆయుధ శక్తి లేనిదే తెల్లవారిని ఎదిరించలేము. దాని కోసం ఎలాంటి హింసాత్మక చర్యలు చేపట్టి అయినా సరే దానిని సమకూర్చుకొనడం ముఖ్యం. దోపిడి చేసి విప్లవానికి కావలసిన ధనం సమకూర్చుకొనడం దోషం కాదు. – అనే సందేశం ఈ నవలలో అంతటా వినబడుతుంది.

ఈ నవలలోనే సుప్రసిద్ధమైన "వందేమాతరం" అనే పాట ఉంది. ఆ రోజుల్లో ఈ పాట రగిలించిన చైతన్యం అసామాన్యమైంది. ఈ పాటకు విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ స్వరకల్పన చేశాడు. అంతేకాదు– భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలలో దీనిని స్వాగత గీతంగా ఆలపించారు. ఆ తరువాత, కాంగ్రెస్ సభలు అన్నింటిలోనూ ఇదే స్వాగత గీతంగా ఉండేది. స్వాతంత్ర్యోద్యమం జరుగుతుండే రోజులలో లాలా లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్, బాలగంగాధర తిలక్ వంటివారు కూడా ప్రజలలో స్వాతంత్ర్యోద్యమ దీప్తిని రగిలించడానికి ఈ పాటనే ఉపయోగించుకొనేవారు. అంతేకాదు–వందేమాతరం అనే పేరుతో ఒక పత్రిక కూడా నడిచింది.

'ఆనంద్ మఠ్' నవలలో చిరుగు గుడ్డలతో, సంకెళ్ళతో అతి దైన్యంగా కన్నీళ్ళు పెట్టుకుంటున్న భారతమాత చిత్రాన్ని ఈ నవలలో ఒక పాత్ర అయిన స్వామి నిత్యానంద మహర్షి సన్యాసులకు చూపించి తల్లి కన్నీళ్ళుతుడవమని వారినుత్తేజంచేసే సన్నివేశం ఉంది. ఈ నవలలోని ఈ సన్నివేశాన్ని చదివి, "మాతృభూమి ఆవేదనను తీర్చడం కోసం నేనేమి చేయగలను ?" అని అలమటించని భారతీయుడు ఆ రోజులలో లేడు.

ఇలాంటి ఉత్తేజం ప్రజలందరిలోనూ కలిగి, వారు కార్యరంగంలోనికి దూకాలంటే – తెల్లవారికన్నా ఎందులోనూ మనం తక్కువవారం కామనీ, మన జాతి గౌరవం సామాన్యమైనది కాదనీ అనే అవగాహన – ఆత్మవిశ్వాసం మనలో పెంపొందాలి. ఈ పనిని స్వామి వివేకానందుడు (1863–1896) చేసాడు. నాడు, నేడు కూడా యువతరం వివేకానందుని పలుకులను స్ఫూర్తిగా పొందుతూ ఉంది.

"మన మాతృభూమికి ప్రపంచం అంతా ఋణపడి ఉంది" ఇంతవరకూ చాలు. గ్రీస్ అనే దేశమే లేనప్పుడు, నేటి యూరోపియన్‌ల పూర్వీకులు అడవుల్లో నివసించేటప్పుడు, ఇక్కడ మహోత్కృష్టమైన కార్యాలు జరిగాయి. మీ నరాలను ధృఢపరచుకోండి. మనకు ఇనుప కండలు, ఉక్కు నరాలు కావాలి. మనం కావలసినదానికన్నా ఎక్కువగానే దుఃఖించాం. ఇక ఈ ఏడ్పులు చాలు. మీ కాళ్ళమీద మీరు నిలబడండి, ధైర్యవంతులుకండి" అంటూ ఒకప్పుడు వివేకానందుడు చేసిన ప్రబోధాలు ఆనాటి యువకులలో ఆత్మవిశ్వాసాన్ని నింపాయి. "సాహసవంతులు, నిస్వార్థపరులు, స్వచ్ఛమైనశీలం కలిగినవారు అయిన కొద్దిమంది యువకులను నాకివ్వండి ప్రపంచాన్ని కుదిపేస్తాను" అని ఒకప్పుడు వివేకానంద స్వామి ఇచ్చిన పిలుపును వందేమాతరం ఉద్యమ కాలంలో చాలామంది యువతీ యువకులు అందుకున్నారు.

ఈ సందర్భంలోనే ఒక ముఖ్యమయిన విషయం చెప్పాలి. "వందేమాతరం" ఉద్యమం జరగడానికి ముఖ్యకారణం బెంగాల్ విభజన. ఆనాటి భారతదేశంలోని రాష్ట్రాలన్నింటి కన్నా విస్తీర్ణంలో బెంగాల్ పెద్దది. దాని విస్తీర్ణత లక్షా తొంభైవేల చదరపు మైళ్ళు. అప్పట్లో దాని జనసంఖ్య 7 కోట్ల 85 లక్షలు. ఆనాటి బెంగాల్ రాష్ట్రంలో బీహార్, ఒరిస్సా, ఛోటానాగపూర్ రాష్ట్రాలు కూడా ఉండేవి. విస్తీర్ణత దృష్ట్యా అంతపెద్ద రాష్ట్రాన్ని పరిపాలించడానికి జిల్లా యంత్రాంగానికి కష్టంగా ఉండేది.

అయితే ఈ కారణం చెప్పి ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ కర్జన్ బెంగాలు రాష్ట్రాన్ని రెండు ముక్కలుగా చేయడానికి తలపెట్టడం ఒక సాకు మాత్రమే. ఆ రోజుల్లో బెంగాలీలు భారత ప్రజలందరి కన్నా ముందు ఉండేవారు. భారతదేశంలో ఆనాడు జరిగిన ప్రతి ఉద్యమానికీ బెంగాల్ ముందడుగు వేసేది. అక్కడ ఇంగ్లీషు భాషా వ్యాప్తి ఇతర రాష్ట్రాలకన్నా అధికంగా ఉండటంచేత–ఆ రాష్ట్రంలో సంఘసంస్కరణ స్పృహతోబాటుగా రాజకీయ స్పృహ కూడా అధికంగా ఉండేది. ఒక్కమాటలో చెప్పాలంటే – పలురీతుల్లో జాతీయతా భావ దీప్తికి ఆ రాష్ట్రం కేంద్రంగా ఉండేది. ప్రజా చైతన్యానికి ఆటపట్టుగా ఉండేది. కర్జన్ పదవిలోకి రాగానే ఇలాంటి రాష్ట్రంవల్ల బ్రిటిషు ప్రభుత్వానికి ఎప్పటికైనా ముప్పు వస్తుందని భావించాడు.

సురేంద్రనాథ్ బెనర్జి వంటి వారు ప్రజలలో దేశభక్తి భావాలను రగిలిస్తూ ఉండటమూ, రాజకీయ సంఘాలు, దేశీయ పత్రికలు, అక్కడ ఎక్కువగా ఉండమూ గమనించిన కర్జన్ తన కుయుక్తికి పదును పెట్టాడు.

బెంగాల్‌లో హిందువులు, ముస్లింలున్నారు. వారిమధ్య మంచిసఖ్యతకూడా ఉన్నది. ముందు దానిని విడగొడితే తమకు ప్రయోజనకరం అని భావించాడు.

తూర్పు బెంగాల్‌లో ముస్లింల సంఖ్య అధికం. అక్కడ ఆనాడు 180 లక్షల మంది దాకా ముస్లింలు ఉన్నారు. బెంగాల్ రాష్ట్రాన్ని తూర్పు బెంగాల్, పశ్చిమ బెంగాల్ అని రెండు

భాగాలుగా విడదీస్తే - తూర్పు బెంగాల్‌లో హిందూ బెంగాలీల ప్రాధాన్యం తగ్గుతుంది. ఇక, పశ్చిమ బెంగాల్‌లో కూడా ముస్లింలు చెప్పుకోదగ్గ సంఖ్యలోనే ఉంటారు కాబట్టి - ఇదివరకు ఉన్నట్టుగా హిందూ బెంగాలీల ప్రాబల్యం ఉండదు. ఈ విభజన లక్ష్యం హిందూ బెంగాలీల ప్రాధాన్యతను తగ్గించటం మాత్రమే. ఈవిధంగా చేయడంవల్ల ముస్లింలు పైచేయిలో ఉంటారు. కాబట్టి-హిందూ ముస్లింల సఖ్యతకు అఘాతం కలుగుతుంది. ఇలా కుయుక్తితో ఆలోచించి, 1905 జూలైలో గంగానది సరిహద్దుగా బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా విభజిస్తూ చట్టం చేసాడు.

బెంగాల్ విభజన మొదటిలో బెంగాల్‌లోనూ ఆ తరువాత యావత్ భారతదేశంలోనూ ఆగ్రహజ్వాలలను రగిలించింది. ఆనాటికే బంకించంద్రుని రచనలను, వివేకానందుని ప్రబోధాలను విని ప్రభావితులయిన భారతీయులు బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఒక మహోద్యమానికి ఉద్యుక్తులయ్యారు. సురేంద్రనాథ్ బెనర్జి, బిపిన్ చంద్రపాల్, అరవింద ఘోష్ ఈ ఉద్యమానికి సారథ్యం వహిస్తే వేలాదిమంది వారికి చేయూతనిచ్చారు. (వారిలో నరేంద్ర నాథుడు కూడా ఉన్నాడు)

కేవలం బెంగాల్ విషయమే తీసుకుంటే-అరవిందఘోష్, జితేంద్రనాథ ముఖర్జీ, బీరేంద్రనాథ్ కుమార్ ఘోష్, నిరాలంబస్వామి, బ్రిటిషు ప్రభుత్వ దమననీతికి తమ విప్లవ కార్యకలాపాలతో సమాధానం చెబుతున్నారు. వీటన్నింటి ఫలితంగా భారత దేశంలోనూ ముఖ్యంగా బెంగాల్‌లోనూ ఉగ్రజాతీయవాద భావన ప్రబలింది. ఉగ్రజాతీయవాద భావపు ప్రధాన లక్ష్యం హింసాత్మక విధానాలను అవలంబించైనా సరే బ్రిటిషువారిని ఈ దేశం నుండి తరిమికొట్టడం, ఇందుకు ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడటం. ఆ రోజుల్లోనే అరవింద ఘోష్ విప్లవ చైతన్యంతో రచనలు చేస్తున్నాడు. సుదీర్ఘకాలం ఇంగ్లాండులో ఉండి భారతదేశానికి తిరిగి వచ్చి బరోడా సంస్థానంలో ఉద్యోగానికి చేరిన అరవిందుడు ఇంగ్లీషు, లాటిన్, సంస్కృతం బెంగాలీ వంటి భాషలను క్షుణ్ణంగా అభ్యసించాడు. ఆ రోజులలో అరవిందుడు రాసినంతటి గొప్ప ఇంగ్లీషును తెల్లవారుకూడా రాయలేదనే పేరు ఉండేది. ఆ రోజుల్లోనే అరవిందుడు బంకించంద్రుడి "ఆనంద్‌మఠ్" చదివి ఉత్తేజితుడయ్యాడు. "ఆనంద్‌మఠ్" నవలలోని "వందేమాతరం" గేయాన్ని చదివినప్పుడు బానిసత్వంతో మగ్గుతున్న తల్లి సంకెళ్ళు ఛేదించాలనే వజ్ర సంకల్పం అతడిలో కలిగింది. ఉరకలువేసే ఆ ఉత్సాహంతోనే అతడు వందేమాతరం గేయాన్ని ఆంగ్లంలోకి అనువదించాడు కూడా. ఆరోజుల్లోనే అతడిపై స్వామివివేకానంద ప్రభావం కూడా పడింది. అరవిందుడు ఆ రోజుల్లోనే లోకమాన్య బాలగంగాధరతిలక్, నిరాలంబస్వామి వంటి వారితో సన్నిహిత సంబంధాలు పెంచుకున్నాడు. బెంగాల్ విప్లవకారులతో చర్చలు జరుపుతూ ఉండేవాడు.

ఆప్పట్లో బెంగాలులో "అనుశీలన సమితి" అనే విప్లవ సంస్థ ఉండేది. ఆ సంస్థ ప్రధాన లక్ష్యం ఉగ్రవాద కార్యకలాపాలను కొనసాగించి బ్రిటిష్‌వారిని గడగడలాడించటం; స్వాతంత్ర్య సమరయోధులను శిక్షించిన బ్రిటిషు అధికారు లను హత్యచేయడం, వారి ఆస్తులను లూటీ చేయడం మొదలయినవి.

"మాతృదేశం అంటే ఏమిటి ? అది ఒక భూమి ముక్క కాదు. మహిషాసుర మర్దని దైవశక్తులన్నింటిని తనలో ఐక్యంచేసుకొని ఆమె భరతమాతగా అవతరించింది." అంటూ హిందూ జాతీయతా భావాన్ని ప్రజ్వలింపచేసేవాడు అరవిందుడు.

ఉగ్రజాతీయవాద లక్ష్యాలతో అరవిందుడు "భవాని మందిర్" పథకాన్ని కూడా ప్రారంభించాడు. ఇది ఒక రహస్య సంఘం. ఇలాంటి రహస్య సంఘాలు ఆ రోజుల్లో బెంగాల్ అంతటా ఉండేవి. ఇండ్ల ఖాళీ స్థలాలలో ఉండే ఈ రహస్య సంఘాలు బాక్సింగ్, సైక్లింగ్, కర్రసాములు చెప్పే తాలింఖానాలుగా ఉండేవి. ఈ కార్యక్రమాలకు కావలసిన ధన సహాయాన్ని కూడా అరవిందుడు చేస్తూ ఉండేవాడు. అంతేకాదు విప్లవకారులకు సైనిక శిక్షణ ఇప్పిస్తూండడం లోనూ, వారికి బాంబులు తయారుచేయడం నేర్పించటంలోనూ అరవిందుడి పాత్ర ఉండేది.

వందేమాతరం ఉద్యమం ఊపందుకున్న తరువాత చాలామంది దేశభక్తులైన విద్యార్థులు బ్రిటిష్ ప్రభుత్వం నిర్వహిస్తున్న కళాశాలల నుండి బయటకు వచ్చేసారు. వారికి విద్య గరపడంకోసం జాతీయ కళాశాలలు ఏర్పడినపుడు-అరవిందుడు ఒక జాతీయ కళాశాలకు అతితక్కువ జీతంతో ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు. ఆ కళాశాలలో ఎం.ఎన్.రాయ్ చదవడం మాత్రమే కాకుండా అరవిందుని శిష్యులలో ఇంకా చెప్పాలంటే ప్రియ శిష్యులలో ఒకడిగా ఉండేవాడు. అరవిందుని ప్రబోధాలు ఎం.ఎన్.రాయ్‌పై బలంగా పడ్డాయి.

ఆ రోజుల్లోనే ఆలీపూర్ బాంబు కేసు దేశమంతటా సంచలనాన్ని రేపింది. ఆ కేసులో అరవిందుడు ఒక ముఖ్య నిందితుడు. అతడిని ఆలీపూర్ జైల్లో ఒంటరిగా ఉండే జైలు గదిలో బంధించారు. ఆలీపూర్ బాంబు కేసులో అరవిందుడి పక్షాన ఆ నాటి యువ న్యాయవాది, ఆ తరువాతి కాలంలో ప్రముఖ దేశభక్తుడు అయిన చిత్తరంజన్‌దాస్ వాదిస్తూ "న్యాయమూర్తి అయిన నేను చెప్పేదేమిటంటే, ఈ వివాదం ముగిసిన చాలాకాలం తరువాత ఇంకా చెప్పాలంటే అరవిందుడు మరణించిన చాలాకాలం తర్వాత-అరవిందుడిని దేశభక్తుడైన కవిగా, జాతీయతా వాద ప్రవక్తగా, మానవులను ప్రేమించిన వ్యక్తిగా ప్రజలు గుర్తుంచు కుంటారు. ఈ మహనీయుడు చనిపోయిన చాలా కాలం తరువాత కూడా ఆయన పలుకులు భారత దేశంలోనే కాదు-"సుదూర దేశాలలో కూడా మరలా మరలా ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. అందుచేత న్యాయమూర్తి అయిన

మీకు నేను చెప్పేదేమిటంటే మీ ఎదుట నిలబడిన ఈ వ్యక్తి ఈ న్యాయస్థానం ముందే కాదు-చరిత్ర మహోన్నత న్యాయస్థానం ముందు కూడా నిలబడి ఉన్నాడని మీరు గ్రహించాలి" అంటూ అద్భుతమైన ఆంగ్ల భాషా శైలిలో చిత్తరంజన్‌దాస్ చేసిన వాదం చరిత్ర ప్రసిద్ధమైంది.

అరవిందుడిని కొన్నాళ్ళు జైలులో ఉంచిన తరువాత చిత్తరంజన్‌దాస్ వాదనా పటిమ వల్లనో, సరియైన సాక్ష్యాధారాలు లభించనందువల్లనో-అరవిందుడిని కోర్టువారు జైలు నుండి విడుదల చేశారు.

అయితే, ఆనాటికే అరవిందుడి మనస్సు ఆధ్యాత్మిక చింతనపై మరలిపోవడంతో అతడు కలకత్తా విడిచి వెళ్ళిపోయి పాండిచ్చేరిలో అరవిందాశ్రమాన్ని స్థాపించుకొని మహా యోగిగా ప్రపంచ ప్రసిద్ధుడయ్యాడు. అది వేరే కథ.

ఈ సందర్భంలోనే మరొక విషయాన్ని గురించి కూడా చెప్పాలి. భారతీయులలో జాతీయతా భావాన్ని రగిలించిన వివేకానందుడు, అరవిందుడు, బీదలపట్ల ప్రజలకు ఉండాల్సిన బాధ్యతను కూడా గుర్తుచేశారు. దీని ప్రభావంకూడా ఎం.ఎన్.రాయ్‌పై ఉన్నది. ఆ తరువాతి కాలంలో అతడు కమ్యూనిజంవైపు మరలడానికి ఇది కూడా ఒక ముఖ్యమైన కారణం.

ఈ సందర్భంలో వివేకానందుని కొన్ని అమూల్యమైన సూక్తులను ప్రస్తావిస్తాను.

"ఆధునిక భారతదేశం-రైతుల పాకల్లోంచి, చెప్పులుకుట్టేవాళ్ళ దుకాణాల్లోంచి, రోడ్లు తుడిచేవాళ్ళ ఇళ్ళల్లోంచి ఎదగాలి. రైతుల నాగళ్ళల్లోంచి, అడవులలోంచి, పర్వత శ్రేణులలోంచి ఎదగాలి." వివేకానందుని ఈ సూక్తి అర్థం-భారతదేశ అభ్యుదయం ఏదో ఒక వర్గ ప్రజల అభ్యుదయంపై ఆధారపడి ఉండదని - కర్షకులు, కార్మికులు, నిమ్నజాతి వర్గాలు ఇంట్లాంటి బడుగు జీవులందరూ ఆనందంగా ఉన్నప్పుడే మన దేశం బాగుపడినట్టు అర్థం అని చెపుతు న్నాడు వివేకానందుడు ఈ సూక్తిలో.

వివేకానందుడు ఇంకా ఇలా చెప్పాడు. "అన్నింటికన్నా పెద్ద జాతీయ పాపం బీదలను నిర్లక్ష్యం చేయడం. అది తొలగని రోజున దేశం కుప్పకూలిపోతుంది. అట్టడుగు వర్గం ప్రజలు విద్యావంతులై, ఆహారభద్రతను కలిగి ఉండి, తగువిధంగా సంరక్షించబడకపోతే, దేశం రాజకీయంగా ఎంత ఎత్తు ఎదిగినా ప్రయోజనం లేదు. వారు మనం విద్యావంతులం అయ్యేందుకు పన్నుల రూపంలో డబ్బులు చెల్లిస్తారు. మన దేవాలయాలను నిర్మిస్తారు. ఫలితంగా తన్నులను తింటారు. అక్షరాల వాళ్ళు మనకు బానిసలు. భారతదేశాన్ని పునర్జీవింప చేయాలనే సంకల్పం మనకు ఉంటే-వారి శ్రేయస్సుకై పాటుపడాలి."

వివేకానందుడు ఇంకా ఇలా అంటాడు. "నేను భారతీయుడ్ని. భారతీయులందరూ నా సోదరులు, భారత జాతీయతే నా జీవితం–భరతమాతకోసం త్యాగం చేయడానికి మనం జన్మించామని మర్చిపోకండి. అధముడు, అమాయకుడు, బీదవాడు, నిరక్షరాస్యుడు, రోడ్డు తుడిచేవాడు, వీరందరూ మీ సోదరులని మర్చిపోకండి – వీరులారా ! ధైర్యంగా ఉండండి సాహసవంతులుకండి. భారతీయులైనందుకు గర్వించండి. – ఓ విశ్వమాతా ! నాలో పౌరుషత్వాన్ని రేకెత్తించు. ఓ మహాశక్తి ! నాలోని బలహీనతను, పిరికితనాన్ని తొలగించు. నన్ను నిజమైన పురుషునిగా రూపొందించు." ఇట్లాంటి వివేకానంద సూక్తులు ఎం.ఎన్.రాయ్‌ని ఆ రోజుల్లో ఎంతగానో కదిలించాయి. సాహసభావాలను జాతీయతా భావాలను అట్టడుగు ప్రజల ఉద్ధరణకు పురిగొల్పాయి. ఆ రోజుల్లో వివేకానందుడు ఎం.ఎన్.రాయ్ వంటి యువకులనెందరినో ఉత్తేజింపచేసాడు.

భారతీయ యువతను చైతన్యవంతంచేసి–తాను ముందుగా విప్లవోద్యమంలోకి దూకి, యువకులకు ఆదర్శాన్ని చూపిన అరవిందఘోష్ 'ఆహ్వానము' అనే పేరుతో ఆ రోజుల్లో ఒక గీతాన్ని ఆంగ్ల భాషలో రచించాడు.

"పెను తుఫానులు నన్ను ఆవరించినపుడు
ఎడారి భూముల్ని, కొండగుట్టల్ని దాటుకుంటూ
సెలయేళ్ళపైన మంచు కొండలపైన వడివడిగా
ఒంటరిగా నడిచిపోతున్నా
నాతో ఎవరు వస్తారు నాతో ఈ కొండ చరియల్ని
ఎవరు ఎగబ్రాకుతారు
ఎవరు చిరంజీవులుగా ఉంటారు ఎవరు స్వేచ్ఛగా
మనుగడ సాగిస్తారు" ?

అంటూ అరవిందుడు ఇచ్చిన ఆహ్వానాన్ని ఆ రోజులలో అందుకొన్నవారిలో ఎం.ఎన్.రాయ్ ముఖ్యుడు.



# 3

# ఉగ్రజాతీయవాదిగా ఎం.ఎన్.రాయ్

ప్రపంచంలో జరిగిన విప్లవాలలో మూడు విప్లవాలు చరిత్ర ప్రసిద్ధమైనవి.

**మొదటిది :** 1757లో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం సాధించడం కోసం జరిగిన ఫ్రెంచి విప్లవం.

**రెండవది :** పరదేశ దాస్య విముక్తి నుండి తన దేశాన్ని రక్షించుకొనేందుకు మెజిని నాయకత్వంలో జర్మనీలో 1850వ సంవత్సరం ప్రాంతంలో జరిగిన విప్లవం.

**మూడవది :** 1917వ సంవత్సరంలో జరిగిన రష్యన్ మహా విప్లవం. ఈ మూడూ హింసాత్మకమయిన విప్లవాలే. రక్తం ఏరులై పారిన విప్లవాలే !

ఈ మూడింటి ప్రభావం ఉగ్రజాతియవాదులు భారత స్వాతంత్ర్య సిద్ధికోసం జరిపిన పోరాటాలపై ఉంది.

ఉగ్రజాతీయవాదిగా రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన ఎం.ఎన్.రాయ్ పై - ఈ మూడు విప్లవాల ప్రభావంకూడా ఉంది.

నూనూగు మీసాల వయస్సులో నరేంద్రనాథుడుగా ఆ రోజులలో పిలువబడిన యువకుడు విప్లవ కార్యకలాపాలలో దూకడానికి ఈ విప్లవాలే మార్గదర్శకత్వం చేసాయి. వీటన్నింటివల్ల నరేంద్రనాథుడు జాతీయతా భావంతో ఉప్పొంగిపోతూ ఉండేవాడు. ఆ రోజులలో యువతరాన్ని తన ఉపన్యాసాలతో ఉర్రూతలూగిస్తున్న సురేంద్రనాథ్ బెనర్జీని తీసుకువచ్చి ఒక సభను ఏర్పాటు చేసాడు. ఈ కార్యక్రమంలో అతడి మిత్రులయిన హరికుమార్ చక్రవర్తి, శైలేశ్వర బోస్ ఇతనికి ఎంతగానో సహకరించారు. ఇంతకూ-అప్పటికి నరేంద్రనాథుడు ఒక పాఠశాలలో చదువుకొనే విద్యార్థి మాత్రమే ! - ఆ రోజుల్లోనే అతడు చాలా ధైర్యస్థుడిగా ఉండేవాడు. దేనినో అన్వేషిస్తూ అవిశ్రాంతంగా ఉండేవాడు. అందరూ దయ్యాలు, భూతాలు గురించి చెబుతూ భయపడుతూ ఉంటే, నరేంద్రనాథుడు అర్థరాత్రులు స్మశానానికి వెళ్లి దెయ్యాలను చూద్దామని అక్కడ తిరుగాడుతూ ఉండేవాడు. చిన్నతనంలో నరేంద్రనాథుడి ధైర్యసాహసాలు ఎలాఉండేవో చెప్పడానికి మాత్రమే ఇది రాయడం జరిగింది.

ఆ రోజుల్లో నరేంద్రనాథుడు అరవిందఘోష్ సోదరుడు నిర్వహిస్తున్న 'అనుశీలన సమితి'లో సభ్యుడిగా చేరాడు. అంతకు ముందు బేలూరు రామకృష్ణ మఠంతో సహా అనేక ఆశ్రమాలను అతడు సందర్శించాడు. వారందరి ప్రబోధాలలో ఉన్న జాతీయతా భావన అతడిని ఎంతగానో ఆకట్టుకుంది గాని, జాతీయ భావనను, మతభావనను ఒకదానితో ఒకటి ముడిపెట్టడం అతడికి ఎంతమాత్రం రుచించలేదు. పూజారీ కుటుంబంలోంచి వచ్చినవాడైనప్పటికీ అతడికి

మతంపట్ల నమ్మకం లేదు. అయితే వివేకానందుని బోధనలలో ప్రజలకు బీదలపట్ల గల బాధ్యతను గుర్తుచేయడం అతడిని ఎంతగానో ఆకట్టుకుంది.

"అనుశీలన సమితి"లో ఉగ్రవాద కార్యకలాపాలే గాక, సేవా కార్యకలాపాలు కూడా భాగంగా ఉండేవి. ఇది అతడికి ఎంతగానో నచ్చింది.

ఆ రోజుల్లో దేశంలో పలుచోట్ల తీవ్ర దుర్భిక్షం ఏర్పడింది. కరువు కాటకాలతో బాధపడే ప్రజలపట్ల పరాయి ప్రభుత్వం శ్రద్ధ చూపించేది కాదు. ఈ పరిస్థితిలో అనుశీలన సమితి సభ్యులు ఈ విషయం తమ తక్షణ కర్తవ్యంగా భావించి కరువు కాటకాలతో బాధపడే ప్రజలకు సేవలు చేయాలని నిశ్చయించుకున్నారు. ఇందుకు గాను నరేంద్రనాథుడిని, హరికుమారునితో మరికొందరిని ఒరిస్సాలోని కరువు పీడిత ప్రాంతాలలో సేవా కార్యక్రమాలు చేసేందుకు పంపారు. నరేంద్రనాథుడిని "రూరాయహట్" (Ruraiahul) శిబిరానికి బాధ్యుడుగా నిర్ణయించారు. ఆ శిబిర బాధ్యతలను నరేంద్రనాథుడు అద్భుతంగా నిర్వహించి సమితి సభ్యుల మన్ననలను అందుకున్నాడు.

అనుశీలన సమితి రహస్య కార్యక్రమాలు నిర్వహించే సంఘం కాబట్టి, అందులో ప్రవేశం లభించటం కష్టం. ఒకవేళ అది లభించినా సమితిలో ముఖ్యుడిగా ఎదగడం చాలా కష్టం. ఒరిస్సా సేవా కార్యక్రమాలలో నరేంద్రనాథుడి పాత్ర అందరికీ ఆనందం కలిగించింది కాబట్టి అతడు త్వరగానే ముఖ్య సభ్యుడిగా ఎదగగలిగాడు.

"న్యూ ఓరియంటేషన్" అనే రచనలో ఎం.ఎన్.రాయ్ తన తొలినాటి రాజకీయ జీవితాన్ని గురించి చెబుతూ – "14 ఏళ్ళ స్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడు నేను రాజకీయ జీవితాన్ని ప్రారంభించాను. స్వేచ్ఛ కావాలి అనేదొక్కటే ఆలోచన. ఆ రోజులలో మేమెవరమూ "మార్క్స్" రచనలు చదవలేదు. "ప్రోలిటేరియట్" అంటే ఏమిటో తెలియదు. 'వర్గ సంఘర్షణ' అంటేఏమిటో అసలు తెలీదు. అయితే చాలామంది పోరాటాలు జరిపి జైళ్ళకు వెళ్ళారని, కొంతమంది ఉరి తీయబడ్డారని మాత్రం తెలుసు. సహించలేని విషయాలపట్ల తిరగబడాలన్న తపన మాత్రం ఉంది. అయితే పరిస్థితులు ఎలా మారాలన్న విషయం స్పష్టంగా తెలియదు. మార్పు రావాలన్న విషయం మాత్రమే తెలుసు. ఈ ఉత్సాహంతోనే నేను రాజకీయ జీవితాన్ని ప్రారంభించాను." అని రాసుకున్నాడు.

అనుశీలన సమితికి కలకత్తాలోనే కాదు – ఆనాటి భారతదేశంలో 'ఢాకా'తో సహా పలుచోట్ల శాఖలుండేవి. ఆశాఖలన్నీ పోటీపడి రహస్య విప్లవ కార్యకలాపాలు చేస్తూండేవి. రాజకీయాలు కూడా ఉండేవి. ఒక్కొక్క సమితికి ఒక్కొక్క నాయకుడు ఉండేవాడు. వీరిమధ్య విభేదాలు ఎలా ఉన్నా, అందరి లక్ష్యము ఒకటే కాబట్టి – అవసరం వచ్చినపుడు అందరూ

కలిసి పనిచేసేవారు. వారందరి లక్ష్యము సాయుధ దాడులు చేసి, తెల్లజాతి అధికారులను హతమార్చటం, ప్రభుత్వ ధనాన్ని దోపిడీ చేయడం, మొదలైనవి. బెంగాల్‌తో పాటు పంజాబ్‌లో కూడా ఉగ్రవాద కార్యక్రమాలను వారు విస్తృతంగా నిర్వహించేవారు.

అనుశీలన సమితి సభ్యుడిగా నరేంద్రనాథుడు బాంబులు తయారు చేయడం, వాటిని విజయవంతంగా ప్రయోగించటం మొదలైన విషయాలలో శిక్షణ పొందాడు. ఈ కార్యక్రమాలన్నీ చేయడానికి ద్రవ్యం కావాలి కాబట్టి దోపిడీలు చేసేవారు. దోపిడీలు చేయడంలో నరేంద్రనాథుడికి ప్రత్యేకమైన అనుభవం, ప్రత్యేకమైన నిపుణత ఉండేవి.

ఆనాటి రాయ్ గురించి చెపుతూ " M.N.Roy - The Man who looks Ahead" అనే గ్రంథంలో ఏ.కె.హిందే ఇలా అంటారు – "ఆ రోజుల్లో నరేంద్రనాథుడు నూనూగు మీసాలతో ఉన్న చిన్నవాడు కాని. విప్లవోత్సాహంతో ప్రజ్వలిస్తూ శక్తివంతుడుగా పురుషత్వం పుణికి పుచ్చుకున్నవాడిగా ఉండేవాడు. ఒక చిన్న గదిలో మేమంతా సమావేశమై బెంగాల్‌కు, దేశానికి సంబంధించిన సమస్యలపై చర్చిస్తూ ఉన్నప్పుడు, నరేంద్రనాథుడు కూడా ఆ చర్చల్లో పాల్గొనడమే కాకుండా, ఉత్తేజపూరితంగా ప్రసంగిస్తూ ఉండేవాడు. దేశ దాస్య విముక్తికి తన పూర్తి కాలం వినియోగిస్తానని ప్రమాణం చేశాడు. ఎంతటి అసాధ్యాలనైనా తాను సాధిస్తానని, విప్లవకారుడికి అసాధ్యాలు అంటూ ఏవీ ఉండవని అనేవాడు. మా సంఘంలో చేరిన తరువాత నరేంద్రనాథుడు చాలా విలువైన వ్యక్తి అని అర్థం అయ్యింది. మహా నాయకుల్లో ఉండే అరుదైన లక్షణాలు ఆ వయస్సులోనే అతడిలో ఉన్నాయని త్వరలోనే గ్రహించాము" – అని రాసాడు.

అనుశీలన సమితిలో చేరిన నరేంద్రనాథుడు సాముగరిడి, కుస్తీ మొదలైన వానిలో ప్రావీణ్యం సంపాదించాడు. విప్లవాల చరిత్రను, విప్లవకారుల చరిత్రలను అవగాహన చేసుకున్నాడు.

అనుశీలన సమితి ముఖ్యులులో ఒకరు అరవింద్‌ఘోష్ సోదరుడైన బీరేంద్ర ఘోష్, రెండవ వ్యక్తి బాగాజతిన్. బాగాజతిన్ అనే పదంలో 'బాగా' అంటే పులి అని అర్థం. అతడు సాహసవంతుడైన విప్లవకారుడు. విప్లవ కార్యకలాపాలలో తిరుగుతూ అతడు ఒక అడవిలో వెళుతున్నప్పుడు పులి అతనిపై దాడి చేయబోయింది. కత్తితో దానితో పోరాడి చంపిన ధీరుడతడు. అందుకే అందరూ అతడిని "బాగాజతిన్" అంటూ ఉండేవారు. అందరితో త్వరగా కలసిపోయే మనస్తత్వంగల బాగా జతిన్ విప్లవకారులందరికీ ఆత్మీయుడిగా ఉండేవాడు. అంతేకాదు విప్లవకారులు అందరికీ అతడంటే ఒక ఆరాధనా భావం కూడా ఉండేది. సహజంగానే నరేంద్ర నాథుడు కూడా అతని పట్ల ఆకర్షితుడయ్యాడు.

నరేంద్రనాథుడు అరవిందుడి సోదరుడైన బీరేంద్ర ఘోష్‌తో కూడా సన్నిహితంగా ఉండేవాడు కాని జతిన్‌బాబుతో ఉన్న సాన్నిహిత్యం బీరేంద్రునితో ఉండేది కాదు. బీరేంద్రుడికి

ఒక ఆధిక్యతా భావం ఉండేది. "నేను అనుశీలన సమితి నాయకుడిని. మిగతా విప్లవకారులు అందరూ నా మాట తప్పక వినాలి". అనే అహంభావ ధోరణి అతడికి ఉండేది. అందుచేత చాలామంది విప్లవకారులు అతడంటే ఇష్టపడేవారు కాదు. అందరికీ జతిన్‌బాబే సన్నిహితుడు.

చాలా కాలం తరువాత నరేంద్రనాథుడు రచించిన "Men I Met" అనే పుస్తకంలో జతిన్‌బాబు గురించి రాస్తూ "మేమందరం అతడిని "దాదా" అని పిలుస్తూ ఉండేవాళ్ళం. "దాదా"ల యుగంలో అతడు సాటిలేనివాడు. అటువంటివారు మరొకరు ఉండరు. జతిన్ తనను తాను"కర్మయోగి"గా భావించుకునేవాడు. ఆవిధంగానే మేము కూడా అలా ఉండాలి అని భావించేవాడు. "కర్మయోగి" అంటే మానవతావాది. మనిషి తాను చేసే కార్యకలాపాల వల్లనే తనను తాను గ్రహించగలడని, మానవుడు తన జీవితగమ్యాన్ని తానే రూపొందించుకో గలడని నమ్మడమే మానవతావాద సారాంశం అనే జతిన్‌బాబు అచ్చమైన మానవతావాది. బహుశ ఆధునిక భారత దేశంలో అతడే మొదటి మానవతావాది కావచ్చు" అంటూ నరేంద్ర నాథుడు జతిన్‌బాబును ప్రశంసించాడు.

జతిన్‌బాబుకు దేశంలో ఉగ్రవాద కార్యక్రమాలను నిర్వహించడమే కాకుండా బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తున్న భారతీయ సైనికులచేత తిరుగుబాటు చేయించాలనే ఉద్దేశ్యం కూడా ఉండేది. ఒకప్పుడు అరవిందఘోష్ నిర్వహించిన "హౌరా ముఠా" అని పిలువబడే రహస్య విప్లవ సంస్థలో అతడు కూడా ముఖ్య సభ్యుడు. 'డియోఘర్' (Deoghar) అనే చోట అరవిందుడు బాంబులను తయారుచేసే ఫ్యాక్టరీని కూడా ఆ రోజుల్లో స్థాపించాడు.

అనుశీలన సమితి దేశంలో అంటువ్యాధులు, ప్రకృతి భీభత్సాలు, మతసంబంధమైన ఉత్సవాలు, జరిగినప్పుడు సేవా కార్యక్రమాలను చేపట్టేది. వాటిల్లో నరేంద్రనాథుడు చురుకుగా పాల్గొనేవాడు. అప్పటికి నరేంద్రనాథుడు "బెంగాల్ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్" ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణత పొందడమే కాకుండా, స్వర్ణపతకాన్ని కూడా పొందాడు. ఆ తరువాతే నేషనల్ కాలేజీలో అరవిందుడి శిష్యరికం చేసాడు.

అనుశీలన సమితిలో ముఖ్య సభ్యుడయిన నరేంద్రనాథుడు అనుశీలన సమితి ఆర్థిక అవసరాలు తీర్చటం కోసం అనేక దోపిడీలు చేసాడు. అయితే ఇక్కడ ఒక విషయం గురించి చెప్పాలి. ఈ దోపిడీలు ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు చేయడానికి వీలులేదు. అనుశీలన సమితికి ఈ దోపిడీల విషయంలో ఒక కేంద్ర సంస్థ ఉండేది. అరవిందఘోష్ మొదలైనవారు అందులో సభ్యులుగా ఉండేవారు. ఎవరు ఎక్కడ దోపిడీలు చేయాలో, ఈ దోపిడీలకు ఎవరు నాయకత్వం వహించాలో కేంద్ర సంఘం నిర్ణయించేది. దోపిడీలు చేయడంలో నరేంద్రనాథుడు దిట్ట అని సంఘం త్వరలోనే గ్రహించింది. అనేక పెద్ద దోపిడీలకు, చిన్న దోపిడీలకు ఆ రోజుల్లో నరేంద్రనాథుడిని నాయకుడిగా నిర్ణయించింది.

నరేంద్రనాథుడి ఆధ్వర్యంలో జరిగిన మొదటి దోపిడి 1907 డిసెంబరు 6వ తేదీన 'చాంగ్రిపోటా' రైలు స్టేషన్‌లో జరిగింది. 'ఇ.బి.యస్.' రైల్వేలో ఉన్న ఈ స్టేషన్‌పై తెల్లవారు జామున 2 గంటలకు దాడి జరిగింది. నరేంద్రనాథుడి ఆధ్వర్యంలో ఆయుధాలు ధరించిన విప్లవకారులు స్టేషన్ మాస్టరు గదిలోకి చొరబడి, అతడిని చావబాది, డబ్బు ఉండే పెట్టె తాళాలు లాక్కున్నారు. ఆ తరువాత పెట్టె తెరచి అందులోని రొక్కం అంతా లాక్కున్నారు. ఆ సమయంలో స్టేషన్లో ఉన్న సిబ్బంది ప్రతిఘటించబోతే వారిని గాయపరిచారు. ఈ వార్త తెల్ల సరికి ఆ ప్రాంతం అంతా సంచలనాన్ని రేకెత్తించింది. దోపిడి జరిగిన వెంటనే నరేంద్రనాథుడు పారిపోయాడు గాని, రెండు రోజుల తరువాత అతడిని అరెస్టు చేసారు. ఆ సమయంలో అతడి దగ్గర బీరేంద్ర ఘోష్ రచించిన "ఆధునిక యుద్ధ విధాన పద్ధతులు" అనే పుస్తకమూ, మాతృమూర్తి పిలుపు అనే పుస్తకమూ దొరికాయి. అతడిని నిర్బంధించి కొన్నాళ్ళు జైలులో ఉంచారు గాని, - దోపిడిలో నరేంద్రనాథుడు ఉన్నాడనే విషయం రుజువు కాకపోవడంచేత, బీదల సేవా కార్యక్రమాలలో అతడికి మంచి పేరు ఉన్నందుచేతను, అతడిని విడుదల చేసారు. విడుదల చేసిన వెంటనే నరేంద్రనాథుడు రహస్య స్థావరానికి పారిపోయాడు.

నరేంద్రనాథుడికి దోపిడీలు చేయడంలో నిపుణత ఉండేదని ఇదివరకే చెప్పాను. రహస్య స్థావరానికి పారిపోయిన తరువాత, తన దోపిడీల కార్యక్రమాన్ని నరేంద్రనాథుడు విస్తృతంగా కొనసాగించాడు. ఆ దోపిడి ముచ్చట్లలో కొన్నింటిని మాత్రమే ప్రస్తావిస్తాను. వీటిలో చిన్న, పెద్ద దోపిడీలు ఉండేవి. ముందుగా చిన్న దోపిడి గురించి చెపుతాను.

ఈ దోపిడి 1909వ సంవత్సరం ఏప్రిల్ 25వ తేదీన జరిగింది. 24 పరగణాల జిల్లాలోని డైమండ్ హార్బర్ సమీపాన ఉన్న "నేత్ర" అనే గ్రామంలో ఒక సాధారణ గృహస్తుని ఇంట్లో ఈ దోపిడి జరిగింది. నరేంద్రనాథుడి నేతృత్వంలోని కొందరు విప్లవకారులు ఆ ఇంటిలోనికి ప్రవేశించి, ఇంటిలో ఉన్న రెండువేల రూపాయలను దోచుకున్నారు. వెళ్లేటప్పుడు నరేంద్రనాథుడు ఆ గృహస్థుతో "మేము నీ దగ్గర నుండి ఈ ద్రవ్యాన్ని భారతదేశంలోంచి తెల్లదొరలను వెళ్ళగొట్టడానికి మాత్రమే అప్పుగా తీసుకుంటున్నాం. భారత దేశానికి స్వతంత్రం వచ్చాక నీ డబ్బు నీకు తిరిగిచ్చేస్తాం". అని చెప్పడం ఒక ముచ్చట. ఈ కేసులో నరేంద్రనాథుడిని పోలీసులు అరెస్టు చేసారు గాని, ఆ తరువాత చాలా చిన్నవాడనే ఉద్దేశంతో విడుదల చేసారు.

ఇక మరొకటి - బెంగాల్ అంతటా సంచలనాన్ని రేపిన దోపిడి. కలకత్తాలో "గార్డెన్ రీచ్" అనే ప్రదేశంలో గల "బర్డ్ అండ్ కంపెనీ" వద్ద నుండి దోచుకున్న పెద్ద దోపిడి ఇది. ఈ దోపిడి పట్టపగలు జరిగింది. ఇది "గార్డెన్ రీచ్" రాజకీయ దోపిడీగా ఆ రోజుల్లో ప్రసిద్ధి పొందింది. "రెస్ట్‌లెస్ బ్రాహ్మిన్, ఎర్లీ లైఫ్ ఆఫ్ ఎం.ఎన్.రాయ్" పుస్తకంలో ఈ దోపిడీకి సంబంధించి

"ముందుమాట"లో రాస్తూ రామ్‌గోపాల్ ముఖర్జీ అనే ఆయన– "గార్డెన్ రీచ్" దోపిడి చాలా సాహసంతో కూడినది. నరేంద్రనాథ్ మస్తిష్కం నుండి వెలువడిన పకడ్బంది వ్యూహంతో ఇది జరిగింది. ఒక్క తుపాకీని కూడా వాడకుండా ఈ దోపిడీని చేయడం జరిగింది" అని అన్నాడు. అంతటి వ్యూహకర్త ఎం.ఎన్.రాయ్.

ఇంతకన్నా పెద్ద దోపిడి కలకత్తాలోని "రొడ్డా అండ్ కంపెనీ"లో జరిగింది. రొడ్డా అండ్ కంపెనీ తుపాకీలు తయారుచేసే సంస్థలలో పేరెన్నికగన్నది. అది విదేశాల నుండి మంచి నాణ్యత కలిగిన పిస్తోళ్ళను, తుపాకులను, మందుగుండు సామగ్రినీ దిగుమతి చేసుకుంటూ ఉంటుంది. ఒక సందర్భంలో ఆ కంపెనీ పెద్దమొత్తంలో వాటిని దిగుమతి చేసుకుంటున్నప్పుడు కస్టమ్స్ కార్యాలయం దగ్గర వాటి దిగుమతికి అంగీకరించబడి, ఆ సంస్థ గోదాములకు చేరవలసిన 192 పెట్టెలలో 10 పెట్టెలు చేరలేదని కనుగొన్నారు. అందులో ఉన్న పిస్తోళ్లు, తుపాకులు, తుపాకీ గుళ్ళు ఇలాంటివన్నీ మాయం అయినాయి. మార్గమధ్యంలో రెండవ కంటికి తెలియకుండా జరిగిన దోపిడి ఇది. ఈ దోపిడీకి కూడా సూత్రధారుడు నరేంద్రనాథుడే. ఈ విధంగా దోచుకోబడిన ఆయుధాలు ఆ రోజుల్లో బెంగాల్‌లో జరిగిన 54 బందిపోటు దాడుల్లో వినియోగించబడినట్లు పోలీసులు కనుగొన్నారు. ఎందుకంటే వారు వాడిన ఆయుధ సామగ్రిపై "రోడ్డా అండ్ కంపెనీ" అనే పేరు లిఖితమై ఉంది. దానిని బట్టి ఆ దోపిడి విప్లవకారులు చేసిందే అని పోలీసులకు సులువుగానే అర్థమయ్యింది. – "రోడ్డా అండ్ కంపెనీకి చెందవలసిన ఆయుధాలు లేని దోపిడి ఆ రోజులలో లేదు". అని ఆనాటి పోలీసు రికార్డులలో వ్రాయడం చూస్తే ఈ దోపిడికి గల ప్రాధాన్యత అర్థమవుతుంది.

ఇలా నరేంద్రనాథుడు, అతని మిత్రుడు హరికుమార్ కలిసి చాలా చోట్ల దోపిడీలు చేసారు. నదులమీద వెళ్ళే పడవలలో, స్టీమర్‌లలో దోపిడీలు చేయడంలో నరేంద్రనాథుడికి చాలా నైపుణ్యం ఉండేది అని అంటారు. ఇది ఇలా ఉండగా ఉగ్రజాతీయవాద కార్యక్రమాల చరిత్రలో ప్రసిద్ధమయిన 'ఆలీపూర్ బాంబు కేసు'లో కూడా నరేంద్రనాథుడి పాత్ర ఉంది. ఈ కేసులో అరవిందఘోష్‌తో పాటు నరేంద్రనాథుడు కూడా సహనిందితుడు. అరవిందఘోష్ సోదరుడు బీరేంద్ర ఘోష్‌కు 'మనిక్ టోలా'లో బాంబులు తయారుచేసే కర్మాగారం ఉందని అందులోనే నరేంద్రనాథుడు బాంబులు తయారుచేస్తూ ఉండేవాడని ఇదివరకే చెప్పుకున్నాం. ప్రసిద్ధ విప్లవకారుడు 'ఖుదీరామ్ ఘోష్' ఉపయోగించిన బాంబు ఈ కర్మాగారంలోనే తయారయిందని పోలీసులు కనుగొనటంతో ఈ కేసులో నరేంద్రనాథుడు కూడా ముద్దాయి అయ్యాడు. ఆ రోజుల్లో "మనిక్ టోలా"లో "కింగ్స్ ఫోర్టు" అనే మేజిస్ట్రేట్ ఉండేవాడు. ఆ మెజిస్ట్రేట్ ఆనాటి జాతీయవాదులందరికీ కఠిన శిక్షలు విధిస్తుండేవాడు. ఇలా కఠిన శిక్షలు విధిస్తే గాని ఉగ్రజాతీయవాదాన్ని అణచివేయలేమని అతడి అభిప్రాయం.

ఇలాంటి మెజిస్ట్రేటు ఉంటే తమకు మనుగడ లేదని భావించిన విప్లవవాదులు ఖుదీరామ్ ఘోష్, ప్రఫుల్లచంద్రచాకీ నిర్ణయించుకున్నారు. 'కింగ్స్ ఫోర్డు' సాధారణంగా వెళుతూ ఉండే బగ్గీపై బాంబు వేస్తే అతని పీడ వదిలిపోతుందని భావించారు. వాళ్ళు భావించినట్టుగా బాంబు దాడికి ఆ బగ్గీ మండిపోయి అందులో వారు హతులయ్యారు. అయితే విప్లవకారులు ఆశించింది జరుగలేదు. ఆ బగ్గీలో "కింగ్స్ ఫోర్డు" లేడు. అందులో బారిస్టర్ పింగ్లే కెనడీ భార్య, అతని కూతురు ప్రయాణిస్తూ ఉండటంచేత వారిద్దరూ చనిపోయారు. బ్రిటిషు ప్రభుత్వ అధికారిని హత్యచేసి దేశంలో భయోత్పాదక పరిస్థితులను సృష్టించడం ఈ బాంబు ప్రయోగం అసలు లక్ష్యం. ఈ ఉద్దేశంచేత దీనిని పోలీసులు "మానిక్తులా కుట్ర కేసు" అని వ్యవహరించారు. బగ్గీపై విసిరిన బాంబు ఎక్కడ తయారైంది అనే విషయాన్ని పురస్కరించుకుని ఒక సమగ్ర విచారణ చేయాలని నిశ్చయించారు. అయితే ఇది ఆలీపూర్ సెషన్స్ కోర్టుకు సంబంధించిన విషయం కాబట్టి – మొత్తంమీద దీనిని "ఆలీపూర్ బాంబుకేసు" అని అంటారు.

ఇందులో 33 మంది ముద్దాయిలు ఉన్నారు. ఈ కేసులో నరేన్ స్పైన్ అనే విప్లవకారుడు అప్రూవర్‌గా మారి ప్రభుత్వానికి సహకరించబోతే విప్లవకారులు అతడిని జైలులోనే కాల్చి చంపారు. ఈ కేసుకు సంబంధించి ముఖ్యుడైన ఇంటెలిజెన్స్ బ్రాంచి ఇన్‌స్పెక్టర్‌ను కూడా కాల్చిచంపారు. ఈ కేసులో కొందరికి శిక్ష పడినప్పటికి అరవిందుడికి, నరేంద్రనాధుడికి శిక్షలు పడలేదు.

ఆ రోజుల్లోనే నరేంద్రనాథుడు జతిన్‌బాబుతో కలిసి భారతదేశంలో బ్రిటిష్ సైన్యంలో ఉన్న సైనికులచేత తిరుగుబాటు చేయిద్దామని ప్రయత్నించాడు గాని, అది విజయవంతం కాలేదు. ఆ కేసులో ప్రభుత్వం ముందుగా నరేంద్రనాథుడినే అరెస్టు చేసింది. ఆ తరువాత మరొక 44 మందిని అరెస్టుచేసి కోర్టులో ముద్దాయిలుగా నిలబెట్టారు.

బ్రిటిష్ ఇండియా సార్వభౌమత్వం నుండి చక్రవర్తిని తొలగించాలనే దురుద్దేశంతో హౌరా జిల్లాలో చాలా దోపిడీలు చేయడం మాత్రమే కాకుండా పదవ జార్జ్ పటాలంలోని సిపాయిలలో కొందరిని లోబర్చుకుని వారిని చక్రవర్తిపై తిరుగుబాటు చేసేందుకు ప్రయత్నించారు. ఈ ముఠాలోని సభ్యులు రాజకీయ స్వభావంగల నేరాలు చాలా చేసారు. పోలీసులను కాల్చి చంపారు. ఆయుధాలు, మందుగుండు సామగ్రి సంపాదించుకుని అరాచకం సృష్టించ డానికి పూనుకున్నారు – అంటూ వీరందరి పైన రాజద్రోహనేరం మోపబడింది.

ఈ సందర్భంగా అరెస్టయిన నరేంద్రనాథుడిని 9 నెలలు ఏకాంత నిర్బంధంలో ఉంచారు. అంతేకాదు. ప్రభుత్వం అనుశీలన సమితిని, యుగాంతర పార్టీని, వాటికి అను బంధంగా పనిచేసే "స్వదేశీ బాంధవ సమితి'ని నిషేధించింది. కోర్టులో 9 నెలలు కేసు నడిచాక

నరేంద్రనాథుడిని, జతిన్ బాబును ఇంకా 38 మందిని ప్రభుత్వం విడుదల చేసింది. 6 గురి పైన మాత్రమే నేరాలు రుజువయ్యాయి. వారిలో ఒకరు విచారణ కాలంలోనే మరణించారు. మరొకరికి పిచ్చి ఎక్కింది.

భారతదేశంలో ఉగ్రజాతీయవాద కార్యక్రమాలు జరుగుతున్న రోజులలోనే ఈ దిశగా విదేశాలలో కూడా కొందరు ప్రయత్నిస్తున్నారు. వారిలో శ్యాంజీకృష్ణ వర్మ, జితేంద్రలాహిరి, లాలాహరిదయాళ్ వర్మ మొదలైనవారు ప్రముఖులు. వీరందరి కృషితో "గదర్' పార్టీ అనే పార్టీ అమెరికాలో ఆవిర్భవించింది. 'గదర్' అంటే సైనికులు తిరుగుబాటుచేసి, నూతన ప్రభుత్వ సాధనకై సాయుధ పోరాటాన్ని సాగించటం అని అర్థం. ఈ ఉద్యమం 1913-19 మధ్య అంటే భారతదేశంలో ఉగ్రవాద జాతీయోద్యమం విస్తృతంగా జరుగుతున్న రోజుల్లో ఆవిర్భవించింది. లాలాహరిదయాల్ వర్మ 'గదర్' పార్టీకి మూలపురుషుడు. చైనా నాయకుడు సన్‌యట్‌సేన్ మాదిరిగా విదేశంలో ఉండి, తన దేశ ప్రజలలో చైతన్యం తీసుకురాదలచి, హరిదయాల్ వర్మ అమెరికాలో ఉండేవాడు. ఆయనకు గురువు శ్యాంజీకృష్ణవర్మ.

వీరందరి ప్రభావము ఎం.ఎన్.రాయ్‌పై ఉంది. ముఖ్యంగా వివేకానందుడు, అరవిందుల ప్రభావం ఉన్నదనే విషయం ఇదివరకే చెప్పటం జరిగింది. అయితే ఇక్కడ ఒక విషయం మాత్రం చెప్పక తప్పదు.

విప్లవ కార్యకలాపాలకు సంబంధించి నరేంద్రనాథుడికి అరవిందుడు గురువు వంటివాడు కావచ్చును గాని, అరవిందుడిలోని మతపరమైన జాతీయవాద ధోరణి నరేంద్రనాథుడికి నచ్చేది కాదు. ఈ విషయాన్ని చెబుతూ సమరేన్‌రాయ్ ఇలా అంటాడు-

"కలకత్తాలోని జతీంద్రుని నివాసానికి ఆయన గురువు భోలానందగిరి వచ్చినపుడు ఆయన చుట్టూ చాలామంది విప్లవకారులు మూగేవారు కాని, నరేంద్రుడు ఎన్నడూ ఆ ఛాయలకు వెళ్ళేవాడు కాదు" అని రాసాడు.

సమీరేన్‌రాయ్ ఆనాటి నరేంద్రనాథుడి ఆలోచనా ధోరణి గురించి చెబుతూ "నరేంద్ర నాథుడి రాజకీయ దృక్పథం మిగతా విప్లవకారుల దృష్టికి భిన్నమైంది. రాజకీయాలను, మతాలను కలగాపులగం చేయడం అతడికి ఎంతమాత్రం ఇష్టం ఉండేది కాదు. ఆ రోజుల్లోనే అతడు బ్రిటిష ప్రభుత్వాన్ని కూలద్రోసిన తరువాత ఎలాంటి ప్రభుత్వం భారతదేశంలో ఏర్పాటు చేయాలన్న విషయం ఆలోచిస్తూ ఉండేవాడు. కొద్దిమంది నాయకుల చేతుల్లో ఉండే ప్రభుత్వం కాకుండా, ప్రజల ప్రభుత్వం ఏర్పడాలని కోరకునేవాడు. అలాంటి ప్రభుత్వం ఏర్పడాలంటే విప్లవం ఒక్కటే మార్గం అని కూడా అనుకునేవాడు."

ఆలీపూర్ బాంబు కేసులో నరేంద్రనాథుడితో పాటు ఆనాటి ముద్దాయిలలో ఒకడయిన భూపతి మజుందార్ ఈ విషయాన్ని గురించి రాస్తూ నరేంద్రనాథుడు ఆ రోజుల్లో మాకు నాయకుడుగా ఉండేవాడు. రాజకీయాల్లో మా అందరికంటే ముందు ఉండేవాడు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మెరుగుపరిచే విషయమై ఒక అతివాద దృక్పథంతో ఉండేవాడు."

ఈ విషయాలన్నింటి నేపథ్యంలో జైలు నుండి విడుదలయిన తరువాత నరేంద్రనాథుడి కార్యకలాపాల విషయానికి వస్తే, ముందుగా అతడు కొన్నాళ్ళపాటు దేశమంతటా పర్యటించి విప్లవ కార్యాచరణకు ప్రజలను చైతన్యవంతం చేయదలచుకున్నాడు. అతని మీద విప్లవకారుడు అనే ముద్ర ఉంది కాబట్టి పోలీసులకు అనుమానం కలగకుండా ఒక సన్యాసిలా పర్యటించాలి అనుకున్నాడు.

1857లో విప్లవం విఫలమయిన తరువాత తెల్లదొరలకు దొరక్కుండా ఉన్న కొందరు సిపాయిలు – దేశ ప్రజలలో విప్లవ భావాలు నాటడానికి సన్యాసుల వేషంలో దేశం అంతా తిరిగారు. అదే మార్గాన్ని నరేంద్రనాథుడు కూడా అనుసరించాడు.

ఆ రోజుల్లోనే నరేంద్రనాథుడు కాశీ, అలహాబాద్, ఆగ్రా, మధుర ఇలాంటి చాలా ప్రదేశాలు తిరిగాడు. ఈ పర్యటనలవల్ల ఎందరెందరినో ఉత్సాహవంతులైన యువకులను కార్యోన్ముఖులుగా చేయగలిగాడు. ఆ రోజుల్లోనే నరేంద్రనాథుడు పాండిచ్చేరి కూడా వెళ్ళాడు. అప్పటికి అరవిందుడు యోగిగా మారిపోయి పాండిచ్చేరి ఆశ్రమంలో ఉన్నాడు. నరేంద్రనాథుడు అరవిందుడిని కలిసి, సన్యాసాశ్రమాన్ని విడిపెట్టి, తిరిగి విప్లవ రాజకీయాలలోకి రావలసినదిగా కోరాడు. కాని అరవిందుడు అందుకు అంగీకరించలేదు. మనిషికి కావలసింది సాధారణ స్వేచ్ఛ కాదు ఆధ్యాత్మిక స్వేచ్ఛ అని అన్నాడు. ఆధ్యాత్మిక స్వేచ్ఛగల వ్యక్తుల వల్ల తప్ప ఈ దేశానికి స్వతంత్రం లభించదన్నాడు. ఈ ధోరణి నరేంద్రనాథుడికి రుచించలేదు.

ఆ రోజుల్లో నరేంద్రనాథుడు తాను విప్లవ కార్యకలాపాలను వదిలేసానని ప్రభుత్వాన్ని నమ్మించడం కోసం ఏదో ఒక బ్రతుకుతెరువు కల్పించుకోవాలనుకున్నాడు. ఈ ఉద్దేశంతో "ఇండియా ఈక్విటబుల్ ఎస్యూరెన్స్" కంపెనీకి కొన్నాళ్ళు ఏజెంటుగా పనిచేశాడు. మరికొన్నాళ్లు ఒక బియ్యం మిల్లులో బిల్‌కలెక్టరుగా పనిచేశాడు. ఇక మరికొన్నాళ్లు ఒక కలప దుకాణంలో పనిచేసాడు. అంతేకాదు ఒక రెస్టారెంట్ కూడా నడిపాడు. ఆ రెస్టారెంట్‌లో విప్లవకారులందరూ చేరేవారు. విప్లవ కార్యకలాపాల గురించి చర్చించుకొనేవారు.

మెల్లిమెల్లిగా మళ్ళీ విప్లవ కార్యకలాపాలు ప్రారంభం అయ్యాయి. ఈసారి, బెంగాల్‌లో మాత్రమే కాకుండా ఇతర ప్రాంతాలకు కూడా విస్తరించాయి. పంజాబ్, ఢిల్లీ, ఉత్తర్‌ప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, మద్రాసు వంటి రాష్ట్రాలలో కూడా విప్లవ కార్యకలాపాలు ప్రవేశించాయి.

ఆ రోజుల్లోనే నరేంద్రనాథుడు పట్టపగలు ఒక దోపిడి కార్యక్రమాన్ని నిర్వహించాడు. అది కొద్ది నిముషాల వ్యవధిలో "బర్డ్ అండ్ కంపెనీ"లో జరిగింది. విప్లవకారులు ఆ కంపెనీలోకి ప్రవేశించి తుపాకులతో బెదిరించి పెట్టెలలో ఉన్న ద్రవ్యాన్ని దోపిడీ చేసారు. ఈ దుకాణం "గార్డెన్ రీచ్" అనే ప్రదేశంలో ఉంది కాబట్టి దీనిని "గార్డెన్ రీచ్" దోపిడి అని అంటారు. ఆ రోజులలో ఇది భారతదేశం అంతటా సంచలనాన్ని సృష్టించింది. అత్యంత సాహసోపేతంగా జరిగిన దోపిడి ఇది.

నరేంద్రనాథుని విప్లవ కార్యకలాపాలు ఇలా జరుగుతూ ఉండగా భారతదేశంపై మొదటి ప్రపంచయుద్ధ మేఘాలు అలుముకున్నాయి. యుద్ధం తప్పక జరుగుతుందనీ, యుద్ధ వ్యవహారాలలో బ్రిటన్ తలమునకలుగా ఉన్నప్పుడు విప్లవకారులు భారతదేశంలో దోపిడి కార్యకలాపాలను ఉధృతం చేస్తే బ్రిటన్ ఉక్కిరిబిక్కిరి అవుతుందనీ – అప్పుడు తెల్లవాళ్ళను తరిమికొట్టడం సులభం అవుతుందనీ విప్లవకారులు భావించారు. అమెరికా, కెనడా వంటి దేశాలలో ఉన్న భారతీయులు అప్పటికే భారత స్వాతంత్ర్య సాధనకై ప్రయత్నాలు ప్రారంభించి ఉన్నారు. వారందరివీ టెర్రరిస్టు విధానాలే కాబట్టి, భారతీయ విప్లవకారులు వారితో అనుసంధానం కాదలిచారు. మొదటిదశలో జర్మనీ – బ్రిటన్‌కు వ్యతిరేకంగా యుద్ధంలోకి దిగలేదుగాని, త్వరలోనే ఆ దేశంకూడా బ్రిటన్‌కు వ్యతిరేకం అవుతుంది అనే వార్తలు వినబడుతున్నాయి. అందుచేత భారతీయ విప్లవకారులు జర్మనీ నుండి ధన సహాయం, ఆయుధాల సహాయం పొందేందుకు ప్రయత్నించాలని నిర్ణయించుకున్నారు. ఆ రోజుల్లోనే మరో సంఘటన జరిగింది. భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొనే ఉద్దేశంతో అమెరికా, కెనడాలలో ఉన్న 8 వేలమంది శిక్కులు ఇండియాకు చేరారు. ఇక్కడి ఉగ్రవాద చర్యలలో, దోపిడీలలో, తాముకూడా పాల్గొనాలని వారి ఉద్దేశం. ప్రభుత్వం వారి ఉద్దేశాన్ని కనిపెట్టి వారిలో కొందరికి మరణ శిక్ష, మరికొందరికి యావజ్జీవ కారాగార శిక్ష విధించి భయభ్రాంతు లను చేసింది. కాని ప్రాణాలకు తెగించిన ఆ వీరులు ఎంతమాత్రము భయపడలేదు.

ఈ సంఘటన జరగటానికి ముందు, అంటే 1913–14 సంవత్సరాల మధ్య కాలంలో భారతీయుల గుండెలను రగిలించే మరొక సంఘటన జరిగింది. అది "కామాగాటోమారో" ఉదంతం. కొంతమంది పంజాబీయులు వ్యవసాయ కూలీలుగా ఉండేవారు. ఇక్కడ వ్యవసాయ కూలీ చేస్తే రోజుకు 8 అణాల కూలీ వచ్చేది. అదే పని కెనడాలో చేస్తే రోజుకు పది రూపాయలు. ఎక్కువ డబ్బు వస్తుందనే ఆశతో వీరు "కామాగాటోమారో" అనే ఓడలో కెనడాకు బయలుదేరారు. వీరి సంఖ్య వందమంది. వీరిలో కొంతమందికి సైన్యంలో సిపాయిలుగా పనిచేసిన అనుభవం ఉంది. వీరందరికీ నాయకుడు గురుదత్‌సింగ్. శిక్కులకు విప్లవ చైతన్యం అధికంగా ఉంటుంది అనే అనుమానంతో కెనడా ప్రభుత్వం ఓడను రేవులోనికి దిగనివ్వలేదు. అయితే వీరందరూ

గురుదత్‌సింగ్ ప్రభావంతో విప్లవ చైతన్యంతో రగిలి ఉన్నారు. తెల్లవారి జాత్యహంకారం మీద మండిపడుతూ ఉన్నారు. కెనడా నుంచి తిరిగి వచ్చిన ఈ ఓడలోనివారందరినీ పంజాబ్‌కు తిరిగి పంపేందుకు బ్రిటిషు ప్రభుత్వం ఏర్పాటు చేసింది. కాని చాలామంది శిక్కులందుకు అంగీకరించలేదు. దాంతో శిక్కులకు యూరోపియన్ పోలీసులకు మధ్య ఘర్షణ జరిగింది. యూరోపియన్ పోలీసులు శిక్కులపై కాల్పులు జరిపారు. కాల్పుల్లో 20 మంది శిక్కులు మరణించారు. శిక్కులు చేసిన ఎదురు కాల్పుల్లో ఇద్దరు యూరోపియన్ పోలీసులు,ఇద్దరు భారతీయ పోలీసులు మరణించారు. పోలీసు సూపరింటెండెంట్‌కు తుపాకి గుండు దెబ్బ తగిలింది. కొందరు ఉద్యోగులుకూడా గాయపడ్డారు. ప్రభుత్వం శిక్కులందరిని అరెస్టు చేయాలను కుంది గాని చాలామంది అక్కడి నుండి తప్పించుకొని, బెంగాల్ విప్లవకారుల్లో చేరిపోయారు.ఆ రోజుల్లో "కామాగాటోమారో" ఉదంతం దేశాన్నంతా ఆగ్రహ జ్వాలలతో కుదిపేసింది.

1914 ఆగస్టు 4వ తేదీన మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయ్యింది. అప్పటికే అమెరికాలో గదర్ పార్టీ ఉండేది. బెర్లిన్‌లో భారత విప్లవ సంఘం ఉంది. జర్మన్ ప్రభుత్వం బ్రిటన్‌కు వ్యతిరేకంగా యుద్ధంలోకి దిగినపుడు విప్లవకారులకు అది సంబరాన్ని కలిగించింది. భారతదేశంలోని విప్లవకారులకు ధనసహాయం, ఆయుధసహాయం చేసి భారత్‌లో బ్రిటిష్ ప్రభుత్వాన్ని బలహీనం చేయాలనే ఉద్దేశ్యం వారికి ఉంది. ఈ విషయం భారతీయ విప్లవకారులకు తెలియగానే ఉత్సాహంతో వారు ఆ దిశగా కృషి చేయడం ప్రారంభించారు. అమెరికా అప్పటికింకా యుద్ధంలో చేరలేదు కాబట్టి – జర్మనీ ఇచ్చే సహాయాన్ని భారతదేశానికి ఎలా తీసుకురావాలి అనే విషయంలో చర్చలు మొదలయ్యాయి.

ఈ లోగా నరేంద్రనాథుడు దక్షిణ కలకత్తాలోని కిద్దర్‌పూర్‌లో – సిగ్నలింగ్, టెలిగ్రాఫ్, గెరిల్లా యుద్ధం మొదలైనవాటిలో మెళకువలు నేర్పడానికి శిక్షణా కార్యక్రమాలను ముమ్మరం చేసాడు. వీటికి కావలసిన నిధులు సమకూర్చడానికి దోపిడీ కార్యక్రమాలు జరుగుతూనే ఉన్నాయి. జర్మనీ యుద్ధం ప్రారంభించే సమయానికి విప్లవాన్ని దేశం నలువైపుల నుండి ఒకేసారి ప్రారంభించాలని జతిన్‌బాబు, నరేంద్రనాథుడు, రాస్ బీహారీ బోస్, అమరేంద్రనాథ ఛటోపాధ్యాయ మొదలయినవారు నిర్ణయం తీసుకున్నారు. రాస్‌బీహారీ బోస్ 1915వ సంవత్సరంలో ఫిబ్రవరి 2వ తేదీన అమృతసర్ వద్ద పంజాబ్ మెయిల్‌ను ఆపి, దానిని దోచు కోవడంతో విప్లవం ప్రారంభం అయ్యిందని భావించుకోవాలి అని అనుకున్నారు. పంజాబ్ మెయిల్ దోపిడి జరగగానే బెంగాల్‌లోని విప్లవకారులు సైన్యంతో చేతులు కలిపి విప్లవం లేవదీస్తారు. ఆపైన మహారాష్ట్రలో విప్లవం ప్రారంభం అవుతుంది. అప్పటికే యుద్ధంతో సతమత మవుతున్న భారత్‌లోని బ్రిటిష్ ప్రభుత్వం ఈ దాడులతో ఉక్కిరిబిక్కిరి అవుతుంది. ఇదీ – విప్లవకారుల ప్రణాళిక.

అనుకోవడానికి ఇది బాగానేఉంది గాని ఇందుకు పెద్దమొత్తంలో ఆయుధాలు, ధనం కావాలి. జర్మనీ నుండి సహాయం అందితేగాని అది సాధ్యంకాదు. ఇందుకు జర్మనీ సుముఖంగా ఉందని వార్తలు వస్తున్నాయి గాని అది తెచ్చుకునే గట్టి ప్రయత్నం ఇంకా జరగలేదు.

ఈ విషయాన్ని నరేంద్రనాథుడు తన జ్ఞాపకాలు (Memories)లో రాస్తూ ఇలా అంటాడు–"1914లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే ప్రవాసులుగా ఇతర దేశాలలో ఉన్న భారతీయులు అందరూ జర్మనీని ఒక ఆశాదీపంలా భావించారు. భారత విప్లవకారులకు జర్మనీ పెద్దమొత్తంలో ఆర్థిక సహాయం, ఆయుధ సహాయం చెయ్యగలదనే ఆశతో ఉన్నారు. ఇందుకు బెర్లిన్ విప్లవ సంఘం భారత స్వాతంత్ర్య సంగ్రామానికి సహాయం చేయడానికి అధికారికంగా అనుమతిని సాధించగలిగింది. ఈ వార్త దావానలంలాగా వ్యాపించి భారతీయ విప్లవకారులను, బ్రిటిష్ సైన్యంలో ఉన్న భారతీయులను ఆనందోత్సాహాలలో ముంచెత్తివేసింది. అయితే ఆ సహాయం విప్లవకారులకు ఎలా అందుతుందన్నదే సమస్య. జర్మనీ నుండి నేరుగా అది భారతదేశానికి చేరడం అసంభవం. యుద్ధంలో తటస్థంగా ఉన్న ఏ దేశానికైనా అవి చేరితే అక్కడి నుండి భారత దేశానికి రావలసి ఉంది.

ఈ పరిస్థితుల్లో నరేంద్రనాథుడు జర్మన్ కాన్సల్ జనరల్‌ను కలుసుకున్నాడు. వారి వద్ద నుండి సహాయం అందితే తాము బ్రిటిషువారిని ఈ దేశం నుండి సులువుగా తిప్పికొట్ట గలమని చెప్పాడు.

విప్లవకారుల పట్ల సానుభూతి చూపిన కాన్సల్ జనరల్ బెర్లిన్‌కు టెలిగ్రామ్ పంపుతూ "భారతదేశంలో విప్లవకారుల కార్యకలాపాలు ముమ్మరంగా సాగుతున్నాయి. మనం ఈ అవకాశాన్ని జారవిడుచుకోకూడదు. వారికి అధికంగా సహాయంచేసి బ్రిటిష్ ప్రభుత్వానికి గట్టి దెబ్బ కొట్టాలి" అని అన్నాడు.

అప్పుడు జర్మనీ ప్రభుత్వం విప్లవకారులు ఎవరినైనా ఒక మనిషిని "బటేవియా"కు పంపితే అక్కడనుంచి ఆయుధాలు, ధనం ఎలా పంపాలి అనే విషయం వారితో చర్చించి చెయ్యడానికి అవకాశం ఉంటుంది అనే రహస్య సమాచారాన్ని రాయబార కార్యాలయం విప్లవకారులకు రహస్యంగా అందించింది. అప్పుడు విప్లవ సంఘాలవారందరూ సమావేశమై ఈ కార్యక్రమాన్ని నిర్వహించడానికి నరేంద్రనాథుడొక్కడే సమర్థుడని నిర్ణయించారు. అయితే అప్పటికే బ్రిటిష్ ప్రభుత్వం గూఢచారుల నిఘా నరేంద్రనాథుడిపై ఉంది కాబట్టి అతడు "చార్లెస్ అలెన్ మార్టిన్" అనే పేరు పెట్టుకున్నాడు. అంతేకాదు కలకత్తాలో ఉన్న "హేరీ అండ్ సన్స్" వ్యాపార సంస్థ తరపున ఏజెంటుగా ఈ మార్టిన్ అనే వ్యక్తి వెడుతున్నట్టు కాగితాలు సృష్టించబడ్డాయి. బటేవియా నుండి భారతదేశానికై ఏ సమాచారం పంపించదలచినా రహస్య పరిభాషలో "హేరీ అండ్ సన్స్"కు టెలిగ్రామ్ ఇస్తారు. ఇలా ఏర్పాటు జరగడంతో నరేంద్రనాథుడు జర్మనీ వెళ్ళడానికి ఏర్పాట్లు పూర్తి అయ్యాయి.



## 4
## ఆయుధాల కోసం అన్వేషణ

**1915** ఏప్రిల్‌లో బటేవియా చేరుకోవడానికి నరేంద్రనాథుడు మారుపేరుతో ఓడలో మద్రాసు నుండి బయలుదేరాడు. ఏ ముహూర్తాన నరేంద్రనాథుడు అలా బయలుదేరి వెళ్ళాడో గాని 1930లో భారత దేశానికి తిరిగి స్థిరనివాసానికి వచ్చేంతవరకు అతడి దేశాటనం కొనసాగుతూనే వచ్చింది. దేశం మారినప్పుడల్లా పేరు, వృత్తి కూడా మారుతూ వచ్చాయి. రహస్య దేశాటనం చేయడం కోసం నరేంద్రనాథుడు మార్చుకున్న పేర్ల గురించి చెప్పాలంటే అదొక పెద్ద జాబితా అవుతుంది. మధ్యమధ్యలో ఎన్నో మజిలీలు, ఎన్నో సాహస కృత్యాలు, ఎన్నో అనుభవాలు. అయితే ఈ కాలంలో (1915–30) మధ్యమధ్యలో కొన్ని సార్లు భారత్‌కు తిరిగి వచ్చాడు. బటేవియాకు చేరిన చార్లెస్ మార్టిన్ (నరేంద్రనాథుడి కొత్త పేరు) జర్మన్ కాన్సల్ జనరల్‌ను కలుసుకున్నాడు. అతడు నరేంద్రనాథుడిని సాదరంగా ఆహ్వానించి "హెడ్ ఫ్రీక్" అనే పెద్ద వ్యాపారస్తుడికి పరిచయం చేసాడు. భారత స్వాతంత్ర్య సమరం సాగిస్తున్న విప్లవకారులకు సహాయం చేయడం కోసం ఒక ఓడ ఆయుధాలతో బయలుదేరి కరాచీ రేవుకు వస్తుందన్నాడు. ఇది విన్న నరేంద్రనాథుడు, ఓడ కరాచీ తీరానికి కాక, బెంగాల్ తీరానికి చేరే ఏర్పాటు చేయమన్నాడు. అతడి కోరికను వారు అంగీకరించారు. జర్మన్లు పంపిస్తామని చెప్పిన ఓడ పేరు "మెవరిక్". ఈ ఓడలో 30 వేల తుపాకీలు, ఒక్కొక్క దానికి 400 రౌండ్ల తుపాకి గుండ్లు, 2 లక్షల రూపాయల నగదు పంపుతామన్నారు. ఈ విషయం విన్న వెంటనే మార్టిన్ (నరేంద్రనాథుడు) మహదానందపడి, కలకత్తాలో ఉన్న "హేరీ అండ్ సన్స్"కు "పని అయిపోయింది" అని టెలిగ్రామ్ ఇచ్చాడు. అప్పుడు "హేరీ అండ్ సన్స్" నుండి డబ్బు పంపించమని టెలిగ్రామ్ వచ్చింది. బెంగాల్‌లోను ఇతర ప్రాంతాల్లోను విప్లవ కార్యకలాపాలు సాగించటానికి అత్యవసరంగా ద్రవ్యం కావలసి ఉంది. ఈ విషయాన్ని నరేంద్రనాథుడు "హెడ్ ఫ్రీక్"కు చెబితే అతడు జూన్ – ఆగస్టు నెలల మధ్య 43,000 రూపాయలు పంపాడు. అయితే ఆ మొత్తం అంతా భారతదేశానికి చేరలేదు. మధ్యలో కొంత ద్రవ్యం మాయమైపోయింది. కారణాలు తెలియలేదు.

జూన్ మధ్యలో నరేంద్రనాథుడు భారతదేశానికి తిరిగి వచ్చాడు. వచ్చేటప్పుడు తనతో పాటు18,000 రూపాయల డ్రాఫ్టును కూడా తీసుకొని వచ్చాడు. అయితే ఆ డ్రాఫ్ట్ మార్టిన్ పేర ఉంది. అందువల్ల ఆ డ్రాఫ్ట్ మారటంలో ఇబ్బంది వచ్చింది. అయితే అమరేంద్రనాథ ఛటోపాధ్యాయ అనే విప్లవకారుడు అతికష్టం మీద ఆ డ్రాఫ్టును మార్చగలిగాడు.

ఇక అందరూ జర్మనీ నుంచి వచ్చే ఓడను అందులోని ఆయుధాలను, ద్రవ్యాన్ని ఎదురు చూసారు. ఓడ వచ్చేలోపున ఆయుధాలు, ధనం విప్లవ సంఘాల మధ్య ఎలా పంచాలి, ఆ సంఘాలు వాటిలో చేయాల్సిన కార్యక్రమాలు ఏమిటి, మొదలయిన విషయాలన్నింటిని చర్చించుకుంటూ ఓడ కోసం ఎదురుచూడసాగారు.

అయితే ఈ లోపున వారికొక రహస్య సమాచారం తెలిసింది. బటేవియా వెళ్ళి నరేంద్ర నాథుడు జర్మన్ అధికారులను సహాయం కోరడం, వారు అందుకు అంగీకరించి భారత్ దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి సహకరించడం, ఇలాంటి విషయాలన్నీ బ్రిటిష్ ప్రభుత్వ అధికారులకు గూఢచారి వర్గాల ద్వారా తెలిశాయి. ఏ క్షణాణ ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠ విప్లవకారులందరిలోనూ కలిగింది.

అనుకున్నది అనుకున్నట్లుగా జరిగితే - బ్రిటిష్ ప్రభుత్వం సైన్యాన్ని విప్లవకారులను చంపడానికి పంపించవచ్చు. అలాంటి పరిస్థితులను ఎదుర్కొని విప్లవకారులందరు వంతెనలు కూల్చివేయడం, రైలు మార్గాలను స్వాధీన పరచుకోవటం వంటి కార్యక్రమాలు చేయడానికి సిద్ధంగా ఉండాలని హెచ్చరిక చేసారు.

జర్మనీ నుంచి రావలసిన ఓడకోసం నరేంద్రనాథుడు, అతని అనుచరులు ఒక ప్రదేశంలో 15 రోజులు కాసుకొని కూర్చున్నారు. వంతులవారీగా చెట్లు ఎక్కి ఓడ వస్తుందో లేదో చూడ సాగారు. జర్మనీవారి ఓడమీద అడ్డంగా, వరుసగా 3 లైట్లు వెలుగుతూ ఉంటాయని, ఆ వెలుతురు చూడగానే విప్లవకారులు తాము సిద్ధంగా ఉన్నట్లు సిగ్నల్ ఇవ్వాలని చెప్పారు.

అయితే - అనుకున్నట్టుగా ఓడ రాలేదు. ఎందుకు ఓడ రాలేదు అనే విషయానికి సంబంధించి అనేక కథలున్నాయి. ప్రస్తుతానికి వాటిని వివరించటం అనవసరం కాబట్టి, ఆ విషయం చెప్పటంలేదు. అయినా ఆశ చావని నరేంద్రనాథుడు మరొకసారి బటేవియా వెళ్ళి జర్మన్ అధికారులను కలుసుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఈ విషయాన్ని నరేంద్రనాథుడు జతిన్ బాబుకు చెబుదామని అతడిని ఒక రహస్య ప్రదేశంలో కలుసుకున్నాడు. ఆయనతో నరేంద్రనాథుడు "ఈసారి ఆయుధాలతో తిరిగి వస్తాను. లేకపోతే రానేరాను" అని అన్నాడు. అది విన్న జతిన్ బాబు నరేంద్రనాథుడి మాటలకు అడ్డం పడి "అలా అనవద్దు. ఆయుధాలు లభించినా, లభించకపోయినా తిరిగి రా" అని అన్నాడు. ఇలా వెళ్ళిన నరేంద్ర నాథుడు కొంత

కాలం పోయిన తరువాతగాని భారత దేశానికి తిరిగి రాలేదు. నరేంద్రనాథుడు బటేవియా వెళ్ళిన కొద్దికాలానికి జతిన్ బాబు పోలీసు కాల్పుల్లో వీరమరణం పొందాడు. తన మిత్రుడు, గురు సమానుడు అయిన జతిన్‌బాబును తిరిగి ప్రాణాలతో చూడలేకపోయానని నరేంద్రనాథుడు ఎంతగానో బాధపడ్డాడు. రహస్య ప్రదేశంలో జతిన్‌బాబును, నరేంద్రనాథుడు కలసిన కలయికే ఆఖరి కలయిక అయింది.

* * * * *

బటేవియాకు వెళ్లిన నరేంద్రనాథుడు జర్మన్ కాన్సల్ జనరల్‌ను కలుసుకుంటే – అతడు ఇదివరకటిలా మైత్రీభావంతో మాట్లాడలేదు. అంతేకాదు "మీ దేశంలోని విప్లవకారులకు సరయిన పద్ధతిలో కార్యం నిర్వహించటం రాదు. అత్యంత గోప్యంతో ఉంచవలసిన రహస్యాలు కూడా మీరు దాచలేరు" అని అన్నాడు. ఆ తరువాత నరేంద్రనాథుడు మూడు, నాలుగుసార్లు అతనిని కలిసినా అతడి వైఖరిలో మార్పు కనిపించలేదు. "మీకు ఆయుధాలు పంపడానికి కావలసిన మనుషులు యుద్ధం జరుగుతున్న కారణంగా ఇప్పుడు మా దగ్గర లేరు." అయినా "ఇప్పటికే ఒక ఓడను పోగొట్టుకున్నాము. మరొక ఓడను పోగొట్టుకునే స్థితిలో మేము లేము" అని నిష్కర్షగా చెప్పాడు.

ఆ తరువాత నరేంద్రనాథుడు ఇదివరకు కౌన్సిల్ జనరల్ తనకు పరిచయం చేసిన హెడ్‌ఫ్రీక్‌ను కలుసుకున్నాడు కాని, – ప్రయోజనం లేకపోయింది. అతడు కూడా సానుకూలంగా స్పందించలేదు. ఈ పరిస్థితుల్లో తానేమీ సహాయం చేయలేనన్నాడు.

ఇదంతా చూసిన తరువాత జర్మన్ల సహాయం తమకు లభించేటట్లు కనబడలేదు. దారులన్నీ మూసుకుపోయినట్లు అనిపించింది. అయినా పట్టువదలని విక్రమార్కునిలా ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. ఇలాంటి పరిస్థితుల్లో అతడు ఇంకో వ్యూహం ఆలోచించాడు.

సుమిత్రా రేవుల దగ్గర జర్మన్ ఓడలు కొన్ని ఉన్నాయి. వాటిలో ఉన్న ఆయుధాలతో అండమాన్ దీవుల మీద దాడిచేసి, అక్కడి సెల్యూలర్ చెరసాలలో ఖైదీలుగా ఉన్న దేశభక్తులందరినీ విడుదల చేయాలి. ఆయుధాలతో ఓడలమీద వారిని రహస్యంగా ఒరిస్సా తీరంలో దించాలి. చైనా నుండి దొంగచాటుగా మరికొన్ని ఆయుధాలను జతచేర్చుకొని అస్సాంను బ్రిటిష్‌వారి పాలన నుండి విముక్తి చేయాలి. అటుతరువాత, విప్లవాన్ని దేశమంతటా విస్తరింప చేయాలి. తిరుగుబాటుకు సిద్ధంగా ఉన్న భారతీయ సైనికుల సహాయంతో భారతదేశాన్ని దాస్య విముక్తంచేయాలి. ఈ పథకాన్ని నరేంద్రనాథుడు బటేవియాలోని జర్మన్ రాయబార కార్యాలయంలో పదే పదే చెప్పాడు గాని – జర్మన్లు ఈ పరిస్థితుల్లో అంత 'రిస్క్'ను తీసుకోలేం అన్నారు.

ఇక, ఇప్పుడేం చేయాలి అని ఆలోచించిన నరేంద్రనాథుడు జపాన్‌లో ఉన్న రాస్ బిహారి బోస్ సహాయం తీసుకుంటే మంచిది అని భావించాడు. రాస్ బిహారి బోస్ సహాయం గాని ఉంటే జపాన్ సహకారంతో భారతదేశంలో బ్రిటిష్‌వారిపై విప్లవం లేవదీయవచ్చు అనుకున్నాడు. చైనాలో విప్లవం తీసుకురాదలచి, విఫలుడయిన సన్‌యట్‌సేన్ కూడా అప్పుడు జపాన్‌లోనే ఆశ్రయం పొందుతున్నాడు. వీరిద్దరితోనూ సంప్రదింపులు జరిపితే ఏదైనా మార్గం దొరుకుతుందేమోనని నరేంద్రనాథుని ఆశ. ఈ సందర్భంలోనే రాస్‌బిహారి బోస్ గురించి, సన్‌యట్‌సేన్ గురించి, కొన్ని వివరాలు చెప్పాలి.

రాస్‌బిహారిబోస్ (1886–1945) అమెరికాలో "గదర్‌పార్టీ" స్థాపించబడడానికి ముఖ్య కారకులలో ఒకడు. భారతదేశంలో సైనిక విప్లవం తీసుకొని వచ్చి భారతమాతను దాస్యవిముక్తం చేయాలని గదర్‌పార్టీ వీరులు అహర్నిశలూ పరితపించారు. "ఆలీపూర్ బాంబు కేస్" నిందితులలో రాస్ బిహారి బోస్ ఒకడు. ఆ కేసు నుండి తప్పించుకోవడానికి అతడు జపాన్‌కు ప్రవాసిగా వెళ్ళిపోయాడు. ఇంజనీరింగ్, మెడిసిన్ విద్యలలో పట్టభద్రుడైన రాస్ బిహారీ బోస్ జపాన్‌కు చేరుకున్న తరువాత "ఆసియా ఆసియావాసులకే చెందాలి" అనే ఉద్యమంతో చెయ్యి కలిపాడు. ఈ భావాలు కలిగిన ఒక జపనీస్ మహిళను వివాహమాడి ఆ తరువాతి కాలంలో జపాన్ పౌరుడయ్యాడు. తన మిత్రుల సహాయంతో జపాన్ ప్రభుత్వం భారత విప్లవకారులకు తోడ్పాటు చెయ్యాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

ఇక సన్‌యట్‌సేన్ (1866–1925) చైనాకు చెందిన వైద్యుడు. అంతేగాక – రచయిత, తత్వవేత్త కూడా. చైనా రిపబ్లిక్ స్థాపించడానికై కృషి చేసినవాడు. ఇతడిని "చైనా జాతిపిత" అని అంటారు. క్వింగ్ రాజవంశాన్ని గద్దె నుండి దింపి, ప్రజాప్రభుత్వాన్ని స్థాపించటంలో ప్రముఖ పాత్ర వహించినవాడు – సన్‌యట్‌సేన్. అయితే– ఈ ఘనతను సాధించటంతో పాటు అతడు తీవ్రమైన వైఫల్యాలను కూడా ఎదుర్కొన్నాడు. అలాంటి సమయంలోనే అతడు జపాన్‌లో ప్రవాసిగా ఉన్నాడు. (ఇంతకు మించిన వివరాలు ఈ గ్రంథానికి అనవసరం కాబట్టి చెప్పడం లేదు.)

నరేంద్రనాథుడు, రాస్ బిహారి బోస్‌ను కలుసుకున్నందు వలన పెద్ద ప్రయోజనం ఏదీ కలుగలేదు. ఒకప్పుడు ఎంతో ఉత్సాహంతో ఉద్యమాలు నడిపిన రాస్ బిహారి బోస్‌లో ఇప్పుడు ఒకనాటి ఉత్సాహం లేదు. అయితే ఎప్పటికైనా జపాన్ దేశం భారతదేశాన్ని దాస్య శృంఖలాల నుండి తప్పించగలదు అనే పిచ్చినమ్మకంతో ఉన్నాడు అతడు.

నరేంద్రనాథుడు రాస్ బిహారి బోస్‌ను కలుసుకున్న తరువాత సన్‌యట్‌సేన్‌ను కలుసుకున్నాడు. అతడు చైనాలో మళ్ళీ విప్లవం తీసుకొచ్చి, విప్లవాన్ని అణచి మళ్ళీ గద్దెకెక్కుదామని చూస్తున్న క్వింగ్ చక్రవర్తిని తొలగించాలనే ప్రయత్నంలో ఉన్నాడతడు. బర్మాకు, భారత్‌కు

సరిహద్దులలో ఉన్న రెండు చైనా రాష్ట్రాలలో పెద్ద విప్లవం జరుగుతున్నది. అందుచేత నరేంద్రనాథుడు దీనిని భారత స్వాతంత్ర్య విముక్తికి ఉపయోగించగలనని భావించాడు. చైనా విప్లవకారులవద్ద అపారమైన ఆయుధ సంపత్తి ఉంది కాబట్టి – వాటిలో కొన్నింటిని భారతదేశ విప్లవకారులకు ఇస్తే, భారత్, చైనాల సహకారంతో భారత్‌లో పెద్ద విప్లవం తీసుకురావచ్చునని నరేంద్రనాథుడు సన్‌యట్‌సేన్‌కు చెప్పాడు. సన్‌యట్‌సేన్ అందుకు అంగీకరించాడు గాని, అందుకు 500 మిలియన్ల డాలర్లు ఖర్చు అవుతుందని, నరేంద్రనాథుడు ఆ మొత్తాన్ని జర్మన్ రాయబారి దగ్గర తీసుకోగలిగితే పని జరుగుతుందని చెప్పాడు.

దానిని అనుసరించి నరేంద్రనాథుడు ఆ విషయం జర్మన్ రాయబార కార్యాలయంలో చెప్పాడు. వాళ్ళు అంత పెద్ద మొత్తం ఇవ్వడానికి మాకు అధికారం లేదు అన్నారు. అయితే – వాళ్ళు ఒక సలహా మాత్రం ఇచ్చారు. నరేంద్రనాథుడు బెర్లిన్ వెళ్ళి, తన పథకాన్ని అత్యున్నత సైనికాధికారికి చెబితే, వాళ్ళు ఇవ్వదలచుకుంటే చైనాలో ఉన్న జర్మన్ రాయబార కార్యాలయం ద్వారా ఇవ్వగలరు అని చెప్పాడు. అంతేగాకుండా నరేంద్రనాథుడు బెర్లిన్ వెళ్ళడానికి ఏర్పాట్లు వారే చేసారు. అతడికి "ఫాదర్ మార్టిన్" అనే పేరుతో పాస్‌పోర్టును ఏర్పాటు చేసారు. అంతేకాదు ఈ ఫాదర్ మార్టిన్ పాండిచ్చేరికి చెందినవాడని, పారిస్‌లో మత సంబంధమైన విద్య నేర్చుకోవడానికి వెళుతున్నాడని పేర్కొన్నారు. ప్రయాణానికి కావలసిన ద్రవ్యం కూడా ఇచ్చారు.

దొంగ పాస్‌పోర్ట్‌తో ప్రయాణం చేయడం కాబట్టి జపాన్ నుండి జర్మనీ వెళ్ళే లోపల అతడు ఎన్నో గండాలు ఎదుర్కోవలసి వచ్చింది. విప్లవకారుడు అనే అనుమానంతో పోలీసులు వెంటబడి వేధించారు. వాటన్నింటిని తప్పించుకొని నరేంద్రనాథుడు జర్మన్ రాయబార కార్యాలయానికి చేరాడు. అక్కడివారు అతను కోరిన 50 లక్షల డాలర్లు ఇవ్వడానికి అంగీకరించి, పెకింగ్ వెళ్లమన్నారు. ఆ తరువాత నరేంద్రనాథుడు చైనాలోని జర్మన్ రాయబార కార్యాలయానికి వెళ్ళాడు. బెర్లిన్ అధికారులతో తాను చేసుకున్న ఒప్పందం కాగితం జర్మన్ రాయబారి ముందు ఉంచాడు. అతడు అది చూచి ఒప్పందం బాగానేఉంది గాని అంత డబ్బు తమవద్ద లేదని, అమెరికా మీదుగా జర్మనీ వెళ్ళి ఉన్నతాధికారులతో సంప్రదించమని అన్నారు.

అప్పటికి నరేంద్రనాథునికి అసలు విషయం అర్థమయ్యింది. జర్మనీ రాయబార కార్యాలయానికి భారతదేశ విప్లవకారులకు ఆర్థిక సహాయంగాని, ఆయుధ సహాయం గాని చేసే ఉద్దేశ్యం లేదు. కాని అలా చెప్పడానికి ఇష్టంలేక ఒకచోట నుండి మరొక చోటికి వెళ్ళమని చెపుతూ కాలయాపన చేస్తున్నారు.

భారతదేశంలో అశాంతి, విప్లవం రేగడం వారికి ఇష్టమేకాని దానికోసం ద్రవ్యం వెచ్చించే ఉద్దేశం వారికి లేదు. విప్లవకారులకి మొండిచేయి చూపకుండా నాటకం ఆడుతున్నారని సులువుగానే అర్థం అయ్యింది.

అప్పటికి పోలీసు కాల్పుల్లో బాగా జతిన్ చనిపోయాడు. చాలా మంది విప్లవకారులు జైలు పాలయ్యారు. ద్వీపాంతర శిక్షలు అనుభవిస్తున్నారు. కొంతమంది విప్లవకారులు ఈ విపత్కర పరిస్థితులను తట్టుకోలేక మతిభ్రమణానికి లోనయ్యారు. విప్లవ కార్యక్రమాలు చేయడానికి తగిన ధనం అందటంలేదు. ఈ పరిస్థితుల్లో విప్లవ చైతన్యం చెలరేగడాన్ని గురించి కలలుగన్న తాను భారతదేశానికి తిరిగి ఎలా వెళ్ళగలను అని భావించాడు నరేంద్రనాథుడు.

అప్పటికింకా అమెరికా యుద్ధంలోకి చేరలేదు. తటస్థ దేశంగానే ఉంది. ప్రవాసులు ఆ దేశంలో తలదాచుకోడానికి పెద్దగా ఇబ్బందులు లేవు. అందుచేత కొన్నాళ్ళు అమెరికా వెళ్లి, తలదాచుకొనడమే మంచిది. భారతదేశానికి వెళితే అరెస్టుకాక తప్పదు అనుకున్నాడు.

ఇలాంటి ఆలోచనలతో అమెరికాకు ప్రయాణం అయ్యాడు గాని, చేతిలో డబ్బు లేదు. మరోవైపునుండి గూఢచారుల బెడద. ఈ సమస్యలన్నింటికి ఎదురీదుతూ ఫాదర్ మార్టిన్ గానే చెలామణి అవుతూ, అమెరికాలోని "శాన్ ఫ్రాన్సిస్కో" నగరానికి చేరుకున్నాడు. అప్పటికి మలయా, ఇండోనేషియా, ఫిలిఫ్ఫైన్, జపాన్, కొరియా, చైనా దేశాలన్నింటిని చుట్టి వచ్చిన మార్టిన్‌కు అమెరికా మరికొన్ని కొత్త పాఠాలను నేర్పింది. అది తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది.



# 5

# అమెరికాలో ....... మెక్సికోలో .......

అమెరికాకు చేరుకున్న మార్టిన్ (ఎం.ఎన్.రాయ్) ఆ దేశంలో 1916 మార్చి నుండి 1917లో మెక్సికో దేశానికి పారిపోయేవరకు సుమారు 11 నెలల పాటు అక్కడే ఉన్నాడు. అమెరికాలో ఉన్నది కొద్ది కాలమే అయినా, అతడి జీవితంలో అది చాలా ముఖ్యమయిన కాలం. అన్నింటికి మించి ఫాదర్ మార్టిన్ అనే పేరుతో ఉన్న నరేంద్రనాథుడు ఎం.ఎన్.రాయ్‌గా పేరు మార్చుకున్నది అమెరికాలోనే. ఇంకా చెప్పాలంటే, అతడి జీవితంలో ముఖ్యమయిన పాత్ర వహించినవారిలో చెప్పుకోదగిన ఎవిలిన్ ట్రోంట్ అనే మహిళ, ఆర్థర్ ఉఫామ్ పోప్ అనే విశ్వవిద్యాలయ ఆచార్యుడు, ఎం.ఎన్.రాయ్‌కి పరిచయమయినది ఇక్కడే.

ఫాదర్ మార్టిన్‌గా ఉన్న నరేంద్రనాథుడు అమెరికా తీరానికి చేరేసరికి బ్రిటిష్ గూఢచారి నిఘా వర్గానికి ఆ విషయం తెలిసిపోయింది. శాన్ ఫ్రాన్సిస్కోకు చెందిన ఒక పత్రిక గూఢచారి వర్గం కనిపెట్టిన విషయాన్ని బహిర్గతం చేస్తూ "ఈ రోజు అమెరికా తీరానికి హాంకాంగ్ నుంచి వచ్చిన "నిప్పన్ మారు" అనే ఓడ ఒక విచిత్రమైన వ్యక్తిని అమెరికా తీరానికి తీసుకుని వచ్చింది. అతడి పేరు "ఛార్లెస్ ఏ మార్టిన్". ఇది క్రైస్తవ నామమే అయినప్పటికి, అతడు భారతదేశంలో – అగ్రవర్ణ బ్రాహ్మణ వర్గానికి చెందిన వ్యక్తి. అతడు ఫ్రెంచి ఇండియన్ ఓడ రేవులో ఓడను ఎక్కి, పాండిచ్చేరికి చెందిన తాను మత విద్యనభ్యసించడానికి పారిస్ వెళుతూ మార్గ మధ్యంలో శాన్‌ఫ్రాన్సిస్కోలో దిగానని ప్రకటించుకున్నాడు. అతడితో ప్రయాణం చేసిన వ్యక్తులను విచారిస్తే ఆ వ్యక్తి తాను చెప్పిన ప్రదేశంలో ఓడ ఎక్కలేదని, అతడు విప్లవకారుడైనా అయి ఉండాలి, లేదా బ్రిటిష్ ప్రభుత్వపు దూత అయినా అయి ఉండాలి అనుకున్నాము అని చెప్పారు." అంటూ ఆ పత్రిక ఈ విషయాన్ని ప్రకటించింది. ఇలా మార్టిన్ పేరుతో ఉన్న ఎం.ఎన్.రాయ్ అమెరికా భూమిమీద దిగేటప్పటికి అనుమానాస్పద వ్యక్తిగా ఉన్నాడు. ఇలాంటి పరిస్థితిలో 'స్టాన్‌ఫర్డ్' విశ్వవిద్యాలయంలో ఉన్న అతని మిత్రుడు ఈ రకం ప్రచారం జరగడం మంచిది కాదని, వెంటనే పేరు మార్చుకోమని సలహా చెప్పాడు. అతడి సలహానుసరించి నరేంద్రనాథుడు తన పేరును మానవేంద్రనాథరాయ్ అని మార్చుకున్నాడు. ఆ తరువాత అదీ చిన్న పేరుగా మారి ఎం.ఎన్.రాయ్‌గా వ్యవహారంలోకి వచ్చింది. అయితే ఇక్కడ ఒక విషయం గమనించాలి. అతడికి తల్లిదండ్రులు పెట్టిన పేరు నరేంద్రనాథ ఛటర్జీ. అలాంటప్పుడు రాయ్ అనే ఇంటిపేరు ఎలా వచ్చిందో తెలియదు. రాయ్ అనే ఇంటి పేరుకు భట్టాచార్య అనే అసలు ఇంటి పేరుకు ఎలాంటి సంబంధం లేదు. ఈ విషయమై ఎం.ఎన్.రాయ్ ఏనాడూ వివరణ ఇవ్వలేదు.

అలా–స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో అతడు ఎం.ఎన్.రాయ్‌గా అవతరించాడు. "ఇది నాకు పునర్జన్మ" అని రాయ్ అంటూ ఉండేవాడు. అక్షరాల ఇది అతడికి పునర్జన్మే.

భారత్‌లోని ఉగ్రజాతీయవాది నరేంద్రనాథుడికి, అమెరికాలోని ఎం.ఎన్.రాయ్‌కి చాలా తేడాలున్నాయి. ఈ పేరుతోనే అతడు తన జీవితంలో కొన్ని కొత్త పుంతలు తొక్కాడు. ఈ విషయాన్ని ఎం.ఎన్.రాయ్ తన "జ్ఞాపకాలు" అనే పుస్తకంలో రాస్తూ "ప్రస్తుత నా జీవన యానం – కొత్త ప్రపంచాన్ని చేరుకునేందుకు ప్రారంభం అయ్యింది" అని చెప్పుకున్నాడు.

ఎం.ఎన్.రాయ్ శాన్‌ఫ్రాన్సిస్కోలో ఓడ దిగిన తరువాత అక్కడి నుండి స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఉన్న "పాలో ఆల్టో"కు వెళ్ళాడు. ఎందుకంటే "పాల్ ఆల్టో"లో అతడి విప్లవ సహచరుడైన యదుగోపాల్ ముఖర్జి సోదరుడు ధనగోపాల్ ముఖర్జి ఉన్నాడు. అతడు ఎం.ఎన్.రాయ్‌కి ఎంతగానో సహాయపడ్డాడు. అతని సలహాతోనే మార్టిన్ తన పేరును మార్చుకున్నాడు. అంతేకాదు – అతడి ఇంట్లోనే "రాయ్" కొన్నాళ్ళు ఉన్నాడు. ఇక్కడ ధనగోపాల్ ముఖర్జీ గురించి రెండు మాటలు చెప్పాలి.

ధనగోపాల్ ముఖర్జీ అమెరికాలో ప్రసిద్ధుడైన రచయిత, అంతేకాదు, అమెరికాలో ఉన్న భారతీయ విప్లవకారుల్లో అతడికి చాలా గౌరవ మర్యాదలున్నాయి. మేధావుల్లో ఒకడుగా గుర్తింపు పొందిన ధనగోపాల్ ముఖర్జీకి ఎంతోమంది మేధావులతో సన్నిహిత పరిచయాలున్నాయి. అమెరికాలో ఉన్న కాలంలో రాయ్‌కి ధనగోపాల్ ముఖర్జీ పలుకుబడి ఎంతగానో ఉపకరించింది. కొన్నాళ్ళు రాయ్ తన ఇంట్లో ఉన్న తరువాత, ధనగోపాల్ ముఖర్జీ, రాయ్ ఉండటానికి ఒక ఇల్లు చూపించి పెట్టాడు. '244, రమూనా' లో ఉన్న ఆ ఇల్లు "మిసెస్ ఎ నోబెల్" అనే ఆమెది. ఆమె ఒక పోలీసు అధికారి తల్లి. "పాలో ఆల్టో"లో ఉన్న 2 నెలల కాలమూ రాయ్ ఆమె ఇంటిలోనే ఉన్నాడు.

రాయ్ అమెరికా వెళ్ళేనాటికి అమెరికా పశ్చిమతీరంలో భారతీయ విప్లవకారులు, వారి పట్ల సానుభూతి ఉన్నవారు ఎందరో ఉన్నారు. 1913లో శాన్‌ఫ్రాన్సిస్కోలో హరదయాళ్ "గదర్ పార్టీ"ని స్థాపించాడు. బర్కలీలో ఉన్న కాలిఫోర్నియాలో తత్వశాస్త్రాచార్యులుగా పనిచేస్తూ ఉన్న "ఆర్థర్ ఉఫామీ పోప్" (1881–1969) హరదయాళ్ శర్మ ప్రభావంతో భారత స్వాతంత్ర్యోద్యమం పై ఎంతో సానుభూతి ఉన్నవాడుగా వినుతికెక్కాడు. దాదాపుగా ఈ విధమైన దృక్పథం విశ్వవిద్యాలయ ఆచార్యులయిన ఆర్థర్ రైడర్ (సంస్కృతం, ప్రాచీన భాషల అధ్యాపకుడు), ఛార్లెస్ రికర్, ఫ్రిడ్జ్ క్రూగర్ (రాజకీయశాస్త్ర అధ్యాపకుడు), థామస్ హరిసన్ రీడ్, ఇత్యాదులకు కూడా ఉండేది. అంతేకాదు వీరందరికి మించి ప్రపంచ ప్రఖ్యాత రచయిత 'జాక్ లండన్' కు భారతీయులు చేస్తున్న స్వాతంత్ర్య పోరాటంపై ఎంతోసానుభూతి ఉండేది. "జాక్ లండన్" 1913లో లాలా హరిదయాళ్‌ను ప్రధాన పాత్రగా చేసి "The Little Lady of the Big House" అనే మంచి నవలను రాయడం భారతీయులకు గర్వకారణం – అని ఈ సందర్భంలో చెప్పక తప్పదు.

మన స్వాతంత్ర్యోద్యమంపై సానుభూతి మాత్రమేకాదు, మన సంస్కృతిపట్ల ఆదరణ కూడా ఆ రోజుల్లో అమెరికాలో అధికంగానే ఉండేది. జాన్ సియసెస్ రూత్ Jan Seuses Ruth వంటివారు కాళిదాసు రచించిన "అభిజ్ఞాన శాకుంతలం" సంస్కృత నాటకాన్ని ఇంగ్లీషులోకి అనువదించి ఒక నృత్య నాటకంగా Baleat రూపొందించి, భారతీయ విప్లవ కారుల సహకారంతో ప్రదర్శించడం ఇందుకు ఒక ఉదాహరణ.

రాయ్ అమెరికాలో అడుగుపెట్టిన తొలినాళ్ళ నుంచి అక్కడ ఉన్న ప్రస ం సామాజిక శాస్త్రవేత్తలను, మేధావులను, అభ్యుదయవాదులను కలుసుకుంటూ ఉండేవాడు. ఇలా ఎంత మందిని కలుసుకున్నా అతడికి అత్యధిక సాన్నిహిత్యం "ఆర్థర్ పోప్" ఎవిలిన్ ట్రాంట్ అనే మహిళతోనూ ఉండేది. ఎవిలిన్ ట్రాంట్ రాడికల్ భావాలుగల అమెరికన్ యువతి. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో ఆమెకు చురుకైన పాత్ర ఉండేది. ఈమె స్టాన్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలో చదువుకుంది. కళల పట్ల ఇష్టం, కళాకారులంటే అభిమానం, వివిధ మేధాపరమైన విషయాలపట్ల ఆసక్తి ఆమెకు ఎక్కువగా ఉండేవి. ధనగోపాల్ ముఖర్జీ భార్య ఎవిలిన్‌ను రాయ్‌కి పరిచయం చేసింది. తొలి పరిచయంలోనే ఇద్దరూ ఒకరిపట్ల ఒకరు ఆకర్షితులయ్యారు. ఎవిలిన్ అభ్యుదయ భావాలు గల యువతి. నీగ్రోలకు యూనివర్సిటీ హాస్టల్‌లో ఉండడానికి అనుమతి లేదని ఆమె యూనివర్శిటీ హాస్టల్‌లో ఉండటానికి నిరాకరించింది. ఆమె మానవతా దృక్పథానికి, తిరుగుబాటు ధోరణికి, సాహసానికి, రాయ్ ఆమెపట్ల ఆకర్షితుడయ్యాడు. ఇద్దరూ వివాహం చేసుకుందామని నిశ్చయించుకున్నారు.

ఎవిలిన్ తండ్రి కూడా అభ్యుదయ భావాలు కలవాడేగాని తన కుమార్తె ఒక భారతీయుడ్ని పెళ్ళి చేసుకోవడం అతడికి నచ్చలేదు. తండ్రికి ఇష్టం లేకపోయినా, ఎవిలిన్ రాయ్‌ని వివాహం చేసుకోదలచింది.

ఇది చూచి ఆగ్రహించిన ఎవిలిన్ తండ్రి తన కూతురును ఎం.ఎన్.రాయ్ లేవదీసుకుని పోయాడని పోలీసు రిపోర్టు ఇచ్చాడు. అప్పుడు పోలీసులు ఎవిలిన్‌ను విచారణ చేసి వివరణ అడిగితే, ఆమె తామిద్దరమూ ప్రేమించుకుని వివాహం చేసుకోదలచామని, ఇది తన తండ్రికి ఇష్టంలేని కారణంగా పోలీసులకు ఫిర్యాదు చేసాడని చెప్పింది. అప్పుడు పోలీసులు ఈ విషయాన్ని అంతటితో వదలిపెట్టారు. అయినా – ఇక అక్కడ ఉండటం క్షేమంకాదని వీరిద్దరూ న్యూయార్క్‌కు వెడలిపోయారు. న్యూయార్క్‌లోనే వీరిద్దరి వివాహం జరిగింది. న్యూయార్క్‌లో ఎవిలిన్ సోదరుడు ఉన్నాడు కాబట్టి అతడి ఆదరణ తమకు లభిస్తుందని వారు ఆశించారు. ఇద్దరూ అతడి ఇంటికి వెళితే, అతడు వారిని తన ఇంటికి ఆహ్వానించలేదు సరికదా – తన ఇంటిలో ఉండవద్దని నిష్కర్షగా చెప్పాడు.

న్యూయార్క్‌లో భారతీయ విప్లవకారులు కొందరున్నారు. వారిలో రాయ్‌కి పరిచయం ఉన్నవారి దగ్గరకువెళితే, వారుకూడా ఈ నూతన దంపతులను తమ ఇంటిలో ఉంచుకోవడానికి అంగీకరించలేదు. ఒక శ్వేతవనితను భారతీయ విప్లవకారుడు వివాహం చేసుకోవడం వారికి రుచించలేదు. భారతీయ విప్లవకారుడు చక్రవర్తి ఎవిలిన్‌ను అవమానపరిచాడు కూడా.

ఇట్లాంటి పరిస్థితుల్లో ఈ నవదంపతులకు ఒక మహోన్నత వ్యక్తి దగ్గర ఆశ్రయం లభించింది. ఆ మహనీయుడే గొప్ప దేశభక్తుడు "లాలాలజపతిరాయ్" (1865-1928). ఆ తరువాతి కాలంలో ఆయన భారత జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా కూడా ఎన్నికయ్యారు. పంజాబ్‌కు చెందిన లాలాలజపతిరాయ్ గొప్ప సేవాసంస్థ "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటి"ని స్థాపించాడు కూడా. లాలాలజపతిరాయ్ స్ఫూర్తితో భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ గొప్ప సాహస కార్యాలను చేశారు. లాలాలజపతిరాయ్ "పంజాబ్ కేసరి"గా ప్రసిద్ధుడు. కాంగ్రెస్‌లో అతివాదులుగా ప్రసిద్ధి చెందిన "లాల్-బాల్-పాల్" త్రయంలో లాలాలజపతిరాయ్ ప్రసిద్ధుడు. 1907లో అమెరికాకు వెళ్లిన లాలాలజపతిరాయ్ న్యూయార్క్‌లో ఇండియన్ హోంలీగ్ అనే సంస్థను స్థాపించడం మాత్రమే కాకుండా, 'యంగ్ ఇండియా' అనే పత్రికను, "హిందూస్థాన్ ఇన్‌ఫర్‌మేషన్ సర్వీసెస్ అసోసియేషన్" అనే సంస్థను కూడా స్థాపించాడు.

లాలాలజపతిరాయ్ అమెరికా వెళ్ళడంలోని ముఖ్య ఉద్దేశం భారత స్వాతంత్ర్య పోరాటానికి అమెరికా మద్దతును కూడగట్టటం. అమెరికన్ సెనేట్ విదేశీవ్యవహారాల కమిటీకి బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో అవలంబిస్తున్న అణచివేత ధోరణులను వివరంగాతెలిపి, భారతీయులకు అమెరికన్ సెనేట్ నైతిక మద్దతును సంపాదించాలని అతడి ఆకాంక్ష. ఈ ఉద్దేశంతోనే లజపతిరాయ్ అమెరికన్ సెనేట్‌కు ఒక పిటీషన్‌ను కూడా పంపాడు. లజపతిరాయ్ పంపిన పిటీషన్‌ను అమెరికన్ సెనేట్ చర్చించింది.

ఇలాంటి లజపతిరాయ్ ఎం.ఎన్.రాయ్ దంపతులకు తన ఇంటిలో ఆశ్రయం ఇవ్వటంలో ఆశ్చర్యం లేదు. అయితే – రాయ్‌కి ఆదాయ మార్గం ఏదీ లేదు కాబట్టి, కొంత ఆదాయం అతడికి సమకూర్చాలనే ఉద్దేశంతో అతడిని తన కార్యదర్శిగా నియమించుకొని,– కొంత జీతం వచ్చే మార్గం చూపించాడు. లజపతిరాయ్ ఎం.ఎన్.రాయ్‌ని ఎంతగానో అభిమానించాడు. దీనికి కారణం స్వాతంత్ర్య సాధనపట్ల మానవేంద్రునికి గల చిత్తశుద్ధి, కార్యదీక్ష.

లజపతిరాయ్ న్యూయార్క్ రావడానికి ముందే చాలామంది భారతీయ విప్లవకారులు అమెరికాలో ఉండేవారు. వారిలో హేరంబాలాల్ గుప్తా, డా॥ చంద్ర చక్రవర్తి, వసంత కుమార్ రాయ్, భూపేంద్రదాస్ దత్తా, తారకాదాస్ మొదలయినవారు న్యూయార్క్‌లో ఉన్న జర్మన్లతో వీరు సన్నిహితంగా ఉంటూ భారతదేశంలో సాయుధ విప్లవంవచ్చేందుకు ప్రయత్నిస్తూ ఉండే వారు.

వారందరూ కూడా లజపతిరాయ్‌తో సన్నిహితంగా ఉండేవారు కాని-వారెవరూ లజపతిరాయ్‌ని ఆకట్టుకోలేదు. ఈ విషయాన్ని తన "ఆత్మకథ"లో రాస్తూ-లజపతిరాయ్ "అమెరికాలోని భారతీయ విప్లవకారులతో నా అనుభవం చాలా నిరాశాజనకమయింది. వీరికి దేశభక్తి అనేది ఒక లాభసాటి వ్యాపారం. వీరందరూ విప్లవ కార్యకలాపాల కోసం వసూలుచేసిన ధనాన్ని విలాసాల మీద ఖర్చుపెడుతూ ఉండేవారు. బెంగాలీ విప్లవకారుల్లో ఎవరిమీదనైనా నాకు నిజమైన గౌరవం ఉందంటే-అది "ఎం.ఎన్.రాయ్" పైనే అని రాయడం గమనించదగ్గ విషయం.

ఎం.ఎన్.రాయ్‌కి కూడా అమెరికాలో ఉన్న భారతీయ విప్లవకారుల పై సదభిప్రాయం లేదు. అమెరికా నుండి ఒక మిత్రుడికి ఎం.ఎన్.రాయ్ రాసిన లేఖలో ఇలా అంటాడు - "ఇక్కడ పరిస్థితులు చాలా అధ్వానంగా ఉన్నాయి. చెప్పుకోదగ్గ పని ఏదీ జరగటం లేదు. అందరికీ నాయకులైపోదాం అన్న కోరిక తప్ప, పనిచేయాలన్న కోరిక లేదు. జర్మన్లకు మనమీద నమ్మకం లేదు. వారు మన దేశంలో గాని విప్లవం జరిగితే అది తమ అవసరార్థం ఉపయోగించు కుందామని చూస్తున్నారు." ఈ మాటలు ఆనాటికి అక్కడ ఉన్న పరిస్థితులను చెప్పక చెపుతున్నాయి. (దీని గురించిన మరికొన్ని వివరాలను Evolution of political philosophy of M.N.Roy By G.P.Bhattacharjee లో చూడండి).

ఎం.ఎన్.రాయ్‌కి లాలాలజపతిరాయ్‌కీ ఆ కాలంలో పెంపొందిన సాన్నిహిత్యం గురించి ఒక ఆసక్తికరమైన ఉదంతం చెపుతాను. లాలాలజపతిరాయ్‌కి భారతీయ భోజనం పట్ల చాలా ఇష్టం ఉండేది. అమెరికా భోజనం అతడికి రుచించేది కాదు. లజపతిరాయ్ పడుతున్న అవస్తను గమనించిన ఎం.ఎన్.రాయ్ "పంజాబ్ కేసరి"కి తరుచూ భారతీయ వంటకాలు చేసిపెడుతూ ఉండేవారు. ఇలాంటి సందర్భంలో ఓసారి లజపతిరాయ్ తన యువ మిత్రుడయిన ఎం.ఎన్.రాయ్‌ని రసగుల్లాలు చేసిపెట్టమని కోరాడు.

రసగుల్లా బెంగాలీ వంటకం. పంజాబ్‌కు చెందిన లజపతిరాయ్ తమ బెంగాలీ వంటకంపై అంత అభిమానం చూపించే సరికి రాయ్‌కి ఎంతో ఆనందం కలిగింది. "తప్పకుండా చేసిపెడతాను లాలాజీ" అని అన్నాడు.

రసగుల్లాలు చేయడానికి బెంగాలీ భాషలో "ఛెనా" అనే పదార్థం అవసరం. దీన్ని కాగే పాలతో తయారుచేస్తారు. అప్పట్లో ఇది అమెరికాలో దొరికేది కాదు. అయినా, అది లేకుండానే ఎం.ఎన్.రాయ్ రసగుల్లాలు తయారుచేసాడు. వాటిని చూడగానే లజపతిరాయ్ ముఖం వికసించిపోయింది. చంటిపిల్లవాడిలా ఆనందంగా రసగుల్లాలు తింటున్న పంజాబ్ కేసరిని చూసి, ఎం.ఎన్.రాయ్ ఆనందంతో పొంగిపోయాడట.

ఇలాంటి ఉదంతాల విషయం ఎలా ఉన్నా అమెరికాలో ఉండగానే ఎం.ఎన్.రాయ్‌కి సోషలిజంతో పరిచయం ఏర్పడి అతడి జీవితం మరో మలుపు తిరగడానికి కారణం అయ్యింది. ఇందుకు కూడా లజపతిరాయ్ కారకుడు కావడం గమనించదగ్గ విషయం.

అమెరికాలో ఉండగా ఎం.ఎన్.రాయ్ అక్కడ ఉన్నా సోషలిస్టులతోనూ, ఏనార్కిస్టుల తోనూ (Anarchists) సిండికలిస్ట్‌లతోనూ (Syndicalists) తరుచూ సమావేశమై చర్చలు జరుపుతూ ఉండేవాడు. ఈ కారణంచేత ఎం.ఎన్.రాయ్‌కి అమెరికాలో ఉండగానే సోషలిజంపై కొంత స్థూలమైన అవగాహన కలిగింది. ఈ విషయాన్ని గమనించిన "పంజాబ్ కేసరి", ఎం.ఎన్.రాయ్‌కి కమ్యూనిస్టు సిద్ధాంత పితామహుడు "కారల్ మార్క్స్ ప్రసిద్ధ గ్రంథం "డాస్ కేపిటల్" మూడు వాల్యూములను, మరికొన్ని సోషలిస్టు తత్వాన్ని తెలిపే గ్రంథాలను కొని ఇచ్చాడు.

అమెరికాలో ఎం.ఎన్.రాయ్‌కి మేధాపరమైన ఆహారం సంతృప్తిగానే దొరికేది కాని, లజపతిరాయ్ జీతం ఇస్తూ ఉన్నా, కొన్ని ఆర్థిక ఇబ్బందులు మాత్రం ఉండేవి.

ఆగ్నెస్ స్మెడ్లీ (Agnes Smedley) అనే అమెరికన్ రచయిత్రి, విప్లవకారిణి తాను రచించిన "The Daughter of the Earth" అనే ఆత్మకథా నవలలో రాయ్‌ని అభివర్ణిస్తూ "రాయ్ సన్నగా, నల్లగా ఉండేటప్పటికి అందంగానే ఉండేవాడు. అయితే – చాలా బీదవాడుగా కనిపించేవాడు" అనడం పేర్కొనదగ్గది.

లజపతిరాయ్ ఇచ్చిన పుస్తకాలను ఎం.ఎన్.రాయ్ శ్రద్ధగా అధ్యయనం చేయడం మాత్రమే కాకుండా న్యూయార్క్‌లో ఉన్న ప్రసిద్ధ గ్రంథాలయంలో సోషలిజంకు సంబంధించిన అనేక గ్రంథాలను చదివి, ఆ సిద్ధాంతంపట్ల ఆకర్షితుడయ్యాడు. ఇన్నాళ్ళు నడిచిన తోవకంటే ఇది విలక్షణమైనది అని గ్రహించాడు.

ఎం.ఎన్.రాయ్ అమెరికా వెళ్ళేటప్పటికి అమెరికాలో సోషలిస్టు పార్టీ ఉన్నది. ఇది 1900 సంవత్సరంలో స్థాపించబడేనాటికి 10వేల మంది సభ్యులుండేవారు. 1912 నాటికి సభ్యుల సంఖ్య లక్ష దాటింది. ఆనాటికే అమెరికాలో 300 సోషలిస్టు పత్రికలు ఉండేవి. అంతేకాదు వీటిలో కొన్నింటికి మంచి సర్క్యులేషన్ కూడా ఉండేది. ఇలాంటి పరిస్థితుల్లోనే రాయ్ సోషలిజంకు సన్నిహితుడయ్యాడు.

రాయ్‌కి ఇప్పుడు తన కంటిముందు ఒక కొత్త సామాజిక వ్యవస్థ కనబడుతున్నది. ఇంతకు ముందున్న లక్ష్యం, భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి మాత్రమే పరిమితమయింది. కాని ఇప్పుడు తన ముందున్నది మరొక కొత్త ప్రపంచం. ఒకటి – ఆర్థిక శక్తుల నిర్వాహణకు సంబంధించినదైతే మరోదానికి ఈ విషయంపై ప్రత్యేకమైన ఆలోచన

లేదు. ఒకటి హేతువాద, భౌతికవాదాల్ని అంగీకరించమని చెపుతుంది. మరొకటి – ఈ విషయమై ప్రజలను ఆలోచించమని చెప్పదు. ఈ రెండు మార్గాల్లో దేనిని అనుసరించాలి? లేదా రెండింటి సమన్వయము సాధ్యమా అని అమెరికాలో ఉన్న రోజులలో రాయ్ తనలో తాను మధనపడుతూ ఉండేవాడు. అయితే జాతీయవాదం నుండి సామ్యవాదానికి మారడానికి కొంతసమయం పట్టింది.

రాయ్ సామ్యవాదిగా మారడానికి మరికొన్ని కారణాలు కూడా ఉన్నాయి. జర్మనీ నుండి భారతదేశానికి ఆర్థిక సహాయం అందడానికి అవకాశాలు లేవని నిర్ధారణ అయిన తరువాత రాయ్‌కి భారతదేశంలోని విప్లవకారుల సమాచారం సరిగ్గా తెలియడం లేదు. విప్లవకారుల్లో చాలామంది అరెస్టు కాబడడమో, రహస్య ప్రదేశాలలో తలదాచుకోవడానికి వెళ్లిపోవడమో జరిగింది. కొంతమందిని ఉరికూడా తీసారు. భారతదేశంలోని విప్లవకారుల్లో నిరాశ, నిస్పృహలు తాండవిస్తున్నాయి. ఇట్లాంటి పరిస్థితుల్లో తాను అక్కడికి వెళ్ళి చేయగలిగింది ఏమీ లేదు. పైగా అరెస్టయ్యే ప్రమాదం కూడా ఉంది.

సోవియట్ రష్యాలో బీదరికాన్ని తొలగించడానికి, అట్టడుగు ప్రజల అభివృద్ధికి, సామాజిక న్యాయ సాధనకు, ఎంతో కృషి జరుగుతున్నది. ఇది తనకు ఎంతో ఆత్మీయమైన విషయం. అన్నింటికి మించి వలస రాజ్య విధానానికి సోవియట్ రష్యా వ్యతిరేకం. ప్రపంచ ప్రజలను విదేశీ పాలన నుండి విముక్తి చేసి వారికి స్వాతంత్ర్యం లభించేలా చేయాలని సోవియట్ రష్యా కోరుకుంటున్నది. ఇలా ఆలోచించడం మంచిదే అనిపించింది. సోషలిజంలో రహస్య కార్యకలాపాలను నిర్వహించడానికి, లక్ష్య సాధనకు అవసరమైతే హింసాత్మక విధానాలను అనుసరించడానికి అవకాశం ఉంది. ఇలాంటి కార్యక్రమాలు అన్ని తనకు అలవాటయినవే !–

ఈ విషయాలనన్నింటిని వివరిస్తూ ఎం.ఎన్.రాయ్ తాను రాసుకున్న "జ్ఞాపకాలు" (Memories) అనే పుస్తకంలో ఇలా రాసుకున్నాడు" కొందరు వ్యక్తుల వీరోచిత కార్యకలాపాల తోను పిస్తోళ్లు, బాంబులు ఇట్లాంటివాటిని ప్రయోగించే విధానంతోనూ ముడిపడిన నా ఆలోచనలు క్రమక్రమంగా మాయమవుతున్నాయి. వలస రాజ్య విధానానికి వ్యతిరేకంగా జరిగే ఉగ్ర జాతీయవాద కార్యక్రమాలకు, కమ్యూనిజంకు మధ్య ఉన్న దూరం తక్కువే అనిపించింది. –"

ఇది ఇలా ఉండగా, భారతదేశ ఉగ్రజాతీయవాదంలో 'మతం' అనే దానికి చాలా ప్రాధాన్యత ఉంది. ఇది మొదటి నుండి రాయ్‌కి నచ్చేది కాదు.

ఆ రోజుల్లోనే లాలాలజపతిరాయ్ అమెరికన్ సోషలిస్టులను ఉద్దేశించి ప్రసంగిస్తూ – భారతదేశంలోని పేదరికాన్ని, అట్టడుగు వర్గ ప్రజల దారిద్ర్యాన్ని కండ్లకు కట్టినట్లు వర్ణించాడు. ఆ ప్రసంగంకూడా ఎం.ఎన్.రాయ్‌ని ఈ దారిద్ర్యం నుండి భారతదేశాన్ని రక్షించా లంటే ఏం చేయాలి ? – అనే దిశగా ఆలోచింపచేసింది.

రాయ్‌లో సోసలిజం వైపు కలుగుతున్న మొగ్గుకు ఎవిలిన్‌రాయ్ కూడా దోహదం చేసింది. ఆమె రాడికల్ భావాలు ఉన్న మహిళ అని ఇదివరకే చెప్పుకున్నాం.

కథ ఇలా జరుగుతూ ఉండగా, అమెరికాలో ఉన్న ఎం.ఎన్.రాయ్‌ని పట్టుకునేందుకు బ్రిటిష్ ప్రభుత్వం తీవ్ర ప్రయత్నాలు చేస్తూనే ఉంది. ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయ్యింది. కొంతకాలం వరకు అమెరికా ఈ యుద్ధంలో తటస్థంగానే ఉంది గాని, ఆ తరువాత బ్రిటిష్‌వారికి అనుకూలంగా యుద్ధంలో దిగింది. 1917జూన్‌లో అమెరికా యుద్ధంలోకి దిగిన వెంటనే – రాయ్ మీద "హిందూ జర్మన్ కుట్ర" కేసు బనాయించబడింది, అంతేకాదు. అమెరికాలో ఉన్న వందమంది అమెరికన్లపైన – ఇండియన్ల పైన – జర్మన్లపైన కేసు పెట్టడం జరిగింది. వీరందరిపైన నిందారోపణ ఏమిటంటే "అమెరికా తటస్థ విధానాన్ని అనుసరించే రోజుల్లో ఆ విధానానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా కుట్రలలో పాల్గొనడం, ఇందుకుగానూ జర్మనీలోని కైజర్ ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని – అమెరికాలో ఉన్న జర్మన్ రాయబార కార్యాలయం ద్వారా పొందటం, భారత దేశంలో విప్లవం జరగడానికి తోడ్పడడం, యుద్ధం విషయంలో జర్మనీకి తోడ్పడేటట్లు ప్రవర్తించడం, యూరప్‌లో ఉన్న భారతీయ బ్రిటిష్ సైన్యాన్ని యుద్ధకార్యక్రమాల నుండి భారతదేశంలో జరుగుతున్న తిరుగు బాటుకు తోడ్పడేలా ప్రోత్సహించటం" మొదలైనవి.

ఈ కేసు వ్యవహారం ఇలా ఉండగా లాలాలజపతిరాయ్ సభకు వెళ్ళిన ఎం.ఎన్. రాయ్‌ని పోలీసులు పట్టుకుని, అమెరికా ఇమ్మిగ్రేషన్ చట్టాన్ని ఉల్లంఘించినందుకు గాను జైలులో పెట్టారు. ఒక రాత్రి జైలులో ఉన్న తరువాత, జ్యూరీ ముందు హాజరుపరిచారు. ఆ తరువాత వ్యక్తిగత పూచీమీద బెయిలు ఇచ్చారు. బెయిలు లభించగానే రాయ్ దంపతులు అమెరికా నుండి పారిపోవడానికి నిశ్చయించుకున్నారు.

ఈ విషయాన్ని తన "జ్ఞాపకాలులో" రాస్తూ "గాంధీజీ భారతదేశానికి తిరిగి రాకముందు జైలులో బంధించడం అనేది సిగ్గుపడవలసిన విషయంగా ఉండేది. కాని గాంధీ దానిని ఒక ఘనకార్యంగా మార్చేసాడు. ఆయన జైళ్ళను "ఇంగ్లాండు చక్రవర్తి అతిథి గృహాలు" అనేవాడు. కాని జైళ్ళు అతిథి గృహాలు కావు. జైళ్ళలో చాలా క్రూరమయిన పరిస్థి తులుండేవి. విప్లవకారులను ఏళ్లతరబడి జైళ్ళలో మ్రగ్గబెట్టేవారు. కొంతమందిని ఉరి తీసేవారు. కొంతమంది జైళ్ళలోనే చనిపోయేవారు"–అమెరికాలోని జైళ్ళ పరిస్థితికూడా ఇందుకు భిన్న మయింది కాదు. ఇలాంటి పరిస్థితుల్లో తాను జైలులో ఉంటే ఎప్పటకీ విడుదలయ్యే అవకాశం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో తాను అమెరికా నుండి ఇంకో దేశానికి పారిపోవడమే శరణ్యం. కాని, ఎక్కడకు వెళ్ళాలి ? – ప్రభుత్వం కన్నుగప్పి ఎలా వెళ్ళాలి ? – ఇవన్నీ సమస్యలు.

అమెరికాకు దగ్గరగా ఉన్న మెక్సికో ప్రపంచయుద్ధంలో తటస్థంగా ఉండి, ఎవరివైపూ చేరలేదు. ఒకప్పుడు ఆ దేశం స్పెయిన్ పరిపాలనలో ఉండేది. కాని ఆ తరువాత ఆ దేశంలోని

దేశభక్తులు వలస రాజ్య విధానానికి మంగళం పాడి తమ దేశానికి స్వతంత్రం తెచ్చుకున్నారు. ఆ దేశంలో వామపక్ష భావాలు బలంగా ఉన్నప్పటికి, ఈ విధానాలను నచ్చనివారికి, మెక్సికో ప్రభుత్వానికి మధ్య అంతర్ యుద్ధాలు జరుగుతున్నాయి. ఈ అంతర్ యుద్ధాలతో మెక్సికో దేశం సతమతమవుతున్నది. ఒక విధమయిన అరాచకత్వం అక్కడ ఉన్నది. సోషలిస్టులు, ఏనార్కిస్టులు, సిండకలిస్టులు, ఇలా వేర్వేరు గ్రూపులు అక్కడ ఉన్నాయి. విదేశీ పెట్టుబడిదారుల పట్ల సానుభూతిలేని మెక్సికో ప్రభుత్వం స్థిరంగా ఉండడం అమెరికాకు ఇష్టం లేదు. ఇదీ అక్కడ ఉన్న పరిస్థితి. అయితే మెక్సికోకు అమెరికా నుండి ఎవరు వలస వచ్చినా ఎలాంటి అభ్యంతరాలు ఉండవు. పైగా తటస్థరాజ్యంగా చెప్పుకొనేటప్పటికి మెక్సికో మొగ్గు జర్మనీ వైపే ఉంది. ఈ విషయాలన్నింటినీ గమనించిన ఎం.ఎన్.రాయ్ దంపతులు పోలీసుల కన్నుగప్పి మెక్సికోకు పారిపోవడమే శరణ్యం అని భావించారు. అయితే మెక్సికోలో తమకు తెలిసినవారెవరూ లేరు. ఈ పరిస్థితుల్లో గతంలో "పాలో ఆల్టో" లో ఉన్నప్పుడు "కొరీ పోప్" ద్వారా పరిచయమయిన 'స్టాన్ ఫర్డ్ విశ్వవిద్యాలయం" అధ్యక్షుడు "డాక్టర్ గోర్డాన్" దగ్గరకు వెళ్లి, మెక్సికో వెళ్ళే విషయంలో అతడి సహాయాన్ని అర్థించాడు. 'రాయ్' అంటే సదభిప్రాయం ఉన్న 'గోర్డాన్' తాను ఎరిగిన మెక్సికో గవర్నర్ జనరల్ 'అల్వరేడో' కు ఒక పరిచయ పత్రం ఇచ్చాడు.

అమెరికా, మెక్సికోల మధ్య కొన్ని వందల మైళ్ళ సరిహద్దు ఉంది. దీనినంతటిని కనిబెడుతూ ఉండటం అమెరికన్ అధికారులకు అసాధ్యం. అందుచేత, రాయ్ దంపతులు న్యూయార్క్ నుండి రెండు రోజులు రైలులో ప్రయాణం చేసి 1917 జూలైలో మెక్సికోకు చేరుకున్నారు. అప్పటికి 'ఎవిలిన్' తన పేరును 'శాంతిదేవి' అని మార్చుకున్నది.

* * * * *

రాయ్ దంపతులు మెక్సికోకు చేరుకునేసరికి వారి చేతిలో డబ్బు లేదు. మెక్సికోలో మిత్రులు లేరు. అలాంటి స్థితిలో రాయ్ తన భార్యతో సహా ఒక చిన్న హోటల్‌లో దిగి, అల్వరేడోను కలుసుకోవడం గురించిన వివరాలు కనుగొన్నాడు. అల్వరేడోను కలుసుకోవాలంటే తాను ఉన్న ప్రదేశం నుండి 1000 మైళ్లదాకా ప్రయాణం చేయాల్సి ఉంటుందని తెలిసింది. అంత దూరం వెళ్ళడానికి తగిన ద్రవ్యం తన దగ్గర లేదు.

తాను ఉన్న ఊళ్ళో మెక్సికో రక్షణ మంత్రి ఉన్నాడని తెలిసంది. అతడిని కలుసుకొని గోర్డాన్ రాసిన లేఖను చూపిస్తే ఏమన్నా ప్రయోజనం ఉంటుందా అని ఆలోచించాడు. ప్రయోజనం ఉన్నా, లేకపోయినా, ప్రస్తుత పరిస్థితుల్లో తాను చేయగలిగింది ఏదీ లేదు. అయితే రక్షణ మంత్రి ఇంటర్వ్యూ తనకు లభిస్తుందా లేదా అనేది సందేహం. అయినా సాహసించి రక్షణ మంత్రి నివాసానికి వెళ్ళాడు. వెంటనే అతడికి రక్షణ మంత్రి ఇంటర్వ్యూ లభించింది.

రాయ్ సోషలిజంను సమర్థిస్తూ, బ్రిటిషువారి వలస విధానాన్ని నిరసిస్తూ రాసిన వ్యాసాలను అప్పటికే రక్షణ మంత్రి చదివి ఉన్నాడు. అమెరికాలో రాయ్ రాసిన వ్యాసాలు స్పానిష్ పత్రికల్లో కూడా వచ్చాయి.

అందుచేత రక్షణ మంత్రి రాయ్‌ని సాదరంగా ఆహ్వానించాడు. మెక్సికోకు రాయ్ ఎందుకు వచ్చాడో కూడా అతడికి తెలుసు. అతడు మెక్సికో అధ్యక్షుడు కరంజా అల్లుడు. సందేహిస్తూనే రాయ్ అల్వరేడో ప్రస్థావన అతని దగ్గర తెచ్చినపుడు "ఆయన ఇక్కడకు త్వరలోనే వస్తాడు. అప్పుడు మీరు ఆయనను కలువవచ్చు" అని చెప్పాడు. ఇలా చెప్పటం మాత్రమే కాకుండా – "మీరు ఇక్కడ సురక్షితంగా ఉండవచ్చును. మీరు మాకు మిత్రులు, అతిథులు" అని కూడా అన్నాడు. ఆ తరువాత – "త్వరలోనే మనం మళ్లీ కలుద్దాం" – అనే సూచన కూడా చేసాడు.

ఒక సమస్య తీరింది. మరి ఆర్థిక సమస్య తీరడం ఎలాగ ? అని రాయ్ ఆలోచిస్తూ ఉండగానే – ఆ ప్రక్క రోజు, అతడికి ఆశ్చర్యం కలిగించిన రెండు సంఘటనలు జరిగాయి. ఒకటి – ఒక అపరిచిత వ్యక్తి రాయ్‌కి 10 వేల సెపెక్కులు (మెక్సికో నాణెం) చెక్కును పంపడం, రెండు – మెక్సికో ప్రభుత్వ అనుకూల పత్రిక సంపాదకుడు "భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వ పాలన అనే విషయం గురించి వరుసగా వ్యాసాలు రాయమని కోరడం." ఈ రెండింటి వలన రాయ్‌కి తాను మెక్సికోలో ఆహ్వానించదగ్గ వ్యక్తిగా పరిగణించబడుతున్నాడని అర్థం అయ్యింది. ఇలా మొత్తంమీద అతడికి ప్రస్తుతానికి ఆర్థిక సమస్యలు తీరాయి.

రాయ్ మెక్సికో వెళ్ళేనాటికి అమెరికా యుద్ధంలో చేరిన కారణంగా చాలామంది అమెరికన్ తీవ్రవాదులు, సోషలిస్టులు అక్కడికి చేరుకున్నారు. వారిలో చార్లీఫిలిప్స్, మారిస్ బేకర్, ఇర్విన్ గ్రాన్‌విచ్ మొదలయినవారు కొందరు. వీరందరితోనూ రాయ్ దంపతులు సత్సంబంధాలను పెట్టుకున్నారు. మెక్సికోలోని సోషలిస్టు పార్టీలో సభ్యులుగా చేరారు.

మెక్సికోలో కళాకారులు, తత్వవేత్తలు, శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు చాలా మంది ఉన్నారు. వాళ్లందరితోనూ రాయ్ చర్చలు జరుపుతూ ఉండేవాడు. అంతేకాదు, మెక్సికోలోనే రాయ్ – ఫ్రెంచ్, జర్మన్, స్పానిష్ భాషలు నేర్చుకున్నాడు. స్పానిష్ భాషలో రచనలు చేయడం కూడా ప్రారంభించాడు.

అమెరికాలోని ఇంటెలిజెన్స్ అధికారులకు రాయ్ కదలికలు త్వరలోనే తెలిసిపోయాయి. "ఛార్లెస్ ఎ. మార్టిన్" అనే పేరుతో వ్యవహరించబడుతున్న మహేంద్రనాథ రాయ్ (ఇది మానవేంద్ర నాథ రాయ్‌కి వారు పెట్టుకున్న కొత్త పేరు) జర్మన్ల సహాయంతో భారత దేశంలో తిరుగుబాటు చేయాలని ప్రయత్నించినవాడు. కాలిఫోర్నియాలో హిందూ, జర్మన్ కుట్ర కేసులో అమెరికా ప్రభుత్వం అరెస్టు చేయడానికి చూస్తున్న వ్యక్తి. అతడు, అతడి భార్య, అమెరికా నుండి పారిపోయి,

1917 జూన్ 15న మెక్సికో చేరారు. రాయ్ సహచరుడు ధీరేంద్రనాథసేన్ కూడా మెక్సికోకు చేరి వారితో ఉంటున్నాడు. మెక్సికోకు చేరిన వెంటనే తనతో బాటు జనరల్ అల్వరెడోకు తెచ్చుకున్న పరిచయ ఉత్తరాన్ని తీసుకొని మెక్సికో రక్షణ మంత్రిని కలిసాడు. అతడు వారికి అభయహస్తం ఇచ్చాడు" అని వారు జరిగినదంతా యథాతథంగా రిపోర్టు చేశారు. అయితే అమెరికా పోలీసులు మెక్సికోలో ఉన్న రాయ్‌ని అరెస్టు చేయలేరు కాబట్టి ప్రస్తుతానికి ఏమీ జరుగలేదు.

యుద్ధం ప్రారంభం అయ్యింది కాబట్టి భారత దేశంలో ఉన్న విప్లవకారులను రెచ్చగొట్టి, ఆ దేశంలో అరాచకం సృష్టిస్తే తనకు ప్రయోజనకరంగా ఉంటుంది అని జర్మనీ భావించింది. ఇదివరకు తమ సహాయం కోసం తరచూ కలుసుకునే రాయ్ ఇప్పుడు మెక్సికోలో ఉన్నాడని తెలుసుకుని – అతడిని కలుసుకోవడానికి మనుషులను పంపారు. వారు భారతదేశంలో మందకొడిగా సాగుతున్న విప్లవకార్యకలాపాలను ఉధృతం చేయడానికి కావలసిన సాయం అంతా చేస్తాం అన్నారు. కాని, అప్పటికి రాయ్ దృష్టి ఉగ్రజాతీయవాదంపై కంటే సోషలిజం ప్రచారం పైనే అధికంగా ఉంది. అయినా – భారత స్వాతంత్ర్య సముపార్జన తనకి ఎప్పుడూ ఆత్మీయమైనదే కాబట్టి వారి కోరికకు అంగీకారం తెలిపాడు. వెంటనే వారు ఒక లక్షా యాభైవేల రూపాయలు (జర్మన్ కరెన్సీలో) అతడికి అందించారు. తనకు వచ్చిన ద్రవ్యంలో కొంత మొత్తాన్ని రాయ్ – ఆనాటికి చైనాలో ఉన్న రాస్‌బిహారిబోస్‌కు, భారతదేశంలోని విప్లవకారులకు అందచేసాడు. కాని భారతదేశంలో విప్లవకారులకు బ్రిటిష్ ప్రభుత్వం అవలంభిస్తున్న కఠిన చర్యల కారణంగా, విప్లవాన్ని కొనసాగిద్దామన్న దృష్టి కంటే దేశాన్ని విడిచి పారిపోదామనే దృష్టే ఎక్కువగా ఉంది.

ఎం.ఎన్.రాయ్ తనకు లభించిన ద్రవ్యంలో కొంత భాగాన్ని సోషలిస్టు ఉద్యమ ప్రచారానికి కూడా వినియోగించాడు. మెక్సికో నుండి వెలువడుతున్న సోషలిస్టు పత్రిక "Lalucha" ఎక్కువ పేజీలతో క్రమం తప్పకుండా వెలువడేందుకు తోడ్పడ్డాడు. ఈ కారణంగా అక్కడి సోషలిస్టులకు రాయ్ అంటే ఎంతో అభిమానం ఏర్పడింది. అతడి పలుకుబడి కూడా పెరిగింది. మెక్సికోలో సోషలిజం ప్రచారం చేసేందుకు ఎం.ఎన్.రాయ్ స్పానిష్ భాషలో కరపత్రాలు చాలా రాసాడు. మెక్సికోలోని సోషలిస్టులు – సోషలిస్టు పత్రికకు రాయ్‌ని సంపాదకుడుగా చేయడం మాత్రమే కాకుండా పార్టీ ప్రచార సంచాలకుడుగా కూడా నియమించారు. మెక్సికోలో వామపక్షవాదులు చాలామందే ఉన్నా వారిలో ఐకమత్యత లేదు. మెక్సికోలో సిండికలిస్టులు, ఏనార్కిస్టులు, కమ్యూనిస్టులు ఇలా పలుతరహాలవారు ఉన్నారని ఇదివరకే చెప్పుకున్నాం. వారందరి అంతిమ లక్ష్యం ఒక్కటే కాబట్టి – అందరినీ సమన్వయపరచడానికి రాయ్ విశేషమైన కృషి చేశాడు. అందరూ కోరుకునేది మార్క్సిస్టు భావజాలమే కాబట్టి అందరూ కలిసి ఒకే త్రాటిమీద నడవాలని ఒప్పించగలిగాడు.

రాయ్ చేస్తున్న కార్యకలాపాలన్నింటినీ గమనిస్తున్న మెక్సికో అధ్యక్షుడు జనరల్ కరంజా-రాయ్‌పట్ల ఎంతో సదభిప్రాయాన్ని ఏర్పరచుకున్నాడు. ఆ రోజులలో మన్రో సిద్ధాంతం ప్రచారంలో ఉండేది. 'అమెరికా అమెరికన్లదే' అని మన్రో సిద్ధాంతం చెపుతుంది. దీని ప్రకారం లాటిన్ అమెరికన్ రాజ్యాలను కబళిద్దామని చూసే అమెరికా ఎత్తుగడను నిరసించడం జరుగు తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం రాయ్ లాటిన్ అమెరికా రాజ్యాలను ఏకీకృతంచేసి, సామ్రాజ్య వాద దేశమయిన అమెరికాకు ధీటుగా నిలబెట్టాలని వాంఛించాడు.

అంతేకాదు ప్రపంచశాంతి అనేది జర్మనీ యుద్ధంలో ఓడిపోయినంత మాత్రాన కలగదని, పెట్టుబడిదారీ విధానాలని తొలగించడంవల్ల, వలస రాజ్యాలకు విముక్తి లభించటం వలన మాత్రమే సాధ్యమవుతుందని రాయ్ భావించాడు. ఈ భావాలను అన్నింటినీ వ్యక్తీకరిస్తూ రాయ్ "స్థిరమైన శాంతికి రాజమార్గం" అనే కరపత్రాన్ని రాసాడు. ఈ కరపత్రాన్ని అమెరికాలో ఉండగానే రాశాడు. కాని, అక్కడ ప్రచురించడం వీలుకాక మెక్సికోకు వచ్చిన తరువాత, దానిని స్పానిష్ భాషలోనికి అనువదించి ప్రచురించాడు. ఆ కరపత్రంలోని భావాలు మెక్సికో అధ్యక్షుడికి ఎంతగానో నచ్చాయి. దీని ఫలితంగ రాయ్‌కి మెక్సికో అధ్యక్షుడితో ఉన్న సాన్నిహిత్యం మరింత పెరిగింది.

ఎం.ఎన్.రాయ్ తాను రాసిన పుస్తకాలలోని విషయాలను మరింత విస్తృతంగా వివరిస్తూ మెక్సికో విశ్వవిద్యాలయంలో వరుస ప్రసంగాలు ఇచ్చాడు. అమెరికా చరిత్రను, అమెరికా స్వాతంత్ర్య యుద్ధాన్ని చాలా లోతుగా పరిశీలించి, ఉపన్యాస పరంపరను ఇచ్చిన రాయ్‌ని అక్కడి మేధావివర్గం ఎంతగానో అభినందించింది. రాయ్ తన ప్రసంగాలలో చెప్పినట్టుగా-దేశంలోని సోషలిస్టు గ్రూపులన్నింటిని ఒక్కటిగా చేసి, ఒక శక్తివంతమయిన శ్రామిక పార్టీని స్థాపించాలనే రాయ్ ఆలోచన అందరికీ నచ్చింది. అందరూ-"నిద్రావస్థలో ఉన్న మా దేశ ప్రజలను మేల్కొల్పడానికి వచ్చిన గొప్ప మేధావి మీరు". అంటూ అతడిని వారు కీర్తించసాగారు. దేశాధ్యక్షుడు కరంజా కొంతవరకు పెట్టుబడిదారీ ప్రవృత్తి ఉన్నవాడే గాని, రాయ్‌లాంటి వాడు తమ దేశానికి అవసరం అని భావించి, అతడు తలపెట్టిన కార్యక్రమాలకు చేయూతనిస్తూ ఉండేవాడు.

ఆనాటికి అమెరికా మెక్సికోల మధ్య సంబంధాలు చాలావరకు తెగిపోయాయి. రాయ్ ప్రతిపాదించినట్టుగా - అమెరికాకు వ్యతిరేకంగా లాటిన్, అమెరికన్ సమితిని ఏర్పరచే విషయంలో అతడికి కరంజా మద్దతు ఇచ్చాడు.

ఇట్లాంటి పరిస్థితుల్లో - 'మైకేల్ బరోడిన్' (1884-1951) మెక్సికోకు వచ్చాడు. మెక్సికోలో రాయ్‌కి లభించిన మిత్రులలో బరోడిన్ ముఖ్యుడు. రాయ్ వలెనే మైకేల్ బరోడిన్

(Michail Borodin) కూడా గొప్ప సాహసి. కమ్యూనిస్టు విప్లవ నేత లెనిన్‌కు అంతరంగికుడు. ఆ తరువాత కాలంలో రాయ్ జీవితం ఒక మలుపు తిరగడానికి ఇతడు కూడా కారకుడు.

యూదు వంశంలో జన్మించిన మైకేల్ బరోడిన్ 1903 లో రష్యాలోని 'బోల్షివిక్' పార్టీలో చేరి, విప్లవ కార్యక్రమాలు చేశాడు. ఆనాడు రష్యా జార్ చక్రవర్తి పాలనలో ఉంది కాబట్టి వీరు రహస్య స్థావరాల నుండి విప్లవ కార్యక్రమాలు చేయవలసి వచ్చేది. పోలీసుల అణచివేత చాలా అధికంగా ఉండేది. అందుచేత పోలీసుల బారినుండి తప్పించుకోవడానికి బరోడిన్ ప్రవాసిగా అమెరికా చేరాడు. తాను ఆస్ట్రియా జాతీయుడనని, తన పేరు 'గ్రూజిన్ బర్గ్' అని చెప్పుకున్నాడు. ఈ పేరుతోనే అమెరికాలో న్యాయశాస్త్రాన్ని, తత్వశాస్త్రాన్ని అభ్యసించాడు. 1917లో బోల్షివిక్ విప్లవం విజయవంతం అయిన తరువాతే – రష్యాకు తిరిగి వెళ్ళాడు. ఆ తరువాత విప్లవాధినేత లెనిన్ ఆదేశంపై 'కమింటరన్' (కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్) ఏజెంటుగా కొన్నాళ్ళు అమెరికాలో ఉండి, విప్లవ భావాలు ప్రచారం చేశాడు. (ప్రపంచ దేశాలన్నింటిలోను కమ్యూనిస్టు సిద్ధాంతాలు ప్రచారం చేయాలనేది 'కమింటరన్' లక్ష్యాలలో ఒకటి). అయితే ఇతడి రహస్య కార్యకలాపాలను అమెరికా పోలీసులు కనిపెట్టడంతో వారికి దొరకకుండా అమెరికా నుండి పారిపోయి మెక్సికోకు చేరుకున్నాడు. అక్కడికి వెళ్ళడానికి ముందే అతడు మెక్సికోలో సోషలిస్టు పార్టీ ఒకటి ఉన్నదని, దానికి రాయ్ అనే ఒక హిందువు ప్రధాన కార్యదర్శిగా ఉన్నాడని తెలుసుకున్నాడు. అంతేకాదు – అతనిని కలవడం ప్రయోజనకరమని కూడా భావించాడు.

బరోడిన్ మెక్సికోకు వెళ్ళేసరికి చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. ఇలాంటి స్థితిలో రాయ్ అతడిని ఆదుకోవడం మాత్రమేకాక, తన ఇంటిలో ఆశ్రయం కూడా ఇచ్చాడు. అంతేకాదు – అక్కడి సోషలిస్టు మిత్రులందరినీ బరోడిన్‌కు పరిచయం చేసాడు. ఇలా మొత్తంమీద రాయ్‌కి, బరోడిన్‌కి మధ్య మంచి మైత్రి కుదిరింది. బరోడిన్ ప్రభావంతో అంతకుముందు రాయ్‌లో మిగిలిఉన్న కొద్దిపాటి ఆధ్యాత్మిక ధోరణి తొలగిపోయి, భౌతికవాద దృక్పథం పట్ల మొగ్గు వచ్చింది. ఒకప్పుడు రాయ్ "నేను సోషలిజంను అంగీకరిస్తాను కాని భౌతికవాద దృక్పథాన్ని అంగీకరించలేను" అని రాసుకున్నాడు. కానీ–బరోడిన్ సహచర్యంలో ఆ మినహాయింపు తొలగిపోయింది. పూర్తిగా మార్క్సిస్టు అయిపోయాడు. ఈ విషయాన్ని తన "జ్ఞాపకాలు"లో రాస్తూ రాయ్ – "బరోడిన్ నాకు మార్క్సిజంను అవగాహన చేసుకోవడానికి తాళంచెవి లాంటి హెగెల్ గతితార్కికవాదంలోని మెళకువలు తెలియజేశాడు. దీంతో భారతదేశం మాత్రమే ఉన్నతమైంది అనే భావన నానుండి తొలగిపోయింది. అతడి ద్వారా యూరపు దేశాల సంస్కృతిని అవగాహన చేసుకోగలిగాను." అని రాసుకున్నాడు.

మెక్సికో అధ్యక్షుడు కరంజా ఎం.ఎన్.రాయ్‌ని తమ దేశ వ్యవహారాలు నిర్వహించటంలో సలహా ఇవ్వమని కోరితే – రాయ్ సందేహించకుండా ఇలా చెప్పాడు. – (1) మెక్సికో అంతరంగిక

వ్యవహారాలలో అమెరికా జోక్యాన్ని ఎంతమాత్రం అంగీకరించకూడదు. (2) మెక్సికో స్వయం సత్తాక జోక్యాన్ని ఎంతమాత్రం అంగీకరించకూడదు; (3) మెక్సికోలో ఉన్న విదేశీ కంపెనీలు శ్రామిక చట్టాలను పాటించకపోతే కార్మికులు సమ్మెచేయడానికి అవకాశం ఉండాలి – ప్రభుత్వం శ్రామికుల కోరికలను అంగికరించాలి.

రాయ్ ఇచ్చిన ఈ 3 సలహాలను అమలు చేయడానికి కరంజా అంగీకరించాడు. ఈ సలహాలు చెప్పడంతో పాటు రాయ్ కరంజాకు మరో సలహాకూడా ఇచ్చాడు. మెక్సికోలో సోషలిస్టు మహాసభ జరపాలి అని అన్నాడు. ఇందుకు కూడా కరంజా అంగీకరించాడు.

1918 డిసెంబర్‌లో మెక్సికోలో ప్రథమ సోషలిస్టు మహాసభ జరిగింది. మెక్సికోలోని పలురాష్ట్రాల నుండి మాత్రమే కాకుండా – దక్షిణమధ్య అమెరికా దేశాల నుండి కూడా సోషలిస్టు నాయకులు, జర్నలిస్టులు, ఉపాధ్యాయులు, రచయితలు, వ్యవసాయవర్గాల వారు, పారిశ్రామిక వర్గాలవారు, శ్రామికులు, మధ్యతరగతివారు ఇలా అందరూ హాజరయ్యారు. ఈ విధంగా మెక్సికోలో సోషలిస్టు మహాసభ జరగడం అదే మొదలు.

ఇట్లాంటి మహాసభ జరగడానికి ముఖ్యకారకుడయిన ఎం.ఎన్.రాయ్‌ని విదేశీయుడని కూడా చూడకుండా అతడిని సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. దీనితో మెక్సికోలోని అన్ని రాష్ట్రాలలో సోషలిస్టు పార్టీ బలపడింది. అంతేకాదు – ప్రభుత్వం తమ మంత్రివర్గంలో కార్మికుల హక్కులను కాపాడటం కోసం ఒక ప్రత్యేక మంత్రిత్వ శాఖను కూడా ఏర్పాటు చేసింది. ఈ సభ దేశంలో ఉన్న వేలాదిమంది ప్రజల ఆకలి దారిద్ర్యాలను గూర్చి చర్చించి, ఈ సమస్యను రూపుమాపేందుకు ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలను కూడా సూచించింది. ఈ సూచనలను కూడా ప్రభుత్వం ఆమోదించింది.

బరోడిన్ ప్రభావంతో రాయ్ కొన్నాళ్ళ తరువాత మెక్సికన్ సోషలిస్టు పార్టీ పేరును "మెక్సికన్ కమ్యూనిస్టు పార్టీ"గా మార్చాడు. ఇందుకు గాను రాయ్ సోషలిస్టు పార్టీలోని ముఖ్య సభ్యులందరినీ సమావేశపరచి వారందరినీ ఈ విషయమై ఒప్పించాడు. అంతేకాదు – రష్యాలోని 'కమింటరన్' (కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్) ప్రపంచ మహాసభ ఆమోదించిన కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికను మెక్సికో కమ్యూనిస్టు పార్టీ కూడా ఆమోదించాలని తెలిపాడు. మొత్తానికి ప్రపంచం మొత్తంమీద రాయ్ కృషితో రష్యా అవతల మొదటి కమ్యూనిస్టు పార్టీ 1919 అక్టోబర్‌లో ఏర్పడింది. 1917 అక్టోబర్‌లో రష్యాలో కమ్యూనిస్టు విప్లవం జరిగితే అది జరిగిన రెండేళ్ళకే మెక్సికోలో కమ్యూనిస్టుపార్టీ అవతరించింది. ఇది రాయ్‌వలన జరిగిన ఘనకార్యం.

ఇలా జరిగిన తరువాత, రాయ్‌కు అంతర్జాతీయ ప్రఖ్యాతి లభించింది. రష్యా అధినేత లెనిన్ కూడా ఈ సంగతి తెలిసి, చాలా సంతోషించాడు.

ఈ సంగతలా ఉంచి–రాయ్ జీవితకారులు ఈ విషయమై పలు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. మెక్సికన్ సోసలిస్టు పార్టీ పేరును కమ్యూనిస్టు పార్టీగా ఎందుకు మార్చాలి? దానిని 'కమింటరన్'కు ఎందుకు అనుబంధం చేయాలి ? ఇందులో రాయ్ బాధ్యత ఎంత ఉంది? బరోడిన్ బాధ్యత ఎంత ఉంది? లెవిన్ దగ్గర మెప్పు పొందడం కోసమే బరోడిన్ ఇలా చేశాడా? అనేవి వారి సందేహాలు.

ఈ సందేహాలను నివృత్తి చేసేముందు కొన్ని విషయాలను వివరించవలసి ఉంది. ఈ కార్యక్రమాలన్నింటిని రాయ్ మెక్సికో అధినేత కరంజా అనుమతి తీసుకోకుండా చేయలేదు.

సోషలిస్టు పార్టీ పేరును కమ్యూనిస్టు పార్టీగా మారిస్తే మెక్సికోకు రష్యా చేసే ఆర్థిక, సైనిక సహకారం లభిస్తుందని అంతకుముందే బరోడిన్, కరంజాకు చెప్పి ఉన్నాడు. అందుచేత సోషలిస్టు పార్టీ పేరును కమ్యూనిస్టు పార్టీగా మారుస్తానంటే అతడు రాయ్‌కి తన సంపూర్ణమైన మద్దతును ఇచ్చాడు. నిజానికి, మొదటిలో రాయ్‌కి ఇలా పేరు మార్చడం ఇష్టం లేదు. ఈ విషయాన్ని తన 'జ్ఞాపకాలు'లో రాస్తూ రాయ్ "వాస్తవానికి సోషలిస్టు పార్టీ లక్ష్యాలు, కమ్యూనిస్టు పార్టీ లక్ష్యాలు సుమారు ఒకలాంటివే. రష్యాలో కమ్యూనిస్టు పార్టీ అవలంభిస్తున్న విషయాల న్నింటిని సోషలిస్టు పార్టీ కోరుకుంటున్నది." అని రాసుకోవడం ఇందుకు తార్కాణం.

అయితే జి.పి.భట్టాచార్జీ "ఎం.ఎన్.రాయ్ రాజకీయ పరిణామం" అనే గ్రంథంలో లెనిన్ దగ్గర మెప్పుకోసమే మెక్సికన్ సోషలిస్టు పార్టీ పేరును కమ్యూనిస్టు పార్టీగా మార్చాలని బరోడిన్ రాయ్‌కి నూరిపోశాడు. అంతేకాదు – రాయ్‌ని రష్యాకు తీసుకుపోయి అక్కడి కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలలో చురుకైన పాత్ర వహించేలా చేయాలనే కోరిక కూడా బరోడిన్ మనస్సులో ఉన్నది. ఇదే కాకుండా – మాస్కోలో జరగబోయే మూడవ అంతర్జాతీయ కాంగ్రెసులో భారత దేశ ప్రతినిధిగా రాయ్‌ని తీసుకువెళ్ళాలనే ఉద్దేశం కూడా బరోడిన్‌కు ఉన్నది" అంటాడతడు. మెక్సికోలో రాయ్ చేస్తున్న ఘనకార్యాలను లెనిన్‌కు చెప్పి, అతనిని లెనిన్ చేత రష్యాకు ఆహ్వానించాలనే కోరిక కూడా బరోడిన్‌కు ఉన్నది. అయితే ఇవేమీ రాయ్‌కి తెలియవు.

ఇదే విషయాన్ని గురించి కోగంటి రాధాకృష్ణమూర్తి "ఎం.ఎన్.రాయ్ దర్శనం" అనే పుస్తకంలో ఒక వ్యాసాన్ని రాస్తూ – "లెనిన్ ఆహ్వానం రాయ్‌కి విభ్రాంతిని కలిగించింది. మెక్సికోలో తాను చేయాల్సిన కార్యక్రమాలేవీ ఇంకా పూర్తికాలేదు. అందుచేత మరికొంత కాలం ఇక్కడ ఉండక తప్పదు అనుకుంటూ లెనిన్ ఆహ్వానాన్ని రాయ్ అంగీకరించలేదు. కాని, – బరోడిన్ తన పట్టు విడువలేదు. అనేక విధాలా నచ్చజెప్పడానికి ప్రయత్నించాడు. చివరకు "బోల్షివిక్ క్రమశిక్షణ" అని అన్నాడు. ఆ మాట రాయ్ వ్యక్తిత్వాన్ని దెబ్బతీసింది. దాంతో అతడు మరింతగా బిగుసుకుపోయాడు. బరోడిన్ తన తప్పు తెలుసుకొని – భారతదేశానికి

రష్యా సమీపంలో ఉంది - రష్యా అండదండలు ఉంటే, భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించ వచ్చు అని అన్నాడు. దీంతో - అయిష్టంగానే రాయ్ బరోడిన్ ప్రతిపాదనను అంగీకరించాడు". అని రాసారాయన.

దీనిని బట్టి లెనిన్ ఆహ్వానాన్ని రాయ్ అందుకొనడం మాతృదేశంపట్ల అతడికిగల ప్రేమవల్ల మాత్రమే జరిగింది కాని, - ఇందులో ఎలాంటి అవకాశవాదము లేదని స్పష్టం అవుతుంది.

సరే-ఎలాగైతేనేం, 1919 నవంబరులో ఎం.ఎన్.రాయ్ అతడి సతీమణి ఎవిలిన్ రాయ్, మెక్సికో దేశాన్ని విడిచిపెట్టారు. వెళ్లేముందు రాయ్‌కి అక్కడి సోషలిస్టు మిత్రులు వీడ్కోలు చెప్పారు. మెక్సికో అధ్యక్షుడు కరంజా కూడా రాయ్‌కి ఆత్మీయంగా వీడ్కోలు తెలిపాడు. రష్యా వెళ్లడానికి పాస్‌పోర్ట్ ఉండాలి కాబట్టి కరంజా రాయ్‌కి మెక్సికో రాయబార కార్యాలయానికి చెందినవాడుగా డిప్లొమేటిక్ పాస్‌పోర్టు' ఏర్పాటు చేసాడు. ఇప్పుడు అతని పేరు 'రాబర్ట్స్ ఎలినో విల్లా సరేరా' (Roberts Alleno Villa Sarera)

అవి యుద్ధం జరిగే రోజులు కాబట్టి ఒక దేశం నుండి మరొక దేశానికి వెళ్లడం అంత సులభసాధ్యమయిన విషయం కాదు. అందుచేత రెండవ 'కమిటరన్' (కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్) వచ్చే ప్రతినిధులందరూ - ముందు, జర్మనీలోని బెర్లిన్ నగరానికి చేరుకోవలసి ఉంది. అక్కడి నుండి వారిని మాస్కోకు తీసుకువెళ్ళడానికి ఏర్పాట్లు చేస్తారు.

అందుచేత-వెళ్ళేముందు రాయ్ కరంజాను కలుసుకోవడానికి వెడితే, అతడు రాయ్ బెర్లిన్‌లో దిగ్గానే అక్కడ ఉన్న మెక్సికో రాయబారిని కలిసి అతడి సహాయం తీసుకో మన్నాడు. ఆ తరువాత రాయ్‌కి సాదరంగా వీడ్కోలు పలుకుతూ, - వృద్ధుడైన కరంజా రాయ్ తలమీద చేయివేసి "నువ్వు ఇంకా చిన్నవాడివి. విధితో జూదం ఆడవద్దు" అని అన్నాడు. మెక్సికోను వదిలేనాటికి అతడి వయస్సు 32 ఏళ్ళు మాత్రమే ! - రాయ్‌కి మెక్సికోతో విడదీయరాని అనుబంధం ఉంది. ఈ విషయాన్ని తన "జ్ఞాపకాలు"లో రాసుకుంటూ రాయ్ ఇలా అన్నాడు-

"మెక్సికోను విడిచిపెట్టే రోజు దగ్గర పడుతున్న కొద్దీ ఏదో కోల్పోతున్న బాధ నా హృదయంలో అధికం కాసాగింది. నా చిన్నతనం నుండీ ఉన్న భారతదేశంపై ఉన్న అనుభూతి మెక్సికో పైన కూడా ఉంది - మెక్సికో నాపట్ల గొప్ప ఆదరాన్ని చూపించింది. నేను చేసిన కొద్దిపాటి సేవకు మెక్సికో ప్రభుత్వం నాపట్ల గొప్ప ఆదరాన్ని చూపించింది. అక్కడ ఉన్న ఎంతోమంది మేధావులు, ప్రముఖులు, నన్నెంతో ఆప్యాయంగా చూసారు. మొత్తంమీద అదొక అద్భుతమైన అనుభవం. ఎంతైనా కృతజ్ఞతలు చెప్పవలసిన అనుభవం, మెక్సికో దేశం నాకు పునర్జన్మను ఇచ్చింది. ఇక్కడకు వచ్చేముందు నా జీవితంపై తీవ్రమైన అసంతృప్తి ఉండేది. కాని ఇక్కడకు వచ్చిన తరువాత, ఆ అసంతృప్తి మాయం అయిపోయింది. స్పష్టమైన కొత్త దృష్టిని

పొందగలిగాను. భవిష్యత్తు మరింత ఆశాజనకంగా ఉండేటట్టు అనిపించింది. జీవితంపట్ల ఒక కొత్త దృక్పథాన్ని అలవర్చుకోగలిగాను. నా మస్తిష్కంలో ఒక కొత్త విప్లవం జరుగుతున్నది. అది తాత్విక విప్లవం. దానికి అంతులేదు. అంతకుముందు - జన్మనిచ్చిన దేశంపై మాత్రమే ఉన్న మానసిక అనుబంధం విస్తృతమైపోయింది. ఇది ఒక మౌలికమైన మార్పు. నాకు పునర్జన్మను ఇచ్చిన మెక్సికో దేశాన్ని, ఒక స్వేచ్ఛా మానవుడిగా విడిచి పెడుతున్నాను. పేదరికం విముక్తి, సామాజిక న్యాయం లేనిదే రాజకీయ స్వేచ్ఛవలన ప్రయోజనం లేదని తెలిసింది. సామాజిక దాస్య విమోచనం సాకారం కావాలంటే - సంప్రదాయ బంధాల నుండి అధికార బానిసత్వం నుండి విముక్తి పొందాలని తెలిసి వచ్చింది" - అని అనడం చదివితే మెక్సికో జీవితం అతడిలో ఎంతటి మార్పును తీసుకొని వచ్చిందో అర్థం అవుతుంది.

మెక్సికో జీవితంలో రాయ్ వ్యక్తిగత విషయాలలో కూడా చాలా మార్పులు వచ్చాయి. సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబం నుంచి వచ్చినవాడు కాబట్టి - అంతకు ముందు అతడు కేవలం శాకాహారం మాత్రమే తినేవాడు. మాంసాహారం ముట్టేవాడు కాదు. యూరోపియన్ల ఆహార విధానం అసలు నచ్చేది కాదు. మద్యం ముట్టేవాడు కాదు. భార్య అమెరికాకు చెందిన వ్యక్తి అయినా, ఆమె అలవాట్లు ఆమెవే గాని దాని ప్రభావం ఇతడిపై ఉండేది కాదు. కాని, - మెక్సికోకు వచ్చాక మిత్రులిచ్చే పార్టీలకు వెళ్ళాల్సి వచ్చినపుడు ఈ నిబంధనలలో క్రమక్రమంగా మార్పులు వచ్చాయి.

ఎవిలిన్‌కు కళలన్నా, కళాకారులన్నా చాలా ఇష్టం - రాయ్‌కి సామాజిక రంగానికి, రాజకీయ రంగానికి చెందిన మేధావులతోనే తప్ప - ఇట్లాంటి వారితో అంతగా పరిచయం ఉండేది కాదు. ఎవలిన్ ప్రభావంతో రాయ్ కళాకారులతో కూడా సాన్నిహిత్యాన్ని పెంచుకున్నాడు.

ఈ విషయాలన్నింటి చర్చ ఎలా ఉన్నా, రష్యాను చేరుకోవడంకోసం రాయ్ మెక్సికోను వదలడంతో - అతడి జీవితంలో మూడవ అధ్యాయం ప్రారంభం అయ్యింది.



## 6
## మాస్కో రోజులు - మరికొన్ని విశేషాలు

**1919** నవంబర్‌లో డిప్లొమేటిక్ వీసా తీసుకుని రాయ్ దంపతులు మాస్కోకు బయలు దేరారని ఇది వరకే చెప్పుకున్నాం. రాయ్ ప్రయాణం స్పెయిన్ దేశానికి చెందిన ఓడ మీద ప్రారంభం అయ్యింది. ఓడ బ్రిటన్, అమెరికా దేశాల రేవులను తాకకుండా ప్రయాణం చేయాలని రాయ్ ఉద్దేశం. ఎందుకంటే – ఆ రెండు దేశాలకు చెందిన పోలీసులు అతడిని అరెస్టు చేయడం కోసం అతడి ఆచూకీ కోసం గాలిస్తున్నారు. అరెస్టు కాకుండా ఉండటం కోసం రాయ్ ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా, ప్రయాణంలో ఒక ఇబ్బంది ఎదురయ్యింది. ఓడ 'హవానా' రేవులో ఆగింది. హవానా అమెరికా రక్షణలో ఉంది. అక్కడి డాక్‌వర్కర్లు సమ్మెలో ఉన్నారు. అందుచేత ఓడ త్వరగా కదిలే అవకాశం లేదు. ఆలస్యం అయితే – అమెరికన్ పోలీసులు ఓడలోనికి వచ్చి తనను అరెస్టు చేసే అవకాశం ఉంది. అందుచేత – రాయ్ అక్కడ ఉన్న సోషలిస్టు మిత్రుడికి సమస్యను తెలిపి, ఓడ వెంటనే బయలుదేరే ఏర్పాటు చేయగలిగితే చేయమన్నాడు. అతడు పూనుకోవడంతో సమస్య తీరిపోయింది. మొత్తంమీద గండం గడిచింది, ఓడ కదిలింది. రాయ్ దంపతులు స్పెయిన్ చేరారు. స్పెయిన్ నుండి బెర్లిన్‌కు చేరవలసి ఉంది. 1919 డిసెంబర్ నెలాఖరుకు రాయ్ దంపతులు బెర్లిన్ చేరుకున్నారు.

అయితే మాస్కోకు వెళ్లడానికి పరిస్థితులు అనుకూలంగా లేనందువల్ల రాయ్ దంపతులు బెర్లిన్‌లోనే నాలుగు నెలలు ఉండవలసి వచ్చింది.

బెర్లిన్ విదేశాలలోని భారతీయ విప్లవకారులకు ఒక ముఖ్య కేంద్రం. అక్కడి విప్లవ కారులను 'బెర్లిన్ కమిటీ' అనేవారు. ఒకప్పుడు ఎం.ఎన్.రాయ్ భారతదేశంలో ఉగ్రజాతీయవాదిగా ఉన్నప్పుడు జర్మన్ ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని, ఆయుధ సహాయాన్ని కోరుతూ బెర్లిన్ వచ్చినపుడు బెర్లిన్ కమిటీ సభ్యులను కలిసాడు. కానీ, అనుకున్నట్లుగా ఆ పని అప్పట్లో జరగలేదు. బెర్లిన్‌కమిటీ వారుకూడా పెద్దగా సహకరించలేదు. ఇదిలాఉండగా, బెర్లిన్ కమిటీ సభ్యుల మధ్య కూడా ఐక్యత లేదు. ఒకరంటే ఒకరికి పడేది కాదు.

సరే – ప్రస్తుత విషయానికి వస్తే – బెర్లిన్‌లో ఉన్న 'కమంటరన్' సభ్యులు కొందరిని, కమ్యూనిస్టు నాయకులను రాయ్ కలుసుకుని, వారితో స్నేహాన్ని పెంపొందించుకున్నాడు. ఆ రోజుల్లోనే – కమ్యూనిస్టు అవనీనాథ ముఖర్జీని కూడా కలుసుకున్నాడు. అవనీనాథ ముఖర్జీతో కలసి రాయ్ దంపతులు 'భారత కమ్యూనిస్టు ప్రణాళిక'ను వ్రాసారు. ఈ ప్రణాళిక ముఖ్యోద్దేశం – భారత దేశంలో జరుగుతున్న జాతీయోద్యమం కమ్యూనిస్టు ఉద్యమంగా మారాలని, దీనికి కారణం ఏమిటంటే భారత దేశంలో జరుగుతున్న జాతీయోద్యమం బూర్జువా ప్రజాస్వామ్యం కోసం పోరాడుతున్నది. బూర్జువా ప్రజాస్వామ్యం భారతదేశంలో జరుగుతున్న ఆకలి దారిద్ర్యాలతో బాధపడుతున్న అట్టడుగు వర్గ ప్రజల గురించి ఆలోచించటం లేదు. వారిని పోరాటంలో భాగస్వాములను చేయలేక పోతున్నది. అలాంటి స్థితిలో నిజంగా భారత దేశానికి గానీ స్వతంత్రం లభిస్తే, విదేశీ పెట్టుబడుదారుల స్థానంలో, స్వదేశీ పెట్టుబడుదారుల ప్రాభవం పెరుగుతుంది. దీనివలన బీదప్రజలకు ఒరిగేదేమీ లేదు. ఈ ధోరణిమారాలి. ఈ స్థితిలో స్వతంత్ర భారత దేశంలోని ప్రభుత్వంలో రాజకుమారులు, పెట్టుబడిదారులు, వ్యాపారస్థులు, వడ్డీవ్యాపారులు మాత్రమే ఉంటారు. ఎంతప్రతిభ ఉన్నా సాధారణ పౌరులకు ఆ ప్రభుత్వంలో స్థానం ఉండదు. పేదరైతుల, శ్రామికుల, ఆధిపత్యంలో ప్రభుత్వం ఏర్పడాలి. – ఇట్లాంటి భావజాలంతో వారు బెర్లిన్‌లో "భారత కమ్యూనిస్టు ప్రణాళిక"ను విడుదల చేసారు. దీనిమీద ఎం.ఎన్.రాయ్‌తో బాటుగా అవనీనాథ ముఖర్జి, శాంతిదేవి (ఎవిలిన్ మారుపేరు) కూడా సంతకాలు చేసారు.

రాయ్ దంపతులు బెర్లిన్‌లో ఉన్న రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ వారి రహస్య సమావే శంలో కూడా పాల్గొన్నాడు. ఆ సమావేశం రాత్రి అంతటా జరిగిందట. బెర్లిన్‌లో కార్మికులు సమ్మె నిర్వహించటం గురించి ఈ సమావేశంలో చర్చించటం జరిగింది. కమ్యూనిస్టులు ఆశించి నట్టుగా బెర్లిన్‌లో ఈ సమ్మె విజయవంతంగా జరగటం విశేషం.

ఈ విషయాన్ని రాయ్ తన "జ్ఞాపకాలు"లో రాస్తూ " నాలుగు రోజుల పాటు బెర్లిన్ నగర్ జీవితం అంతా దాదాపుగా స్థంభించిపోయింది. దుకాణాలు మూతబడ్డాయి. ఫ్యాక్టరీలు పనిచేయలేదు. వీధులు నిర్మానుష్యం. రాత్రి వేళల్లో నగరం గాఢాంధకారంగా అయిపోయింది. సమ్మె జరిగే 5వ రోజు పొద్దున హోటల్ ఐదవ అంతస్థు కిటికిలోంచి చూస్తే, శిరస్త్రాణాలు ధరించిన సైనికులు నిశ్శబ్దంగా కవాతు చేయడం కనబడింది. మొరటు అధికారంపై కార్మికుల సంఘటితశక్తి సాధించిన విజయానికి ఇదొక ఉదాహరణ. దీనిని కళ్ళారా చూడగలగడం ఒక అనుభవం –" అంటూ, ఆనాటి తన అనుభూతిని అద్భుతంగా రాస్తాడు రాయ్ తన "జ్ఞాపకాలు"లో.

అంతేకాదు ఆనాటి తన బెర్లిన్ అనుభవాలను జ్ఞాపకం చేసుకుంటూ రాయ్ మరికొన్ని అనుభవాలు కూడా చెప్తాడు – "బెర్లిన్ చేరిన వెంటనే నేను కలిసిన మొదటి కమ్యూనిస్టు తల్‌హీమర్ (Thalheimer) – మొదటిసారి కలుసుకున్న తరవాత మేం తరచూ కలుసుకునే వాళ్ళం. ఒక సందర్భంలో ఆయన నన్ను జర్మనీలో విప్లవాన్ని రగిలించే విషయంపై జరిగే సమావేశానికి ఆహ్వానించారు. ఆ సమావేశంలో పాల్గొనడం వలన నేనెంతో ప్రయోజనాన్ని పొందాను. అక్కడ చర్చలు అన్నీ జర్మన్ భాషలోనే జరిగాయి. అందుచేత తల్‌హీమర్ ఎప్పటి కప్పుడు ఆ చర్చలను ఆంగ్లంలోకి అనువదించి నాకు చెపుతూ ఉండేవాడు. జర్మన్ కమ్యూనిస్టులు పాల్ లెవి (Paul Leri), బ్రాండ్లర్ (Brandler) మొదలయినవారు కూడా నాతో అభిమానం గానే ఉండేవారు"అనిరాసుకోవడం రాయ్‌లో మనుషులను ఆకట్టుకునే గుణమెంత ఉండేదో చెప్పడానికి ఒక ఉదాహరణ.

బెర్లిన్‌లో నాలుగు నెలలు ఉన్న తరువాత, పరిస్థితులు అనుకూలించడంతో రాయ్ దంపతులు మాస్కోకు బయలుదేరి వెళ్ళారు. 1920 ఏప్రిల్‌లో వారు అక్కడికి చేరుకున్నారు. వీరు వెళ్లేనాటికి బరోడిన్ కూడా మాస్కోలోనే ఉన్నాడు – అతడు రాయ్ దంపతులను సాదరంగా ఆహ్వానించాడు.

రాయ్‌కి మాస్కోలోని ఒకపెద్ద బంగళాలో విడిదిని ఏర్పాటు చేసారు. ఆ బంగళా క్రింది భాగంలో విదేశాంగ శాఖ కమిసార్ చిచెరెన్ (Chicheren) నివసిస్తూ ఉండేవాడు. చిచెరెన్ సామాన్యమైన వ్యక్తి కాదు. అతని పేరు చెపితేనే విదేశీ పెట్టుబడిదారులు హడలిపోతారు. రాయ్ ఆ బంగళాలో దిగిన రోజునే బరోడిన్ రాయ్ దంపతులను కమిసార్ చిచెరెన్ దగ్గరకు, వైస్ కమిసార్ కరఖాన్ (Karakhan), దగ్గరకు తీసుకుని వెళ్ళాడు. ఇద్దరూ రాయ్‌ని ఆప్యాయంగా ఆహ్వానించటమేగాక, భారతదేశంతో సహా ఇతర ప్రాచ్య దేశాలలో కమ్యూనిస్టు విప్లవాన్ని వ్యాపింపచేయడానికి గల అవకాశాలను చర్చించారు. ఆనాటికి అక్కడి ప్రభుత్వ వర్గాలలో – కాబూల్‌ని ప్రధాన కేంద్రంగా తీసుకుని ప్రాచ్య దేశాలలో విప్లవం లేవదీయాలనే అభిలాష ఉంది. అంతేకాదు – అది సానుకూలపడితే ఈ కార్యక్రమాన్ని రాయ్‌కి అప్పగిద్దామనే ఆలోచన కూడా వారికి ఉంది. అయితే, – త్వరలోనే పరిస్థితులు మారిపోయాయి. ఆఫ్ఘన్ రాజు అమానుల్లా మొదటిలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ఉండేవాడుగాని, ఆ తరువాత అనుకూలుడుగా మారి పోయాడు. కాబూల్‌లో ఉన్న విప్లవకారులను అక్కడి నుండి వెళ్ళిపొమ్మని కూడా అన్నాడు. అదంతా వేరే కథ.

మాస్కోకు వెళ్ళిన ఎం.ఎన్.రాయ్ 'కమింటరన్'లోని ప్రముఖులైన – లెనిన్, జినోవియేవ్ (Zinoview), ట్రాట్స్కీ (Trotsky) మొదలయినవారిని కలుసుకున్నాడు. రాయ్ మాస్కోకు

వెళ్ళేనాటికి స్టాలిన్ ప్రముఖనాయకుడు కాదు. అదీగాక అప్పటికి అతడు మాస్కోలో కూడా లేడు. ఆ తరువాత మాత్రమే రాయ్ స్టాలిన్‌ను కలుసుకోగలిగాడు.

లెనిన్‌ను చూడడానికి రాయ్ వెళ్ళేటప్పటికి అతడు ఒక కుర్చీలో కూర్చుని ఉన్నాడు. గదిలోపలికి రాయ్ రాగానే లెనిన్ లేచి నించుని అతడిని సాదరంగా ఆహ్వానించాడు ! అంతేకాదు – "నువ్వు ఇంత చిన్న యువకుడివా ? – రాయ్ అంటే తెల్లటి గెడ్డం ఉన్న పెద్ద వయస్సుగల ప్రాచ్య మేధావి అని ఊహించుకున్నాను !" అని బిగ్గరగా నవ్వాడు. లెనిన్ తాను రాసిన "వలస రాజ్యాల్లో జాతీయోద్యమాలు" అనే అంశంపై వ్యాసాన్ని అప్పటికే రాయ్‌కి పంపించి ఉన్నాడు. ఆ వ్యాసం ముసాయిదా ప్రతిపై ఎర్ర సిరాతో "కామ్రేడ్ రాయ్ పరిశీలన కోసం" అని స్వయంగా రాసి, కమ్యూనిస్ట్ ఇంటర్‌నేషనల్ (కమింటరన్) ప్రధాన కార్యదర్శి ద్వారా రాయ్‌కి పంపించాడు. లెనిన్ అంతటి మహానుభావుడు తన అభిప్రాయాన్ని కోరడం రాయ్‌కి ఎనలేని ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆనాటికే లెనిన్‌కు రాయ్ మీద అంతటి ఉన్నత అభిప్రాయం ఉన్నది. కమింటరన్ ప్రధాన కార్యదర్శి బాల్బనోవాకు కూడా ఈ విషయం తెలుసు. అందుకే అతడు రాయ్ భుజం తట్టి, "ఇది నీకు గర్వ కారణం" అన్నాడు ! లెనిన్‌ను రాయ్ తొలిసారి కలిసినపుడు అతడికి వర్ణించలేనంతటి ఆనందానుభూతి కలిగింది. ఈ విషయాన్ని రాయ్ వివరంగా తన "జ్ఞాపకాలు"లో రాసుకున్నాడు. అందులో ఆ సమావేశంలో లెనిన్ మెక్సికోలో కమ్యూనిస్టు పార్టీ స్థాపనలో రాయ్ నిర్వహించిన ప్రధాన పాత్రను ఎంతగానో కొనియాడాడు. వలస రాజ్యాలలో కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు ఇది మార్గదర్శి కాగలదని అన్నాడు. అంతేకాదు "నేను రాసిన వ్యాసం చూసారా" అని అడిగాడు. "ఇంకా చదవలేదు" అని రాయ్ అంటే – "త్వరగా చదివి మీ అభిప్రాయం చెప్పండి" అన్నాడట ! – లెనిన్ అంతటివాడికి మూడు పదుల వయస్సు ఉన్న ఒక భారతీయ యువకునిపై ఉన్న అపారమైన గౌరవం అది. సంభాషణ అయిన తరువాత రాయ్ లేచి వెళ్లితే గుమ్మంవరకు వచ్చి సాగనంపాడట లెనిన్. ఎంతటి సంస్కారం ! –

కొద్ది రోజుల తరువాత మాస్కోలో 'మే' దినోత్సవం (మేడే) జరిగింది. బ్రహ్మాండమైన ఊరేగింపు, ఆ తరువాత మహాసభ. ఆ సభకు వేలాదిమంది జనం వచ్చారు. సుందరంగా అలంకరించిన వేదికమీద లెనిన్‌తో బాటు ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు, నగర అధ్యక్షుడు, అయిన జినోవీవ్ ప్రభృతులు ఆసీనులయ్యారు. రాయ్‌ని కూడా వేదిక మీదకు ఆహ్వానించారు. అంతటితో ఆగకుండా కామ్రేడ్ ఎం.ఎన్.రాయ్ ప్రసంగిస్తాడని ప్రకటించారు. అంతవరకు రాయ్‌కి సభలో ప్రసంగించవలసి ఉంటుందని ఎవరూ చెప్పలేదు. ఈ ప్రకటన విని రాయ్ తబ్బిబ్బు అయ్యాడు. తన భావాలను వ్యాసాల రూపంలో ప్రకటించటం, చిన్న సమావేశాల్లో ప్రసంగించడం మినహాగా, ఇలాంటి పెద్ద బహిరంగసభలో ప్రసంగించడం అంతవరకు రాయ్‌కి

అలవాటు లేదు. అయినా – తప్పదు. అప్పటికి ఇంకా లౌడ్ స్పీకర్లు రాలేదు. అంతమందికి వినిపించేలా ఉపన్యసించాలి. అయినా – చెప్పదలచుకున్న విషయం పట్ల స్పష్టత, చెబుతున్న దాని మీద నమ్మకము ఉన్న వ్యక్తి కావడంచేతనూ–ఆత్మస్థైర్యం ఉన్నవాడు కావడంచేతనూ – అనర్గళంగా ఆంగ్లంలో ఉపన్యసించాడు. చాలా పెద్ద సభ కాబట్టి సభకు వచ్చిన వారిలో అనేక తరహాలవాళ్ళు ఉన్నారు కాబట్టి – సభ కొంచెం గందరగోళంగానే ఉంది. అయినా, తాను చెప్పదలచినదానిని రాయ్ ధైర్యంగా చెప్పాడు. కమ్యూనిస్టు పెద్దలందరూ రాయ్ వాగ్ధాటిని ఎంతగానో మెచ్చుకున్నారు.

ఇలా – రోజులు గడుస్తూ ఉండగా, 'కమింటరన్' రెండవ కాంగ్రెస్ జరిగే రోజు దగ్గర పడింది. మాస్కోలో – 1920వ సంవత్సరం 23 జులై నుండి ఆగష్టు 7 వరకు "కమింటరన్" సమావేశాలు జరిగాయి. 1919లో జరిగిన మొదటి కమింటరన్ సమావేశానికి, దీనికి ఒక ముఖ్యమైన తేడా ఉంది. 1919 నాటి సమావేశంలో – యూరోపియన్ దేశాల ప్రతినిధులెవరూ అంతగా రాలేదు. ఇప్పుడు జరుగుతున్న కాంగ్రెసులో యూరోపియన్ దేశాల ప్రతినిధులందరినీ ఆహ్వానించేందుకు గట్టి ప్రయత్నం జరిగింది. 'కమింటరన్' లక్ష్యం నెరవేరాలంటే ఇది అత్యంత అవశ్యకం. ఇది ఇలా ఉండగా, ప్రాచ్య దేశాలలో ప్రముఖంగా చెప్పదగిన భారతదేశం నుండి వచ్చిన రాయ్ ఈ సమావేశానికి రావడం మరో విశేషం.

రెండవ కాంగ్రెస్ 'లెనిన్‌గ్రాడ్"లో అట్టహాసంగా ప్రారంభం అయ్యింది. అక్కడికి వివిధ దేశాల నుండి వచ్చిన ప్రతినిధులను ప్రత్యేక రైలులో తీసుకుని వెళ్ళారు. ఎం.ఎన్.రాయ్, ఎవిలిన్ రాయ్ మెక్సికో కమ్యూనిస్టు పార్టీ అధికార ప్రతినిధులుగా హాజరు అయ్యారు. భారతదేశ ప్రతినిధులుగా అంబానీ ముఖర్జి, ఎం.పి.బి.టి.ఆచార్య వచ్చారు గానీ – వారికి ఎవరూ అంత ప్రాధాన్యతను ఇవ్వలేదు. ఆ సమావేశంలో భారతదేశంతో సహా వలస రాజ్యాలన్నింటికి ఎం.ఎన్. రాయ్‌నే ప్రతినిధిగా భావించటం జరిగింది. అంతేకాదు – కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో రాయ్‌ని జాతీయ, వలస రాజ్య కమిషన్‌కు ఎన్నుకోవడం జరిగింది. కాంగ్రెస్‌లోని అన్ని కమిషన్‌ల కన్నా ఇది చాలా ప్రాధాన్యతను కలిగిన కమిషన్. ఇదిగాక అనేక ఇతర కమిషన్లకు కూడా రాయ్‌ని ఎన్నుకున్నారు. కమింటరన్‌లో ఆనాడు రాయ్‌కి లభించిన ప్రాధాన్యత ఎంతటిదో దీనినిబట్టి అర్థం అవుతుంది.

సమావేశ ప్రారంభానికి ముందు రాయ్ లెనిన్ పంపించిన వలస రాజ్యాల సిద్ధాంతాన్ని చాలా నిశితంగా పరిశీలించాడు. ఆ సిద్ధాంతం రాయ్‌కి అంతగా నచ్చలేదు. అందులో కొన్ని లోపాలు ఉన్నట్టు అతడు భావించాడు.

మార్క్స్ అభివృద్ధి చెందిన దేశాల్లో శ్రామిక విప్లవం జరుగుతుందని ఆశించాడు. ఎందుకంటే, ఆ దేశాలన్నీ పెట్టుబడిదారీ దేశాలు. కాబట్టి – పెట్టుబడిదారులకు, శ్రామికులకు మధ్య వర్గపోరాటం జరిగేందుకు అవకాశం ఉందని మార్క్స్ భావించాడు. కానీ మార్క్స్ ఊహించినట్లు ఆ దేశాల్లో శ్రామిక విప్లవం రాలేదు. ఎందుకంటే బ్రిటన్ వంటి దేశాలు వలస రాజ్యాలలో పెట్టుబడులు పెట్టి, అధికంగా పొందుతున్న ఆదాయాల్లో కొంత భాగం శ్రామికులకు ఇద్దామనే ఉద్దేశ్యంతో వారికి అధిక వేతనాలు చెల్లిస్తున్నారు. అందువల్ల, ఆ దేశాల్లోని శ్రామికులు 'బూర్జువా వర్గం'గా మారిపోయారు. వర్గ సంఘర్షణ పట్లగాని, శ్రామిక విప్లవంపట్ల గాని ఆసక్తి లేకుండా ఉంటున్నారు.

అందుచేత, వలస రాజ్య విధానానికి వ్యతిరేకం[illegible] ప్రపంచ దేశాలన్నింటిలోను ఐక్య పోరాటానికి కృషి చేయాలి. వలస రాజ్యాలన్ని ఫ్యూడలిజంలో ఉన్నాయి. కనుక వా[illegible] ఐక్య పోరాటానికి సిద్ధంచేయాలి. ఈ కృషిలో 'బూర్జువా వర్గం' ప్రధాన పాత్ర పోషించాలి. వలస దేశాలకు స్వాతంత్ర్యం లభిస్తే ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదపు పునాదులు కదిలి పోతాయి. అందుచేత, విప్లవ పోరాటం యూరోప్ నుండి ఆసియా, ఆఫ్రికా దేశాలకు మారాలి – సంక్షిప్తంగా చెప్పాలంటే ఇదీ వలసరాజ్యాల విషయంలో లెనిన్ అవలంబించదలచిన విధానం. తన సిద్ధాంతంలో లెనిన్ గాంధీజీని విప్లవకారుడుగానే భావించాడు. రష్యా విప్లవంతో సామ్రాజ్య విధానం నశించింది. సోషలిజం స్థాపించడం జరిగింది. ఇదే విషయం భారతదేశంతో సహా వలస రాజ్యాలలో జరుగుతుందని లెనిన్ ఆశ. అందుచేతనే లెనిన్ వలస రాజ్యాలలో జరిగే బూర్జువా ప్రజాస్వామ్య ఉద్యమాలను సమర్థించాడు. "జాతీయ పోరాటం ఎలాంటిదైనా విప్లవ కరమే అని భావించాలి". అనేది లెనిన్ అభిప్రాయం. అప్పటికి, ఆసియా దేశాలలో ఉన్న వలస రాజ్యాల పరిస్థితి గురించి లెనిన్‌కు అంతగా తెలియదు. అందుచేత–యూరప్‌లో అవలంబించదగ్గ విధానమే ఆసియా దేశాలలోకూడా పనికి వస్తుందని లెనిన్ భావించాడు.

కానీ రాయ్‌కి భారతదేశం పరిస్థితి, ఆసియా వలస రాజ్యాల పరిస్థితి – అక్కడ జరుగు తున్న స్వాతంత్ర్యోద్యమాల గురించి క్షుణ్ణంగా తెలుసు. అందుచేతనే రాయ్ లెనిన్ అభిప్రాయాలను అంగీకరించలేకపోయాడు. ఇలా అంగీకరించలేనివారు మరికొందరుకూడా ఉండవచ్చు. కానీ, లెనిన్ వంటి తిరుగులేని మహానాయకుడి అభిప్రాయానికి వ్యతిరేకంగా మాట్లాడగలిగిన శక్తి వారెవరికీ లేదు. తనకు నచ్చని విషయాలను ఒక మహానాయకుడు చెప్పాడుకదా అని గొర్రెమంద మనస్తత్వంతో అంగీకరించి, అనుసరించడం రాయ్ మనస్తత్వం కాదు. అందుచేత కమింటరన్‌లో తన అభిప్రాయాలను తెలియజేసాడు. నిజానికి రాయ్ లెనిన్‌తో మాట్లాడేటప్పుడు తన అభిప్రాయాలను చెపితే – అతడే రాయ్‌ని ఈ విషయాలను కమింటరన్ సమావేశంలో చెప్పమని ప్రోత్సహించాడంటే లెనిన్ వ్యక్తిత్వం ఎంతటిదో తెలుస్తుంది.

"రెండు సిద్ధాంతాలను సభలో చర్చిద్దాం. లోతుగా చర్చ జరిగిన తరువాత, ఏం చేయాలో ఆలోచిద్దాం" అన్నాడట లెనిన్ !

ఈ విషయాన్ని తన "జ్ఞాపకాలు"లో చెపుతూ రాయ్ ఇలా అన్నాడు –

"ఒక మహోన్నత వ్యక్తితో సమానంగా చూడబడే అరుదైన అవకాశం నాకు లభించింది."

ఇంతకూ తన సిద్ధాంతంలో రాయ్ చెప్పేదేమిటంటే – (దీనిని అనుబంధ సిద్ధాంతం Supplementary Thesis అని అంటారు) లెనిన్ భావించినట్టుగా ఆసియాలోని వలస రాజ్యాలలో జరుగుతున్న జాతీయోద్యమానికి రష్యా మద్దతును ఇచ్చి సామ్రాజ్యవాదులను తరిమికొడితే, దాని తర్వాతి దశగా శ్రామిక విప్లవం ఆవిష్కరించబడదు. రష్యా ప్రభుత్వం బూర్జువా జాతీయవాదులకు సహాయం చేస్తే, భారతదేశం వంటి దేశాలలో కమ్యూనిస్టు రాజ్యం స్థాపించ బడదు. ఇది దానంతట అదే జరిగే ప్రక్రియ కాదు. భారతదేశానికి వలస రాజ్యపాలన నుండి విముక్తి లభిస్తే, అక్కడ పెట్టుబడిదారుల రాజ్యం స్థాపించబడుతుంది. వలస విముక్తితో సాధించబడేది శ్రామిక రాజ్యంకాదు. విప్లవ వ్యతిరేకతకు తోడ్పడే పెట్టుబడి దారీ ప్రభుత్వం మాత్రమే ! ఆ తరువాత ప్రజా ఉద్యమాన్ని సంఘటితపర్చడానికి ప్రయత్నించినా ప్రయోజనం ఉండదు. బూర్జువా వర్గాలకు మత సంస్కృతికి చెందిన వర్గం, పెట్టుబడిదారులు, మద్దతుగా ఉంటారు. అందువలన శ్రామిక రాజ్యం స్థాపించబడటం చాలా కష్టం అవుతుంది.

కాబట్టి కమింటరన్ జాతీయోద్యమకారులకు కాకుండా కర్షకుల, కార్మికుల ఉద్య మాలకు నేరుగా సహాయం చేయాలి. తాత్కాలిక ప్రాతిపదికతోనైనా బూర్జువా ప్రజాస్వామ్య వర్గాలతో కమింటరన్ పొత్తు పెట్టుకోకూడదు. ఆ దేశాలలో శ్రామిక ఉద్యమం బలపడేందుకు ఎంత సహాయం చేయగలిగితే అంత సహాయం చేయాలి అనేది రాయ్ దృక్పథం.

బూర్జువా జాతీయవాదులుకోరుకునేది రాజకీయ విప్లవం. రాయ్ కోరుకునేది ఆర్థిక విప్లవం. ఇదంతా విన్న లెనిన్ – చిరకాలంగా కమ్యూనిస్టు అయిన తనకంటే – కొత్తగా కమ్యూనిస్టుగా మారిన రాయ్‌లో శ్రామిక విప్లవంపట్ల గట్టిపట్టుదల ఉన్నట్లు గ్రహించాడు.

సంక్షిప్తంగా లెనిన్, రాయ్‌లకు వలస రాజ్యాల విషయంలో ఉన్న తేడాలను గురించి చెప్పాలంటే –

లెనిన్ అభిప్రాయ ప్రకారం వలసదేశాలలో విప్లవం రెండు దశలలో రావాలి. మొదటి దశలో వచ్చేది బూర్జువా ప్రజాస్వామిక జాతీయవాద విప్లవం. రెండవ దశ శ్రామిక విప్లవం. మొదటి దశ నుండి రెండవ దశ వస్తుందని లెనిన్ అభిప్రాయం.

కానీ రాయ్ వాదం ఏమిటంటే – వలస రాజ్యాలలో ఇలా రెండు దశలుగా శ్రామిక విప్లవం రావడం కాకుండా – నేరుగా శ్రామిక విప్లవం రావాలి. ఒక్క మాటలో చెప్పాలంటే

"విప్లవం అనేది పై నుండి క్రిందకు రావాలా ? - లేక క్రిందనుండి పైకి రావాలా ? -" అనే ఆలోచనలోనే వీరిద్దరికీ తేడా ఉంది.

రాయ్ అభిప్రాయం ప్రకారం యూరప్‌లో ఉన్న పెట్టుబడిదారీ విధానానికి బలం వలస రాజ్యాల నుండే వచ్చింది. వలస రాజ్యాలలో అవి సాధించిన లాభాలతో యూరప్‌లో ఉన్న శ్రామికుల జీతాలను పెంచటం జరిగింది. పెరిగిన ఆదాయాల వల్ల సంతృప్తి చెందిన యూరప్‌లోని శ్రామికులు విప్లవ చైతన్యం పట్ల ఆసక్తిని కోల్పోయారు. అందుచేత - యూరప్‌లో శ్రామిక విప్లవాన్ని తీసుకురావాలంటే, ఆసియా దేశాలను వలస రాజ్య విధానం నుండి విముక్తి చేయాలి. అయితే ఇది బూర్జువా జాతీయ నాయకులవల్ల కాకుండా - కర్షకులు, శ్రామికుల వలన జరగాలి. ఈ విధంగా నాయకత్వ మార్పులు జరిగేందుకు కమింటరన్ తోడ్పడాలి. అయితే - బూర్జువా జాతీయవాదులు వలస రాజ్య విధానాన్ని తొలగించేందుకు వారి విధానాలతో వారు పోరాడవచ్చును. ఇందుకు కమింటరన్ సహాయం ఉండదు గానీ ఆ దేశాలలోని కర్షకుల, శ్రామికుల సహకారముంటుంది. కానీ నాయకత్వం అనేది మాత్రం బూర్జువాల చేతిలో కాకుండా కర్షకుల, కార్మికుల చేతుల్లోనే ఉండాలి. అప్పుడే కమ్యూనిజం స్థాపించబడడానికి అవకాశం ఉంటుంది.

రాయ్ ఉద్దేశంలో విప్లవం ప్రధాన లక్ష్యం కమ్యూనిజంను స్థాపించటం. ఇది జరగా లంటే దానికి తగిన నేపథ్యం భారతదేశం వంటి దేశాలలో ఏర్పడాలి. భారీ ఎత్తున శ్రామికు లను సమీకరించటంవలననే ఇది సాధ్యం అవుతుంది. భారతదేశంలో అధిక సంఖ్యాకులయిన శ్రామికులు వ్యవసాయ కూలీలు. వలస రాజ్య పాలనలో వ్యవసాయ భూమి ఉన్న రైతులు కూడా వ్యవసాయ కూలీలుగా మారిపోయారు. అందుచేత భారతదేశం వంటి దేశాలలో "దున్నేవానిదే భూమి" అనే నినాదం ప్రతిధ్వనించాలి. బూర్జువాల నాయకత్వంలో ఇది జరిగే పని కాదు.

ఇది జరగాలంటే, రైతుకూలీ విప్లవం జరగడానికి కావలసిన సామాజిక శక్తులను ముందుగా కూడగట్టాలి. ఆ తరువాతే ఆర్థిక సహాయం చేయటం, ఆయుధాలను అందివ్వటం, మొదలైనవి. గుర్రం అనేది బండికి ముందు ఉండాలి గానీ, బండికి వెనుక ఉండకూడదు. సంక్షిప్తంగా చెప్పాలంటే ఇదీ రాయ్ దృక్పథం.

కాంగ్రెస్ సమావేశం ఈ రెండు సిద్ధాంతాలను లోతుగా చర్చించింది. ఈ రెండు సిద్ధాంతాలలోఉన్న ప్రాథమిక అంశం ఒకటే. అయితే-విషయ ప్రాధాన్యతలలో తేడా ఉంది. అందుచేత కాంగ్రెస్ సమావేశం ఈ రెండు సిద్ధాంతాలను ఆమోదించి, రాయ్ సిద్ధాంతాన్ని (Supplementary Thesis) అనుబంధ సిద్ధాంతం అని అంది. 1917లో రష్యాలో లెనిన్

విప్లవ విజయం సాధించిన నాటినుండి 1924లో ఆయన చనిపోయేంతవరకు లెనిన్ చెప్పిన దానిని ఎవరూ ఏమాత్రం వ్యతిరేకించడానికి సాహసించలేదు. అలా చేసినవాడు రాయ్ ఒక్కడే! – ఇక్కడ మరో విశేషం కూడా ఉంది. తన సిద్ధాంతానికి రాయ్ చేసిన మార్పులను లెనిన్ ఏమాత్రం సంకోచించకుండా అంగీకరించాడు. లెనిన్ చనిపోయిన తరువాతకూడా ఈ విషయాన్ని చాలామంది రష్యాలో చెప్పుకునేవారు.

ఈ విషయంలోనే కాదు. ఏ విషయంలోనైనా సరే ఎంతటివాడు చెప్పినా సరే అది తనకు నచ్చకపోతే నిర్మొహమాటంగా ఆ విషయం చెప్పే స్వభావం రాయ్‌ది. ఇంకో ఉదాహరణ చెప్పాలంటే – ఆ రోజుల్లో చాలామందికి 1911లో చైనా విప్లవం సాధించిన విప్లవనాయకుడు సన్‌యట్‌సేన్ మీద చాలా సదభిప్రాయం ఉండేది. కాని రాయ్ ఈ అభిప్రాయంలో ఏకీభవించ లేదు. సన్‌యట్‌సేన్ ఆసియా దేశాలలో నిజాయితీ గల బూర్జువా అనే లెనిన్ అభిప్రాయంతో కూడా అతడు ఏకీభవించలేదు. అది వేరే విషయానికి సంబంధించిన చర్చ కాబట్టి ఇంతకు మించి దానిని కొనసాగించటం ఈ గ్రంథం లక్ష్యం కాదు.

కమింటరన్ రెండవ సభలో రాయ్ నిర్వహించిన పాత్ర అందరికీ సంతృప్తిని కలిగించింది. ఆసియాలో కమ్యూనిజం వ్యాప్తి చెందడానికి రాయ్ ఉపయోగపడతాడు అని లెనిన్ భావించాడు. తాష్కెంట్ కేంద్రంగా లెనిన్ ఆసియా కేంద్రం ఒక దానిని అంతర్జాతీయ స్థాయిలో స్థాపించాలని నిశ్చయించాడు. ఈ కేంద్రానికి ముగ్గురు సభ్యులను నామినేట్ చేసాడు. ఒకరు ఎం.ఎన్.రాయ్ మిగతావారు సఫరోవ్, సోకర్నికోవ్. ఈ ముగ్గురిలో ఇద్దరు రష్యన్‌లు, ఒకరు భారతీయుడు. ఒక విదేశీయుడికి దక్కడానికి అవకాశంలేని అపూర్వమైన గౌరవం ఇది !

ఇది ఎంతటి గొప్ప గౌరవమైనా దీనిని స్వీకరించడానికి మొదటిలో రాయ్ అంగీకరించ లేదు. "నేను ప్రాచ్య దేశానికి చెందినవాడిని. ఈ సమావేశం అయ్యాక నేను మాస్కోకు తిరిగి రాలేకపోవచ్చు. అందుచేత నేను ఈ అవకాశాన్ని అంగీకరించలేను". అని లెనిన్‌తో అన్నాడు. దానికి లెనిన్ "ప్రాచ్య దేశాలలో ప్రత్యేకించి భారత్‌లో విప్లవం జరగడానికి మీరే సారథ్యం వహించాలి" అన్నాడు. ఇక దాంతో రాయ్‌కి ఆ పదవిని స్వీకరించక తప్పలేదు. ఈ సమావేశం లోనే కమింటరన్ రాయ్‌ను కార్యనిర్వాహక సభ్యుడుగా ఎన్నిక చేసింది. ఇది కూడా ఒక విదేశీయుడికి దక్కడానికి అవకాశంలేని ఒక గొప్ప గౌరవం.

లెనిన్ నిర్ణయంతో సఫరోవ్, సోకర్నికోవ్ ముందుగా తాష్కెంట్‌కు చేరుకున్నారు. ఆ తరువాత 1920 ఆగస్టులో విప్లవ సామగ్రిని తీసుకుని రాయ్ బయలుదేరాడు. రైఫిళ్ళు, పిస్తోళ్ళు, మరతుపాకులు, చేతిబాంబులు, మందుగుండు సామాను, రేడియో యంత్రాలు ఇలాంటివాటిని 27 వేగన్లలో నింపుకొని రెడ్ ఆర్మీ దళాలు రాయ్‌కి రక్షణగా ఉండి, తాష్కెంట్

చేరాయి. దాని వెనుక ఇంకో రైలుబండిలో బంగారము, ధనము, విమాన విడి భాగాలు, విమానదళానికి అవసరమయిన సామగ్రి వీటిని తీసుకొని సైనిక శిక్షణను ఇచ్చే ఉద్యోగులు వచ్చారు.

మధ్య ఆసియా కేంద్రంలో ముగ్గురు సభ్యులు ఉన్నప్పటికి, రాయ్‌ని మాత్రమే ముఖ్య సభ్యుడుగా లెనిన్ నియమించాడు. "అంతర్జాతీయ మధ్య ఆసియా కేంద్రం" పరిధి భారతదేశం ఒకటి మాత్రమే కాదు. రష్యాలోని ఆసియా ప్రాంతం – టర్కీ నుండి ఆఫ్ఘనిస్తాన్ వరకు ఉన్న మధ్య ఆసియా ప్రాంతాలన్నీ ఈ కేంద్రం పరిధిలోనికే వస్తాయి.

వీటిలో రష్యాకు చెందిన ఆసియా ప్రాంతాలు చాలా అస్థిర రాజకీయ పరిస్థితుల్లో కొట్టుమిట్టాడుతున్నాయి. ఈ దేశాలలోని ప్రజలు ఆర్థికంగా, సాంస్కృతికంగా బాగా వెనుకబడి ఉన్నారు. మధ్యఆసియాలో ముస్లిం మతస్థులు బాగా అధికంగా ఉన్నారు. వీరందరికీ మతపరమైన నమ్మకాలు చాలా ఎక్కువ. వారి మతపరమైన నమ్మకాలకు అడ్డురాకుండా, వారి దృష్టిని విప్లవంవైపు మరలించవలసి ఉంది. ఇది చాలా కష్టమైన విషయం.

ఆఫ్ఘనిస్తాన్‌లోని విప్లవకారులు అప్పటికే "న్యూ రిపబ్లిక్ ఆఫ్ టర్కిస్తాన్" అనే సంస్థను ఏర్పాటు చేసి ఉన్నారు. కానీ, అది అంత నిలకడగా లేదు. అక్కడ చాలామంది సంచార జాతులవారు కూడా ఉన్నారు – వారిని కూడా విప్లవం పరిధిలోనికి తీసుకురావలసి ఉంది. విప్లవ వ్యతిరేకులయిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఈ కొత్త రిపబ్లిక్‌కు ఎన్ని విధాల సమస్యలు సృష్టించాలో అన్ని విధాల సమస్యలను సృష్టిస్తున్నారు.

ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుల్లో ఉన్న విప్లవవాదులకు ఆర్థిక సహాయమూ, ధన సహాయము చేసి – వారి ద్వారా భారత దేశంలోని విప్లవకారులకు సహాయం చేద్దామని రాయ్ ఉద్దేశ్యం అయితే – అప్పటికి భారతదేశంలో 'ఖిలాఫత్' ఉద్యమం జరుగుతోంది. ముమ్మరంగా జరుగుతున్న ఖిలాఫత్ ఉద్యమాన్ని గాంధీజీ సహాయనిరాకరణోద్యమముతో అనుసంధానం చేయడంవల్ల అది మరింత ఉగ్రరూపం దాల్చింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని రాయ్ తపన.

ఈ సందర్భంగా 'ఖిలాఫత్' ఉద్యమం గురించి సంక్షిప్తంగా కొన్ని వివరాలు చెపుతాను 'ఖిలాఫత్' అనే మాట 'ఖలీఫా' నుండి వచ్చింది. ఖలీఫా విశాల టర్కీ సామ్రాజ్యాన్ని చిరకాలంగా ఏలుతున్న చక్రవర్తి. ఖలీఫాలు ప్రవక్త మహమ్మద్ సంతతివారు అని ముస్లింల నమ్మకం. అందుచేత వారు ఖలీఫాను తమ మతపెద్దగా కూడా భావిస్తారు.

మొదటి ప్రపంచయుద్ధం సమయంలో ఖలీఫా జర్మనీ కూటమి పక్షాన, బ్రిటన్ కూటమికి వ్యతిరేకంగా యుద్ధం చేసాడు. యుద్ధంలో జర్మనీ ఓడిపోయింది. ఈ కారణంగా జర్మనీ కూటమిలోని రాజ్యాలన్నీ, బ్రిటన్ మిత్రరాజ్య కూటమి దయాభిక్షపై ఆధారపడి ఉన్నాయి.

రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం అయ్యేటప్పుడు బ్రిటన్‌కు యుద్ధంలో భారత ప్రజలు కూడా పాల్గొనవలసిన అవసరం ఏర్పడింది. కాని భారతదేశంలోని ముస్లింలకు ఖలీఫాకు వ్యతిరేకంగా జరిగే యుద్ధంలో పాల్గొనడం ఇష్టంలేదు. కానీ బ్రిటన్‌కు ముస్లింలు యుద్ధంలో చేరకపోతే చాలా ఇబ్బంది. అందుచేత, అబద్ధపు మాటలు చెప్పడం అలవాటయిన బ్రిటన్ - యుద్ధంలో బ్రిటన్ గెలిచినా, ఓడినా, ఖలీఫాకు ఏ విధమైన అపకారం జరగదని - బ్రిటన్ గెలిచిన పక్షంలో ఖలీఫా రాజ్యం అతడికే ఇచ్చేస్తామనీ వాగ్దానం చేసింది. బ్రిటిష్ ప్రభుత్వపు మాయమాటలునమ్మి ముస్లింలు యుద్ధంలో చేరారు.

యుద్ధంలో గెలిచి, పబ్బం గడుపుకున్న తరువాత, బ్రిటిష్ ప్రభుత్వం మాట మార్చింది. మిత్ర దేశాల నిర్ణయం కారణంగా టర్కీ కుంచించుకుపోవటంచేత, ముస్లింల పుణ్య క్షేత్రాలన్నీ క్రైస్తవుల ఆధిపత్యంలోనికి వచ్చాయి. ముస్లిం మతపెద్ద నామమాత్రపు ప్రభువుగానే మిగిలి పోయాడు. భారతదేశంలోని ముస్లింలు ఈ మోసాన్ని జీర్ణించుకోలేకపోయారు. మోసానికి తగిన ప్రతీకారం చేయాలనే పట్టుదలతో వారు ఉన్నారు. ఇలాంటి సమయంలో గాంధీజీ ఖిలాఫత్ ఉద్యమకారులను సహాయనిరాకరణోద్యమంలో భాగస్వాములను చేసాడు. దీంతో ఉద్యమం మరింత ఉధృతం అయ్యింది. అయితే, ఈ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. దీనికి కారణం ఆ తరువాత ఏర్పడిన పరిణామాలు (ఆ పరిణామాల వివరణ ఈ గ్రంథం పరిధిలోనికి రాదు కాబట్టి వివరించటం లేదు. ఆ వివరాలు కావలసినవారు కోడూరి శ్రీరామ మూర్తి రచించిన "మహాత్ముని సత్యాగ్రహాలు" అనే పుస్తకంలో చూడవచ్చును.)

టర్కీ రాజుకు తిరిగి పూర్వ ప్రాభవం రావాలనే ఉద్దేశంతో రాయ్ రష్యా సహకారాన్ని అర్థించాడు గానీ, రష్యా ప్రభుత్వం అందుకు ఆసక్తిని చూపించలేదు. ఈ పరిస్థితుల్లో ఆఫ్ఘన్ రాజు, టర్కీ రాజు, బ్రిటన్ ఆశ్రయం పొందదానికి ప్రయత్నించారు కానీ అదీ ఫలించలేదు. ఈ పరిస్థితుల్లో రాయ్ ముస్లిం దేశాల ద్వారా భారత్‌లోని ముస్లిం విప్లవకారులకు సహాయం అందించాలని ప్రయత్నించాడు గానీ అదీ ఫలించలేదు. చివరకు కాబూల్‌లో విప్లవ కేంద్రం స్థాపించాలని ప్రయత్నించాడు గానీ అదికూడా సఫలం కాలేదు.

ఆ సమయంలో రష్యా తన వ్యాపార ప్రయోజనాల కోసం బ్రిటన్‌తో సన్నిహితంగా ఉండాలని ప్రయత్నిస్తున్నది. అందుచేత బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఏ పనీ చేయడానికి సిద్ధంగా లేదు.

ఖిలాఫత్ ఉద్యమ సమయంలో మన దేశం నుండి వేలాదిమంది మహాజర్లు ఆఫ్ఘనిస్తాన్‌కు కాందిశీకులుగా చేరారు. వారిలో చాలామంది విద్యావంతులు కారు. పైగా – విపరీతమైన మతపరమైన దృక్పథం ఉన్నవారు. రాయ్ వారికి కమ్యూనిస్టు భావాలు బోధించడానికి ప్రయత్నించాడు గానీ ఆధ్యాత్మిక దృష్టిగల వారికి–భౌతికవాద దృక్పథం ఉన్న కమ్యూనిజం అంతగా ఆకట్టుకోలేదు. అయితే వారు ఆఫ్ఘనిస్తాన్ నుండి తాష్కెంటుకు రావడానికి ప్రధానమైన కారణం, అక్కడ లభించని భోజన వసతి సదుపాయాలు తాష్కెంటులో పుష్కలంగా లభిస్తాయని మాత్రమే ! – వారందరికీ రాయ్ తాష్కెంటులోని సైనిక పాఠశాలలో సైనిక శిక్షణను ఇప్పించాడు. ఈ పాఠశాలలో వారికి తుపాకులు ఉపయోగించడం, విమానాలు నడపడం, బాంబులు ప్రయోగించడం, ఇట్లాంటి విద్యలన్నీ నేర్పబడేవి. రాయ్ ఆధ్వర్యంలోని ఈ పాఠశాల 1920 అక్టోబర్ నుండి 1921 మే వరకు పనిచేసింది.

“భారతదేశంలో విప్లవం తీసుకురావడం అంటే విదేశీ ప్రభుత్వాన్ని తరిమికొట్టడం ఒక్కటే కాదు. విప్లవ ఫలితాలు సాధారణ ప్రజలకు అందుబాటులోకి వచ్చినపుడు మాత్రమే విప్లవం విజయవంతం అయ్యిందని భావించవలసి ఉంటుంది. విప్లవం అంటే విదేశీ దోపిడిదారుల స్థానంలో స్వదేశీ దోపిడిదారులను తీసుకురావడం కాదు” అంటూ మహాజర్లకు రాయ్ పదేపదే చెప్పి వారిని కమ్యూనిజం విషయంలో విద్యావంతులను చేయగలిగాడు.

మొత్తంమీద రాయ్ కృషితో – తాష్కెంటులోనే 1920 అక్టోబర్ 17న భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపించటం జరిగింది. ఆ తరువాత, దీనిని కమింటరన్‌కు అనుబంధం చేయడం జరిగింది. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో ఇది ఒక చిరస్మరణీయమైన దినం.

అయితే – భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వానికి రాయ్ నిర్వహిస్తున్న సైనిక పాఠశాల చాలా ఆందోళనను కలిగించింది. ఇలాంటి పాఠశాల అక్కడ ఉంటే, తమ ప్రభుత్వానికి ఎప్పటికైనా ముప్పు తప్పదు అని భావించింది. ఈ ఉద్దేశంతోనే బ్రిటన్ తమతో వాణిజ్య సంబంధాలు పెట్టుకోవాలంటే – తాష్కెంటులో రాయ్ నిర్వహిస్తున్న సైనిక పాఠశాలను వెంటనే మూసివేయాలని షరతు పెట్టింది. ఇందుకు రష్యా అంగీకరించింది. రాయ్‌ని వెంటనే మాస్కోకు రావాలని ఆదేశించింది.

రాయ్ మాస్కోకు వచ్చిన తరువాత ఒక కార్మిక విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలని నిర్ణయించామని, దానికి రాయ్ అధిపతిగా ఉంటాడని చెప్పింది. రాయ్ వైస్‌ఛాన్స్‌లర్‌గా ఉన్న కార్మికవిశ్వవిద్యాలయంలో తాష్కెంటులో రాయ్ పాఠాలు విన్న చాలామంది విద్యార్థులుగా చేరారు. ఆ విశ్వవిద్యాలయంలో ఎం.ఎన్.రాయ్‌తో బాటుగా శాంతిదేవిగా పిలువబడే ఎవిలిన్ రాయ్ కూడా విద్యార్థులకు పాఠాలు బోధించేది.

మరికొన్నాళ్ళకు 1921లో భారత్ నుండి బెర్లిన్‌కు వచ్చిన ఒక పెద్ద ప్రతినిధి వర్గాన్ని కలుసుకోడానికి రాయ్ వెళ్ళాల్సి వచ్చింది. ఆ ప్రతినిధి వర్గంలో ప్రముఖ గాంధేయ, స్వాతంత్ర్య సమరయోధురాలు శ్రీమతి సరోజిని నాయుడు, ఆమె సోదరుడు వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ మొదలగువారు ఉన్నారు. ఆ ప్రతినిధి వర్గం రాయ్‌ని రెండు కోరికలు కోరింది. ఒకటి – రష్యా నుండి భారతదేశానికి స్వాతంత్రోద్యమం కోసం నిధులు పంపించాలి. రెండవది – తమ ప్రతినిధి వర్గాన్ని కమింటరన్ గుర్తించాలి. రాయ్ వారితో ఈ కోరికలనుతీర్చే వాగ్దానం తాను చేయలేనని, వారు మాస్కోలోని కమింటరన్ నాయకులకు వారి కోరికలను చెప్పుకుని ఆమోదింప చేసుకోవచ్చునని చెప్పాడు. ఆ సూచనను అనుసరించి వారు మాస్కోకు వెళ్లి కమింటరన్ నాయకులందరినీ కలుసుకున్నారు. రెండు నెలలపాటు అక్కడే ఉండిపోయారు. కానీ కమింటరన్ నుంచి వీరికి ఏ విధమైన వాగ్దానము లభించలేదు. వీరి జాతీయవాద దృక్పథం కమింటరన్ నాయకులకు నచ్చలేదు.

ఆ తరువాత కమింటరన్ నాయకులు రాయ్‌తో "మీరు మాస్కోలోనే ఉండి భారత దేశంలో కమ్యూనిస్టు పార్టీ బలపడేందుకు కృషి చేయాలి. అని చెప్పారు." అయితే – మాస్కో నుండి భారతదేశంతో సంబంధం పెట్టుకోవడం అంత సులభం కాదు. ఎందుకంటే ముస్లిం రాజ్యాల ద్వారా ఈ కృషి జరగాలి. కాని ముస్లిం రాజ్యాలేవీ ఇందుకు సహకరించే స్థితిలో లేవు. అందుచేత, రాయ్ కమింటరన్ అంగీకారంతో తన ప్రధాన కార్యాలయాన్ని మాస్కో నుండి బెర్లిన్‌కు మార్చుకున్నాడు.

ఈ మధ్య కాలంలో రాయ్ "India in Transition" (సంధి దశలో భారతదేశం) అనే గొప్ప పుస్తకాన్ని రాసారు. ఈ పుస్తకం భారతదేశంలోని పరిస్థితులను మార్క్సిస్టు దృక్పథంలో విశ్లేషిస్తుంది. రాయ్ ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో రాసాడు. అది వెంటనే రష్యన్, జర్మన్ మొదలయిన పలు పాశ్చాత్య భాషల్లోకి అనువదించబడింది. ఇది యూరోప్‌లోను, అమెరికా లోను గొప్ప అమ్మకాలను సాధించి సంచలనం సృష్టించింది. ఎందుకంటే – భారత దేశంలో ఉన్న పరిస్థితులను ఇలా విశ్లేషించినవారు అంతకుముందు ఎవరూ లేరు.

భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం ఆ పుస్తకాన్ని నిషేధించింది. అయితే రహస్యంగా ఈ పుస్తకం కాపీలు భారతదేశానికి పెద్ద సంఖ్యలో చేరి – ఎందరో మేథావులను కదిలించాయి. ఆలోచింపచేసాయి. గాంధీపథంలో నడుస్తున్న ఎందరో యువకులను సోషలిస్టులుగాను, కమ్యూనిస్టులుగానూ మార్చడానికి ఈ పుస్తకం ఎంతగానో ఉపయోగపడింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రబలడానికి ఈ పుస్తకం చేసిన దోహదం ఎనలేనిది.

నిజానికి, ఈ పుస్తకాన్ని రాయ్ రాయడానికి ముఖ్య కారకుడు లెనిన్. రెండవ కాంగ్రెస్ మహాసభలో రాయ్ వెలిబుచ్చిన భావాలను విన్న లెనిన్, వాటినన్నింటిని ఒక పుస్తక రూపంలో తెస్తే బాగుంటుందని రాయ్‌కు సూచించాడు. రాయ్ ఏం రాసినా సాధికారికంగా రాస్తాడు. చారిత్రక వివరణలతో, గణాంకాలతో సహా వివరిస్తాడు. అదువలననే అతడి రచనలకు ప్రామాణికత ఉంటుంది.

ఆ తరువాత కాలంలో రాయ్ "వలస రాజ్య విధానపు పెరుగుదల, పతనం" అనే పెద్ద పుస్తకాన్ని రాయడానికి గణాంకాలను, వివరమైన సమాచారాలను ఎంతో శ్రమతో సేకరించి ఆ సమాచారాన్ని బెర్లిన్‌లో ఉన్న ఒక మిత్రుడి దగ్గర ఉంచాడు గాని, రెండవ ప్రపంచ యుద్ధ భీభత్స సమయంలో ఆ వ్రాత ప్రతులు పోయాయి. లేకుంటే అది కూడా రాయ్ రచించిన మరో ప్రసిద్ధ గ్రంథం అయ్యేది.

ఈ విషయానికి సంబంధించిన చర్చ ఎలా ఉన్నా-బెర్లిన్‌లో ఉండే రోజుల్లో భారత దేశంలోను, ఇతర దేశాలలోను కమ్యూనిజంను విస్తృతపరచడానికి రాయ్ చేసినకృషి అసామాన్య మయినది. ఆ రోజుల్లోనే రాయ్ 'వేన్‌గార్డ్' (Vanguard), 'ఎడ్వాన్స్‌డ్ గార్డ్' (Advanced Guard), 'మాసెస్' (Masses) అనే మూడు పత్రికలను నడిపాడు. అందులో రాయ్ అమూల్యమైన వ్యాసాలు రాసాడు. ఇవన్నీ భారత్‌కు రహస్యంగా చేరి పాఠకులను ఆలోచింపచేసేవి. ఆరోజుల్లోనే రాయ్ "భారతదేశం-సమస్యలు, పరిష్కారాలు", "మనం ఏం చేయాలి" వంటి పుస్తకాలు భారతదేశ సమస్యలపైరాశాడు. భారతదేశ సమస్యలపై ఎన్నో కరపత్రాలు రాసాడు. వీటన్నింటిని తన అనుచరుల ద్వారా భారతదేశానికి రహస్యంగా పంపుతూ ఉండే వాడు. అంతేకాదు నిధులు కూడా పంపించేవాడు.

వీటన్నింటి ప్రభావంతో భారత దేశంలోని ప్రధాన నగరాలలో కొన్ని కమ్యూనిస్టు గ్రూపులు ఏర్పడ్డాయి. అవి చాలా చిన్నవిగా ఉండేవి గాని, ఒకదానితో ఒకటి సత్సంబంధాలు లేకుండా ఉండేవి. అయితే రాయ్, ఈ గ్రూపులన్నీ తమతో తమకు తగువులు లేకుండా కలిసి పనిచేయాలని చెప్పడం మాత్రమే కాకుండా వీటన్నింటికి సమన్వయకర్తగా "డాంగే" పేరును సూచించాడు. వీటన్నింటి ప్రభావంగా భారతదేశంలో కార్మిక సంఘాలు పటిష్ఠంగా పనిచేయటం ప్రారంభించాయి. అన్నింటికన్నా ముఖ్యంగా చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే - భారతదేశ స్వాతంత్ర్య సాధనకై పనిచేస్తున్న భారత్ జాతీయ కాంగ్రెస్‌లో కొంతమంది వామపక్షంగా ఏర్పడ్డారు. ఆ తరువాత కాలంలో ఈ కృషి ఫలితంగా 1925లో కాన్పూర్‌లో భారత కమ్యూనిస్టు పార్టీని స్థాపించడం జరిగింది.

రాయ్ కరపత్రాలు గయా, గౌహతి, కాకినాడ, బెల్గామ్ సమావేశాలలో కూడా పంచేవారు. గయ సమావేశానికి అధ్యక్షత వహించిన చిత్తరంజన్‌దాస్ రాయ్ ఆలోచించిన రీతిలో కార్యాచరణ

జరిగితే మంచి ఫలితాలు రావడానికి అవకాశం ఉంటుందేమో ఆలోచించాల్సి ఉంటుందని తెలిపాడు.

కథ ఇలా జరుగుతూ ఉండగా – ప్రతి ఏడాది జరుగుతూ ఉండే కమింటరన్ సమావేశాలకు రాయ్ హాజరవుతూ ఉండేవాడు. రెండవ కాంగ్రెస్ సమావేశంలో రాయ్ ప్రతిపాదించిన సిద్ధాంతం లెనిన్ సిద్ధాంతానికి అనుబంధ సిద్ధాంతంగా ఆమోదించబడినా, ఆచరణలో మాత్రం లెనిన్ సిద్ధాంతమే అమలులో ఉండేది. – రాయ్ సిద్ధాంతాన్ని అంతగా ఎవరూ పట్టించుకోలేదు. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం విప్లవం మొదట పారిశ్రామిక దేశాలలో ప్రారంభం అవుతుంది. ఆ తరువాత, అది వలస రాజ్యాలకు విస్తృతం అవుతుంది. ఇలా చెప్పిన మార్క్స్ మరో విషయాన్ని కూడా చెప్పాడు. వ్యవసాయక దేశాలు పెట్టుబడి దారీ వ్యవస్థలోకి వెళ్ళకుండా నేరుగా సోషలిస్టు వ్యవస్థలోకి వెళ్ళే అవకాశంకూడా ఉందని చెప్పాడు. కాని ఈ విషయాన్ని ఆనాటి రష్యన్లు అంతగా గుర్తించలేదు. మూడు, నాలుగు, ఐదు కమింటరన్ సమావేశాలలో వలస రాజ్యాలలో బూర్జువా వర్గ పాత్ర గురించి చర్చించబడింది గాని, విషయ నిర్ధారణ ఏదీ జరగలేదు.

1924లో లెనిన్ మరణించాడు. ఆ తరువాత స్టాలిన్, ట్రాట్స్కీల మధ్య అధికార పోరాటం జరుగుతున్నది. ఈ పోరాటంలో స్టాలిన్ విజయం సాధించాడు. స్టాలిన్ ఉక్కు మనిషి. తన అభిప్రాయాలకు ఎవరు ఎదురుచెప్పినా అతడు సహించలేదు. లెనిన్‌లో ఉండే సౌమ్యత, ఇతరుల అభిప్రాయాలనుకూడా గౌరవించాలి అనే గుణం స్టాలిన్‌లో లేదు. అతడికి ఎవరైనా నచ్చకపోతే వారికి మరణమే శరణ్యం !–

మొదటిలో స్టాలిన్ రాయ్‌కి అనుకూలుడుగానే ఉండేవాడు. రాయ్ వాదానికి కమింటరన్ అంత ప్రాధాన్యతను ఇవ్వకపోయినా స్టాలిన్ దానిని అంగీకరించేవాడు. అప్పటికి రాయ్ కమింటరన్‌లో అత్యున్నత స్థానంలో ఉన్నాడు.

ఆ రోజుల్లోనే చైనాలో సంక్షోభం తలెత్తింది. చైనాలో అధికారంలో ఉన్న ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు అక్కడ "కొమింగ్‌టాంగ్" పార్టీ అవతరించింది. 1919 నుండి ఈ పార్టీ ఉధృతంగా పనిచేసి, చైనాలోని ప్రభుత్వాన్ని కూలద్రోయగలిగింది. కానీ స్థిరమైన ప్రభుత్వాన్ని స్థాపించలేకపోయింది. అందువలన అక్కడ అరాచకత్వం రాజ్యమేలుతోంది.

చైనాలో ఉన్న కమ్యూనిస్టులు మొదటిలో 'సన్‌యట్‌సేన్' ప్రభుత్వాన్ని సమర్థించారు కానీ, అది ఎంతోకాలం సాగలేదు. దీనికి కారణం – సన్‌యట్‌సేన్ మరణం : సన్‌యట్‌సేన్ మరణానంతరం 'వాంగ్' రాజ్యాధినేత అయ్యాడు. ఇతడు పెట్టుబడిదారీ వర్గానికి చెందినవాడు. అయినా – కార్మిక వ్యతిరేకి కాదు. అందుచేత – అక్కడ వాంగ్ అనుకూలవర్గం ఒకటి– అతడికి వ్యతిరేకంగా చియాంగ్ హై షేక్ వర్గం ఇంకొకటి ఏర్పడింది. చియాంగ్‌కై షేక్ పూర్తిగా

పెట్టుబడిదారీ ప్రవృత్తి కలవాడు. కార్మిక వ్యతిరేకి. ఇలా చైనా రెండు భాగాలుగా చీలిపోయింది. ఒక భాగానికి 'వాంగ్' అధిపతి అయితే – రెండో భాగానికి చియాంగ్ కై షేక్ అధిపతి – ఇలాంటి స్థితిలో రష్యా 'వాంగ్' వర్గాన్ని సమర్థించింది. చియాంగ్ కై షేక్ వర్గాన్ని వ్యతిరేకించింది. ఈ కారణంగా చైనా – ఉత్తర చైనా, దక్షిణ చైనా అనే రెండు భాగాలుగా విడిపోయింది. ఈ రెండు ప్రాంతాల మధ్య అంతర్యుద్ధాలు జరుగుతూ వుండేవి.

ఇలాంటి పరిస్థితుల్లో స్టాలిన్ ఎం.ఎన్.రాయ్‌ను చైనాకు పంపించాడు. చైనాలోని పరిస్థితులను చక్కబెట్టి, ఉత్తర చైనా దక్షిణ చైనాలను ఏకంచేసి, మొత్తం మీద అక్కడ కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పాటు చేసేలా చూడమని రాయ్‌ని ఆదేశించాడు.

* * * * *

రాయ్‌కి అప్పగించిన బాధ్యత చాలా పెద్దది. అతడు అక్కడ రెండు బాధ్యతలు నిర్వహించ వలసి ఉంది. మొదటిది "కోమింగ్‌టాంగ్"తో సత్సంబంధాలు పెట్టుకుంటూ అక్కడి వ్యవసాయ కూలీలను విప్లవానికి సన్నద్ధం చేయడం. అయితే "కొమింగ్‌టాంగ్"లో ఉన్నవారిలో అధికులు పెద్ద భూస్వాములు, మరికొంతమంది చిన్న భూస్వాములు. వారెవరికి వ్యవసాయ కూలీలు విప్లవానికి అనుకూలంగా మారడం రుచించలేదు. అందుచేత కమ్యూనిస్టు పార్టీ ఈ బాధ్యతనంతా మోయవలసి ఉంటుంది.

అయితే రాయ్‌కన్నా ముందే అక్కడకు చేరిన "బొరోడిన్'కు రాయ్ ధోరణి నచ్చలేదు. రైతులలో విప్లవ బీజాలు నాటడంకంటే, "కోమింగ్ టాంగ్"ను బలపరచడమే ముఖ్యం అని అతడు భావించాడు. అనాటికి చైనాలో విప్లవ వ్యతిరేక శక్తులే బలంగా ఉన్నాయి. 1931లో తన "జ్ఞాపకాలు"లో ఈ విషయం గురించి రాస్తూ రాయ్ "నేను చైనాకు వెళ్ళేసరికే అక్కడ ఆట దాదాపుగా ముగిసిపోయింది" అని అన్నాడు.

అంతకుముందు రాయ్ చైనాకు 'పాన్‌పెసిఫిక్' సమావేశానికి వెళ్లి ఉన్నాడు. చైనాలోని "ఆల్ చైనీస్ లేబర్ ఫెడరేషన్" అనే సంస్థ దీన్ని నిర్వహించింది. ప్రపంచం నలుమూలల నుండి శ్రామికుల సమస్యలను చర్చించేందుకు వివిధ దేశాల నుండి అక్కడికి ప్రతినిధులుగా హాజరయ్యారు. భారతదేశం నుంచి కూడా కొందరు ప్రతినిధులు వస్తే బాగుండునని రాయ్ భావించాడు. భారతదేశం నుండి కొందరు ఆ సమావేశానికి రావాలని ఉవ్విళ్లూరినా భారత ప్రభుత్వం వారికి పాస్‌పోర్టులు ఇవ్వలేదు. ఇదంతా జరిగిన కథ. ఇక ఇప్పుడు రాయ్ చైనాకు చేరేటప్పటికి ఉన్న పరిస్థితులను గురించి ఆలోచిద్దాం. రాయ్ చైనాలో విప్లవ బీజాలు నాటడానికి ఎంతో ప్రయత్నించాడు గాని ఆ కృషి ఎంతమాత్రం విజయవంతం కాలేదు.

రాయ్ 'కాంటన్' (చైనాలోని ఒక ప్రాంతం) చేరుకునే నాటికి 'కొమింగ్‌టాంగ్"లో వామపక్ష వర్గానికి, దాని వ్యతిరేకవర్గానికిని మధ్య విభేదాలు బాగా పెరిగిపోయాయి. అందుకే దీనిని ఉపయోగించుకొని అక్కడ కమ్యూనిజంను స్థాపించడానికి అవకాశం ఉంటుందేమో చూద్దాం అని 'కమింటరన్' రాయ్‌ను, బరోడిన్‌ను పంపడానికి ఏర్పాటు చేసిందని ఇదివరకే చెప్పుకున్నాము. అయితే కమింటరన్ ఈ విషయంలో సర్వాధికారాలు బరోడిన్ చేతిలోనే పెట్టింది. నిధులు కూడా అతని చేతిలోనే ఉంటాయి. రాయ్ అతడికి సలహాదారుడు మాత్రమే !

రాయ్ ఆలోచనలకు బరోడిన్ ఆలోచనలకు పొత్తు కుదరలేదు. కర్షక, కార్మిక సంఘాల సహకారంతో – భూములను రైతులకే పంచిపెడుతూ వారి ద్వారా ప్రభుత్వాన్ని ఇబ్బంది పెడుతూ – చివరకు చైనాలో శ్రామిక రాజ్యాన్ని స్థాపించాలని రాయ్ వ్యూహం.

బరోడిన్ ఇందుకు అంగీకరించలేదు. ముందుగా ప్రభుత్వంపై దండయాత్రలు చేస్తూ ఆ ప్రభుత్వాన్ని కూలద్రోసి శ్రామిక రాజ్యం స్థాపించాలనేది బరోడిన్ వ్యూహం. ఈ రెండు వ్యూహాల లక్ష్యం ఒకటే అయినా సాధించదలచిన మార్గాలలో తేడా ఉన్నది. విప్లవం అనేది పైనుండి క్రిందకు రావాలి అనేది బరోడిన్ వ్యూహం. కాని, రాయ్ వ్యూహం ప్రకారం విప్లవం అనేది క్రింది నుండి పైకి రావాలి. ఈ రెండు మార్గాలకు పొంతన లేదు. కాని, రాయ్ తన మాటను నెగ్గించుకొనే స్థితిలో లేడు. ఎందుకంటే నిధులు, అధికారాలు బరోడిన్ చేతిలో ఉన్నాయి.

రాయ్ దృష్టిలో కొమింగ్‌టాన్‌లోని వామపక్షం విప్లవానికి అనుకూలమైనది కాదు. ఇంకా చెప్పాలంటే వ్యతిరేకమైనది కూడా. అందుచేత దానిని మిత్రపక్షంగా కాక శత్రు పక్షంగానే చూడాలి అనేది రాయ్ అభిప్రాయం. అదేవిధంగా చైనా ప్రభుత్వంపై దండయాత్ర చేయడం అనేది సాధ్యమయ్యే విషయం కాదు. సైనికపరంగా ఆలోచిస్తే ఆచరణసాధ్యం కాదు. రాజకీయంగా ప్రమాదకరం. కాని ఈ విషయాన్ని బరోడిన్ అంగీకరించే వాడు కాదు. మొత్తంమీద – ఈ అభిప్రాయ భేదాలను విశ్లేషించాలంటే ఈ విధంగా చెప్పవచ్చు. అవి విప్లవాన్ని లోతుకు తీసుకువెళ్ళాలా, లేక విస్తృతపరచాలా అనే విషయానికి సంబంధించినది. మొదటిది రాయ్ అభిప్రాయం అయితే రెండవది బరోడిన్ అభిప్రాయం. రాయ్ అభిప్రాయం గట్టి పునాదులతో నిర్మించిన భవనం లాంటిది. బరోడిన్ అభిప్రాయం బలహీనమైన పునాదులపై నిర్మించబడిన భవనం లాంటిది. ఏది ఏమైతేనేం – రాయ్ అభిప్రాయం చెల్లుబాటు కాలేదు.

ఉత్తర చైనాలోని వాంగ్ ప్రభుత్వం దక్షిణ చైనాలోని చియాంగ్ కైషేక్ ప్రభుత్వం పై యుద్ధాన్ని ప్రకటించింది. యుద్ధం జరుగుతున్న కారణంగా వాంగ్ ప్రభుత్వం పలు శ్రామిక వ్యతిరేక చర్యలు చేసింది. సైనికులకు నిరాటంకంగా వస్తు సామగ్రి అందాలి కాబట్టి, కార్మిక

సంఘాలు యుద్ధకాలంలో ఎలాంటి సమ్మెలు చేయకూడదని శాసించింది. మామూలుగా చేసే పని గంటలు కన్నా పని గంటలు పెంచింది. ఇది కార్మికులకు కంటకంగా ఉండేది.

ఇలాంటి సమయంలో రైతు కూలీలు తరతరాలుగా తమను పీడిస్తున్న భూస్వాములపై తిరుగుబాటు చేసారు. కొన్ని ప్రాంతాలలో కర్షకులు భూస్వాములు దగ్గర కౌలుకు తీసుకున్న వ్యవసాయ భూములు తమవే అని ప్రకటించారు. ఇక కొన్ని ప్రాంతాలలో భూస్వాములను ఊరినుండి తరిమికొట్టారు. ఇలాంటి పరిస్థితిలో ప్రభుత్వం భూస్వాములపై తిరుగుబాటు చేస్తున్న రైతులను అదుపులో ఉంచమని రాయ్‌ని కోరింది. ఎందుకంటే, రాయ్‌కి రైతులతో మంచి సంబంధాలు ఉండేవి. కాని రాయ్ అందుకు అంగీకరించలేదు. పైగా – వారు చేస్తున్న పని సరియైనదే అని అన్నాడు. ఇది కూడా బరోడిన్‌కి నచ్చలేదు. రాయ్ రైతులను అదుపులో ఉంచాలని భావించాడు.

ఇలాంటి పరిస్థితిలో ముప్పై లక్షల మంది సభ్యులుగా ఉన్న కర్షక సంఘాలను సమీకరించి వారిచేత ఆయుధాలు పట్టించి వారు కమ్యూనిస్టు పార్టీకి అండగా ఉండాలన్న రాయ్ కోరికను ఎవరూ ఆమోదించలేదు.

మొత్తంమీద చైనాలో విప్లవం దిశగా జరిగిన ప్రయత్నాలు ఘోరంగా విఫలం అయ్యాయి. ఇట్లాంటి పరిస్థితుల్లో వాంగ్‌కు కమ్యూనిస్టుల సహాయం లభిస్తుందన్న నమ్మకం పోయింది. రష్యావల్ల సహాయం లభిస్తుందన్న ఆశ కూడా పోయింది. ఈ పరిస్థితిలో రాయ్‌కు స్టాలిన్ వాంగ్ ప్రభుత్వానికి రష్యా ప్రభుత్వం తప్పక సహాయం చేస్తుందనే టెలిగ్రామ్‌ను పంపాడు. ఈ టెలిగ్రామ్‌ను స్టాలిన్ నేరుగా వాంగ్‌కు పంపకుండా రాయ్‌కి పంపడంలో ఉన్న ఉద్దేశ్యం ఏమిటంటే, అతడు ఈ విషయాన్ని వాంగ్‌కు తెలియజేయాలని మాత్రమే ! – అంతేకాని, టెలిగ్రామ్‌ను వాంగ్‌కు చూపాలనే ఉద్దేశ్యం అతడికి లేదు.

ఈ విషయాన్ని రాయ్ వాంగ్‌కు చెబితే, అతడు నమ్మలేదు. టెలిగ్రామ్‌ను చూపిస్తే నమ్ముతాను అన్నాడు. అట్లాంటి తప్పనిసరి పరిస్థితిలో వాంగ్‌కు స్టాలిన్ పంపిన టెలిగ్రామ్‌ను చూపించాడు. దానిని చూసిన తరువాత అతడు నమ్మాడు గాని దాని ప్రకారం చేయగల శక్తి అతడికి లేదు. సైన్యంపై అతడికి అదుపులేదు. విప్లవ వ్యతిరేక శక్తులు దేశంలో అధికంగా ఉన్నాయి.

ఇట్లాంటి స్థితిలో చాంగ్ కై షేక్‌తో తగువుపడే దానికంటే, అతడితో రాజీపడడమే మంచిదని వాంగ్‌కు అనిపించింది. చాంగ్ కై షేక్ రాజీకి అంగీకరించాడు గానీ, ముందు దేశంలో ఉన్న కమ్యూనిస్టులను వెళ్ళగొట్టమన్నాడు. రష్యా నుండి వచ్చిన సైనికాధికారులను, కమ్యూనిస్టు సలహాదారులను, దేశంలో ఉన్న కమ్యూనిస్టు ధోరణులను అణగద్రొక్క మన్నాడు.

వాంగ్ ఈ పనులన్నీ తూ.చా. తప్పకుండా చేసాడు. విప్లవ కార్యకలాపాలకు పాల్పడుతున్న కమ్యూనిస్టులను, కార్మికులను ఊచకోత కోసాడు. దేశంలో విప్లవకారుల రక్తం ఏరులా పారింది. ఏం సాధిద్దామని రాయ్ చైనాకు వెళ్ళాడో అది ఘోరంగా విఫలం అయ్యింది. ఈ వైఫల్యానికి ప్రధాన కారణం బరోడిన్ అయినప్పటికీ – రాయ్ వల్లనే విప్లవం రాకుండా జరిగిందని ప్రచారం జరిగింది. దానితో కమింటరన్‌లో రాయ్ ప్రాభవం దిగజారడం ప్రారంభం అయింది.

* * * * *

మొదటిలో స్టాలిన్‌కు రాయ్‌మీద చాలా సదభిప్రాయమే వుండేదని ఇదివరకే చెప్పుకున్నాం. రెండవ కమింటరేన్ సమావేశంలో రాయ్ ప్రతిపాదించిన అనుబంధ సిద్ధాంతం – లెనిన్ సిద్ధాంతం కన్నా మెరుగుగా వుందని అతడు మెచ్చుకున్నాడు కూడా.

ఆసియా దేశాలలో కమ్యూనిజమ్ వ్యాప్తి చెందాలంటే అది రాయ్ వలన మాత్రమే సాధ్యమవుతుందని స్టాలిన్ భావించేవాడు. ఈ నమ్మకంతోనే అతడు రాయ్‌ని చైనాకు పంపించాడు.

అయితే పరిస్థితులు అనుకూలించకపోవడంతో బరోడిన్‌కు, రాయ్‌కు తీవ్రమైన అభిప్రాయ భేధాలు ఉండడంచేతనూ, అనుకున్నది సాధించబడలేదు. కాని, ఈ సంజాయిషీలు ఉక్కుమనిషి స్టాలిన్‌కు అనవసరం. వెళ్లిన పని సక్రమంగా పూర్తి అయిందా లేదా అన్నదే ముఖ్యం. వైఫల్యానికి రాయ్ బాధ్యుడు అని ప్రచారం జరిగింది కాబట్టి, అతడు రాయ్‌పై తీవ్ర ఆగ్రహంతో వున్నాడు.

మాస్కోకు తిరిగి వచ్చిన రాయ్ తన ఆవేదన చెప్పుకునేందుకు – స్టాలిన్ ఇంటర్వ్యూ కోరితే, స్టాలిన్ అందుకు ఆమోదించలేదు. ఇలాంటి స్థితిలో రాయ్ 'చైనాలో విప్లవం" అనే పేరుతో రష్యన్ భాషలో ఒక పుస్తకంరాశాడు. ఆ తర్వాత దానిని ఇంగ్లీషు భాషలోకి అనువాదం చేద్దామనుకుంటే, రష్యన్ ప్రభుత్వమందుకు అనుమతించలేదు. కాని రాయ్ రష్యాను విడిచి వచ్చిన తర్వాత అది ఇంగ్లీషులో ప్రచురించబడింది. ఏది ఏమయినా 1927 ఆగష్టు నెల ప్రాంతాలలో మాస్కోకు తిరిగివచ్చిన రాయ్ 1928 ఏప్రిల్ వరకూ మాస్కోలోనే వున్నాడు. రాయ్ రష్యాలో కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనే నాటి నుండి అతడికి చాలా పెద్ద జీతమే ఇస్తూండేవారు. కాని, చైనాలో వైఫల్యానికి అతడిని బలిపశువుగా చేసిన నాటినుండి, అతడి జీతాన్ని బాగా తగ్గించేశారు. దిగుడుబావిలో ఇది మొదటి మెట్టు మాత్రమే.

"కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్" (కమింటరన్) తమ సభ్యులు పూర్తి క్రమశిక్షణతో వుండాలని కోరుకుంటుంది. వారి ఉద్దేశంలో "క్రమశిక్షణ" అంటే కమింటరన్ అధిపతులు వారు చెప్పింది తు.చ.తప్పకుండ చెయ్యడం. ఎవరూ ఎందుకు అని ప్రశ్నించకూడదు. స్టాలిన్ పాలనలోని రష్యాలో స్వతంత్ర భావాలకు విలువలేదు. స్వతంత్ర భావాలుగల వ్యక్తులు పార్టీలో ఎంతటి

ఉన్నత పదవులలో వున్నా వారిని పార్టీనుండి తొలగించడమో, లేకపోతే హత్యచేసి, ఈ లోకంలోనే లేకుండా చెయ్యడమే జరిగేది.

జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ వంటి దేశాలలో వున్న కమ్యూనిస్టు పార్టీ నాయకుల విషయంలో కూడా ఇదే పద్ధతి ఉండేది. ఆ దేశాలలో వున్న కమ్యూనిస్టు ముఖ్యనాయకులను 'కమింటరన్' ఇష్టం వచ్చినట్టుగా మార్చేస్తూ వుండేది. తమకు అత్యంత విధేయులుగా వున్నవారినే నాయకులుగా 'కమింటరన్' నిర్ణయించేది. రస్యానుండి వచ్చే నిధులకోసం వారు కక్కుర్తిపడి, కుక్కినపేనుల్లా బ్రతుకుతూ వుండేవారు.

ఇలాంటి పరిస్థితుల్లో రాయ్‌లాంటి స్వతంత్ర భావాలుగల వ్యక్తులు వారికి ఎంతమాత్రమూ నచ్చరు. (అలాంటి సంస్కారం లెనిన్‌కు మాత్రమే వుండేది)

చైనాలో జరిగిన వైఫల్యాల తర్వాత, కమింటరన్ రాయ్‌పై పడగ విప్పింది. 1928 సెప్టెంబరులో జరిగిన ఆరవ ప్రపంచ కాంగ్రెస్‌లో రాయ్‌ని తీవ్రమైన పదజాలంతో విమర్శించడం జరిగింది. ఆ సమావేశంలో రాయ్‌ని సామ్రాజ్యవాద ఏజంటుగా, అవకాశ వాదిగా, అపహాస్యం చెయ్యడం జరిగింది.

అంతేకాదు, రాయ్‌మీద తీవ్రమైన అభియోగాలు కూడా మోపబడ్డాయి. దీనికి మూల కారణం సహ్మేంద్రనాథ ఠాగూర్ అనే వ్యక్తి భారతదేశంలో వున్న కమ్యూనిజమ్ స్థితికి సంబంధించి, కమింటరన్‌కు పంపిన నివేదిక.

కమింటరన్ కేంద్ర కమిటికి అప్పట్లో ప్రధాన కార్యదర్శిగా వున్న "పియాట్నిస్కీ" (Piantnisky) అనే వ్యక్తి - సహ్యేంద్రనాథ ఠాగూర్ భారతదేశంలో ఎన్నదగిన కమ్యూనిస్టుగా భావించి, అతడిని భారతదేశంలో వున్న కమ్యూనిస్టులను అందరినీ కలుసుకుని - అక్కడ వున్న కమ్యూనిజమ్ స్థితిగతుల గురించి ఒక సమగ్రమైన నివేదిక ఇమ్మని కోరాడు. కమింటరన్ కోరిక ప్రకారం అతడు కమింటరన్‌కు తన నివేదికను పంపాడు. అతడి నివేదిక ప్రకారం -

"రాయ్ చెబుతున్నట్టుగా, భారతదేశంలో వందలాది కమ్యూనిస్టులు లేరు. ఇక్కడ వున్న కమ్యూనిస్టుల సంఖ్య డజనుకు మించదు. కమింటరన్ రాయ్‌కి ఇచ్చిన పెద్దమొత్తం నిధులను అతడు భారత కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధికి ఖర్చు చేయలేదు. ఆర్థిక వనరులు అందని కారణంగా భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి చెందలేదు. కనీసం కమ్యూనిస్టు సాహిత్యం కూడా రాయ్‌నించి భారత్‌కు రాలేదు".

ఇలా సాగిన ఆ నివేదిక ప్రకారం కమింటరన్ రాయ్ పార్టీ నిధులను దుర్వినియోగం చేశాడనీ, అతడొక అవినీతిపరుడనీ, నిర్ణయానికి వచ్చింది. భారతదేశంలోని కమ్యూనిస్టు పార్టీ

గురించి అతిశయోక్తులు పలుకుతూ, తన ఆర్థిక పరిస్థితిని పెంచుకుంటున్నాడనే, నిర్ణయానికి వచ్చింది. ఈ నివేదిక రాయ్ వ్యతిరేకులకు అతడిని దెబ్బకొట్టడానికి మంచి అవకాశం యిచ్చింది.

నిజానికి, ఇది చాలా తప్పుల తడక నివేదిక అని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఇది వాస్తవాలను గమనించి రాసిన నివేదిక కాక ఊహించి రాసిన నివేదిక.

నిజానికి సహ్యేంద్రనాథ ఠాగూర్‌కు భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ ఎప్పుడు పుట్టిందో, అది ఎలా అభివృద్ధి చెందిందో, ఈవివరాలేవీ తెలియవు. అతడు ప్రధానంగా గాంధేయవాది. అయితే బెంగాల్ నుండి వెలువడే ఒక కమ్యూనిస్టు పత్రికను చదివి, పార్టీపట్ల ఆకర్షితుడయ్యాడు.

ఠాగూర్ 'కమింటరన్'కు పంపిన నివేదికలో 1927కు ముందు భారతేశంలో కమ్యూనిస్టు పార్టీయే లేదని రాశాడు. కాని, 1925లోనే కాన్పూర్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించిందని అతడెరుగడు. అంతేకాదు, 1927లో 'ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సమావేశం కాన్పూర్‌లో జరిగిందనీ, ఈ వార్షిక సమావేశానికి బెంగాల్, బొంబాయిల నుండి పెద్ద సంఖ్యలో కామ్రేడ్‌లు హాజరయ్యారనీ, సమావేశంలో ఎర్రజెండా ఆవిష్కరించబడిందనీ అతడెరుగడు. భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ అనేది లేకుండా ఇవన్నీ ఎలా జరుగుతాయో అతడే చెప్పాలి.

ఇక, నిధుల విషయానికి వస్తే రాయ్‌కి ఎన్ని నిధులను కమింటరన్ యిచ్చింది ? అతడెలా ఖర్చు చేశాడు ? అనే విషయంలో స్పష్టత ఎవరూ చెప్పరు. నిజానికి తన దగ్గిర వున్న నిధులను భారత్‌లోని పార్టీ వర్కర్లకు అందజేసే విషయంలో చాలా ఇబ్బందులున్నాయి. అతి రహస్య మార్గాలలో పార్టీ వర్కర్లకు పంపవలసి వున్నది. మధ్యలో కొంత ద్రవ్యం మధ్యవర్తుల జేబుల్లోకి వెళ్ళిపోయే ప్రమాదం వుంది. అందుచేత కొన్ని పరిస్థితుల్లో అనుకున్న విధంగా నిధులు చేరే అవకాశం వుండదు.

రాయ్ మీద వున్న మరొక అభియోగం ఏమిటంటే, అతడు చైనాలో వుండగా, స్టాలిన్ పంపిన టెలిగ్రామ్‌ను వాంగ్‌కు చూపడం. స్టాలిన్ పంపిన టెలిగ్రామ్ అత్యంత రహస్యమైన విషయం అని రాయ్‌కి తెలియకపోలేదు. టెలిగ్రామ్‌లోని విషయాలను మాత్రమే వాంగ్‌కు చెప్పాలికాని, దానిని ప్రత్యక్షంగా వాంగ్‌కి చూపకూడదు. కాని, వాంగ్ టెలిగ్రామ్ చూపమని పట్టుబట్టడంతో, తప్పనిసరి పరిస్థితుల్లో రాయ్ టెలిగ్రామ్‌ను అతడికి చూపాడు. కాని, కమింటరన్ పరిస్థితిని అర్థంచేసుకోకుండా, ఇదొక క్షమించరాని చర్య అని భావించింది.

ఇవన్నీ వివరంగా స్టాలిన్‌కు చెప్పాలని రాయ్ భావించాడు కానీ, అవకాశం లభించలేదు.

మాస్కోలో వుండగానే రాయ్‌కి తీవ్రమైన అస్వస్థత చేసింది. ప్రభుత్వ వైద్యశాలలో చేరాడు గానీ – అతడికి తగిన వైద్యం అందించడానికి ప్రభుత్వం ఏర్పాటు చెయ్యలేదు.

ఇట్లాంటి స్థితిలో రాయ్ మంచి వైద్యంకోసం బెర్లిన్ వెళ్లాడు. అతడు బెర్లిన్‌లో వుండగానే మాస్కోలో ఆరవ ప్రపంచ కాంగ్రెస్ మహాసభ జరిగింది. అందుచేత తనపై మోపబడిన అభియోగాలకు సమాధానం చెప్పడానికి వీలుకాలేదు. ఇలాంటి పరిస్థితుల్లో తన ఆవేదనను తెలుపుతూ "గెగెన్‌డెన్‌స్ట్రాం" అనే జర్మన్ పత్రికలో జర్మన్ భాషలో వ్యాస పరంపరను రాశాడు. రాయ్ వ్యాసాలు రాసిన పత్రిక కమ్యూనిస్టు పత్రిక కాదు. అలాంటి పత్రికలో వ్యాసాలు రాయడం కమింటరీన్‌కు మరింత మంట కలిగించింది.

అందుచేత రాయ్ కమ్యూనిస్టు వ్యతిరేక శక్తులతో ఏకం అయ్యాడనీ, అలాంటి దృక్పథం గల పత్రికల్లో వ్యాసాలు రాస్తున్నాడనే నెపంపెట్టి రాయ్‌ని కమ్యూనిస్టు పార్టీ నుండి బహిష్కరించింది. దీంతో రాయ్‌కి కమ్యూనిస్టు పార్టీకి వున్న సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి.

ఇలాంటి పరిస్థితుల్లో తిరిగి మాస్కోకు వెడితే, స్టాలిన్ ఆగ్రహానికి గురియై హత్య గావింపబడడం తప్పదు. కాబట్టి, అతడికి వున్న ఏకైక మార్గం తిరిగి భారత్‌కు వెళ్లి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని తన భావాలను ఆచరణలోనికి పెట్టడం.

భారత్‌కు స్వతంత్రం లభించడం అనేది అతడి చిరకాల లక్ష్యం. రెండవ కాంగ్రెస్ సమావేశం కాలం నుండి రాయ్ తిరిగి భారత్‌కు వెళ్లాలనే కోరికను లెనిన్ దగ్గిర వ్యక్తం చేస్తూ వుండేవాడు. అయితే – రష్యాలో రాయ్ చేయాల్సిన పని చాలా వుందంటూ, భారత్‌కు వెళ్లకుండా ఆపేవాడు.

ఆ తర్వాత – స్టాలిన్ కాలంలో కూడా రాయ్ తన కోరికను అతడితో చెప్పేవాడు. స్టాలిన్ మొదటిలో అంగీకరించలేదు గాని–చైనాలో రాయ్ తనకు నిర్దేశించిన పనిని సక్రమంగా నెరవేర్చి వస్తే, ఇండియాకు తిరిగి వెళ్లడానికి రాయ్‌కి అనుమతి ఇద్దామనుకున్నాడు – ఇంతలో మొత్తం వ్యవహారం తిరగబడ్డది.

– ఇలాంటి పరిస్థితుల్లో, 'బెనర్జీ' అనే మారుపేరు పెట్టుకుని, రాయ్ రహస్యంగా ఇండియాకు బయలుదేరాడు.



# 7

# తిరిగి భారత్‌కు ..... కాంగ్రెస్‌లో ..... ఆ తర్వాత

**రాయ్**‌కు భారతదేశం తిరిగా రావాలనే కోరిక చాలా కాలం నుండీ వుంది. గాంధీజీ నాయకత్వంలో సత్యాగ్రహం ఆసేతు హిమాచలం ప్రజా ఉద్యమంగా మారుతున్న విషయం విని, అతడు చాలా సంతోషించాడు. ఆ ప్రజా ఉద్యమాన్ని కర్షక, కార్మిక, ఉద్య మంగా మార్చాలని అతడు కలలుగన్నాడు.

అయితే భారత్‌కు తిరిగి రావడంలో కూడా అతడికి అనేక యిబ్బందులున్నాయి. కాన్పూర్ కుట్ర కేసులో, మీరట్ కుట్ర కేసులో ముద్దాయి అయిన అతడిని అరెస్ట్ చెయ్యడం కోసం భారతదేశంలోని పోలీసులు ఎప్పటినుండో ప్రయత్నిస్తున్నారు. బ్రిటిష్ పోలీసులు రాయ్ భారతదేశానికి బయలుదేరాడని భారతదేశంలోని పోలీసులకు సమాచారం అందజేశారు.

భారతదేశం వెడితే, జైలు జీవితం గడపవలసి వుంటుందని రాయ్‌కి తెలుసు. అయితే జన్మభూమి పట్ల అతడికిగల అపారమైన కోరిక కారణంగానూ, ఇతర దేశాలలో వుంటే ప్రాణభయంవున్న కారణంగానూ, రాయ్ భారతదేశానికి తిరిగి వచ్చే సాహసం చేశాడు. బెనర్జీ, డాక్టర్ మహమ్మద్, ఇలాంటి మారుపేర్లతో, దొంగ పాస్‌పోర్టుతో రాయ్ ఎట్టకేలకు 1930లో డిసెంబరు 17వ తేదీన భారత్‌కు చేరుకున్నాడు.

భారతదేశం వచ్చిన రాయ్ ఏడు నెలల కాలం కన్నుగప్పగలిగాడు కానీ చివరకు1931లో జూలై 7వ తేదీన పోలీసులు అతడిని పట్టుకోగలిగారు.

రాయ్ జైలు జీవితం గురించి తెలుసుకునేముందు అతడు ఈ ఏడు నెలల కాలంలో ఏం చేశాడన్న విషయం తెలుసుకుందాం.

ఈ కాలంలో రాయ్ బొంబాయి, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో విస్తృతంగా పర్యటించాడు. కాంగ్రెస్ నాయకులైన జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభభాయిపటేల్ వంటి వారినీ ఎన్.ఎం.జోషీ బి.ఆర్.అంబేద్కర్ వంటి వారినీ కలిశాడు.

కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు హాజరై సుభాష్ చంద్రబోస్‌ను కలిశాడు. ఎన్ని మారుపేర్లు పెట్టుకున్నా, అతడి మేధాశక్తి అపూర్వమైనది కాబట్టి వారందరూ అతడిని సాదరంగా ఆహ్వానించారు. రాయ్ రచించిన Men I Met అనే పుస్తకంలో జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్, చిత్తరంజన్‌దాస్, మహమ్మదాలీ జిన్నా, ఎం.కె.గాంధీ వంటి వారిని గురించి తన మనసులో భావాలు వ్యక్తీకరించాడు.

"కమింటరన్" అతడిని బహిష్కరించినా, అతడు కమ్యూనిస్టుగానే వున్నాడు. భారత్‌లో కర్షక, కార్మిక ఉద్యమాలు బలపడాలనే తపనతోనే వున్నాడు. వామపక్ష భావాలుగల యువకులతో సాన్నిహిత్యాన్ని కలిగి వున్నాడు. 'రాయిస్టు'లుగా కొందరు యువకులను బొంబాయిలో చెయ్యగలిగాడు. కాంగ్రెస్‌లో కొందరు ఉత్సాహవంతులయిన యువకులు, ట్రేడ్ యూనియన్ల సభ్యులు, యువజన ఉద్యమాలతో సంబంధం వున్నవారూ, వుండేవారు. వీళ్లందరినీ సంఘటిత పరచి, "రాయ్ గ్రూప్" అనే దానిని తయారుచెయ్యగలిగాడు.

కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభ కాలం నుండి రాయ్‌కి, కాంగ్రెస్‌వారు గాంధీజీపట్ల చూపిస్తున్న అరాధనాభావం నచ్చలేదు. కరాచీ కాంగ్రెస్ మహాసభ తీర్మానాలను చర్చించేందుకు కాక, గాంధీజీని స్తుతించేందుకు ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చింది అని అతడికి అనిపించింది. ఇలాంటి పద్ధతులు 'ఫాసిస్టు' పోకడలకు దారితీస్తాయని అతడి అభిప్రాయం.

అయితే – మొదటలో జవహర్‌లాల్ నెహ్రూకు, రాయ్‌కు కొంత భావసారూప్యత వుండేది. జవహర్‌లాల్ నెహ్రూకు రాయ్ కాంగ్రెస్ ఒక నిర్దుష్టమైన ఆర్థిక కార్యక్రమంలో పనిచెయ్యాలని చెప్పి, ఒప్పించగలిగాడు. దీని ఫలితమే కరాచీ కాంగ్రెస్‌లో నెహ్రూ చేసిన ఆర్థిక ప్రతిపాదన. ఈ ప్రతిపాదన డ్రాఫ్టును రాయ్ రాశాడని కొందరంటారు.

రాయ్ భారతదేశానికి వచ్చేనాటికి దేశంలో సహాయ నిరాకరణోద్యమం జరుగుతున్నది. దానిని మరింత ఉధృతం చెయ్యడానికి రాయ్ – నవజీవన్ భారత్ సభ, ఇండిపెండెన్స్ ఇండియా కమిటీవంటి యువజనసంఘాలను స్థాపించాడు. అయితే ఉధృతంగా సాగుతున్న ఉద్యమం గాంధీ, ఇర్విన్ ఒప్పందం (Gandhi Irwin Pact)తో హఠాత్తుగా నిలిపివేయ బడింది. కాంగ్రెస్ మహాసభలో ఈ ఒప్పందాన్ని ఆమోదించవలసి వుంది. రాయ్‌కి ఈ ఒప్పందం ఎంతమాత్రమూ నచ్చలేదు. రాయ్ అనుచరుడు త్యాబ్ షేక్ – ఈ ఒప్పందానికి సవరణలు చెయ్యాలంటూ ఉపన్యాసం యిచ్చాడు గానీ, ఆ సవరణ వీగిపోయింది. రౌండ్ టేబుల్ సమావేశానికి కాంగ్రెస్ పక్షాన ఏకైక ప్రతినిధిగా గాంధీజీ హాజరు కావాలనే తీర్మానం ఆమోదించబడింది.

ఆ రోజుల్లోనే ఉత్తర ప్రదేశ్‌లో వ్యవసాయ సంక్షోభమేర్పడింది. వ్యవసాయ ఉత్పత్తుల ధరలు ఘోరంగా పడిపోయాయి. పంట పండినా అమ్ముకోలేని పరిస్థితి. రైతులు దారిద్ర్యంతో క్రుంగిపోతున్నారు. భూస్వాములకు శిస్తు చెల్లించలేని పరిస్థితి. ఇట్లాంటి స్థితిలో జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో కాంగ్రెస్ రైతుల పక్షాన నిలిచింది. కనీస మొత్తానికి మించి, వారిని శిస్తులు చెల్లించవద్దన్నది.

ఈ పరిస్థితిని రాయ్ తనకు అనుకూలంగా మార్చుకోదలిచాడు. రాయిస్టులు "శిస్తు చెల్లించవద్దు" అనే ఉద్యమం ప్రారంభించారు. రాయ్ నెహ్రూతో, వామపక్ష భావాలుగల

కాంగ్రెస్‌వారితో భుజం, భుజం, కలిపి పనిచేశాడు. వీరందరూ ఉత్తర ప్రదేశ్‌లోని గ్రామాలలో విస్తృతంగా పర్యటించారు. రైతులను ఉత్తేజపరిచారు. ఈ ఉద్యమాలలో పాల్గొనేటప్పుడు రాయ్ పేరు 'బెనర్జీ' ! జనానికి సన్నిహితంగా వుండేందుకు ఖాదీ ఫైజుమా, సాదా లాల్చీ, వేసుకుని పర్యటించేవాడు. మార్చి నెల మాసాంతానికి రాయ్ 2000 కిలోమీటర్లు పర్యటించాడని తెలుసు కుంటే ఆశ్చర్యంగా వుంటుంది. రాయ్ కార్యకలాపాల పట్ల నెహ్రూ ఎంతగానో ఆకర్షితుడయ్యాడు. కానీ, ఇష్టమున్న పరిస్థితుల్లోనూ, ఇష్టంలేని పరిస్థితుల్లోనూ, అతడు గాంధీజీని అనుసరించేవాడు. కాంగ్రెస్ సోషలిస్టులమని చెప్పుకునే వర్గం ఒకటి వుందిగాని, వారి భావాలు ఎలా వున్నా చివరకు గాంధీజీ మాట కాదనేవారు కాదు. సుభాష్ చంద్రబోస్‌వంటి ఇతర నాయకుల స్థితీ యిదే. ఈ ధోరణి రాయ్‌కి నచ్చేది కాదు.

ఇక, దేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమం (కార్మిక సంఘాల ఉద్యమం) పరిస్థితి అత్యంత నిరాశాజనకంగా వుంది. కార్మిక సంఘాలలో ఐక్యత లేదు. "ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్"లో కమ్యూనిస్టులు చీలికలు తెచ్చారు.

ఒక్క మాటలో చెప్పాలంటే దేశంలోని కార్మిక ఉద్యమం శిథిలావస్థలో వుంది. పరిస్థితిని మెరుగుపరచడానికి రాయ్ 'ప్లాట్‌ఫారమ్ ఆఫ్ యూనిటీ' (Platform of Unity) అనే పేరుతో ఒక కార్యక్రమాన్ని ప్రారంభించాడు గానీ అది అంత విజయవంతం కాలేదు.

రాయ్‌కి ప్రియమైన విషయం దేశంలో కమ్యూనిజమ్ బలపడి, దాని ద్వారా జాతీయ ఉద్యమం బలపడాలనీ, దీని ఫలితంగా దేశానికి స్వాతంత్ర్యం కలగాలనీ. రాయ్ దృష్టిలో ప్రధానమైన విషయం దేశంలో కమ్యూనిజమ్ బలపడాలన్నది.

ఆనాటికి భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ అనేది ఉన్నది గాని, అది చాలా అస్తవ్యస్తంగా ఉన్నది. ప్రభుత్వ అణచివేత కారణంగా ఇది ఎదగలేని స్తితిలో వున్నది. ముఖ్యమైన నాయకులు అందరూ మీరట్ కుట్ర కేసు కారణంగా జైలులో వున్నారు.

యువకుల నాయకత్వంలో పార్టీ నడుస్తున్నది. 'కమింటరన్' ఆదేశాల ప్రకారం, వారు యిచ్చే ధనంతో పార్టీ నడుస్తున్నది.'కమింటరన్'కు భారతదేశ కమ్యూనిస్టు పార్టీకి రాయ్ నాయకుడు కావడం ఇష్టంలేదు కాబట్టి  వారికి రాయ్ పట్ల వ్యతిరేక భావమున్నది. అతడితో కలవడానికి వారెవరూ సిద్ధంగా లేరు. అలాకాకుంటే భారతదేశంలోని కమ్యూ నిజమ్ గురించి రాయ్ కన్న కలలు నెరవేరే సూచన కనబడలేదు.

ఇలా ఏడు నెలలు గడిచేసరికి బెనర్జీ, డాక్టర్ మహమ్మద్ ఇలాంటి మారు పేర్లతో తిరుగుతున్న వ్యక్తి ఎం.ఎన్.రాయ్ అని తెలిసిపోయింది ! –

అరెస్టు కావడానికి ముందు రాయ్ బొంబాయి వచ్చాడు. పోలీసులు రాయ్‌ని వెదుకుతున్నారని తెలుసుకున్న రాయ్ అనుచరులు - అతడి నివాసాన్ని తరచూ మారుస్తూ వుండేవారు. ఈ బాధ్యతను సుందర్ కచాడీ, త్యాబేషేక్, మనీబెన్ కాలా, మొదలయిన రాయిస్టులు తీసుకున్నారు. ఎందరు ఎన్నివిధాల ప్రయత్నించినా చివరకు పోలీసులు రాయ్‌ని బొంబాయిలో 1931 సం॥లో జులై 21న అరెస్ట్ చేశారు.

రాయ్ అరెస్టులో వున్న నాటకీయతను 'డి.బి.కార్నిక్' అనే రాయిస్టు వివరంగా చెబుతాడు జులై 20వ తారీఖు రాత్రి అంటే రాయ్ అరెస్టు కావడానికి ముందు, రాయిస్టులందరూ ఏడోమ్‌ల్లో రోడ్‌లో వున్న డాక్టర్ ఎం.ఆర్.షెట్టి అనే రాయిస్టు ఇంటిలో సమావేశమై తమ భవిష్యత్ కార్యక్రమాల గురించి చర్చించుకుంటున్నారు. ఆ సమావేశం రాత్రి 8 గంటలకు ప్రారంభమై అర్ధరాత్రి 12 గంటల వరకూ జరిగింది.

'షెట్టి' నివాసం ముందు చాలా బహిరంగ ప్రదేశం ఉంది. ఆ బహిరంగ ప్రదేశంలో మఫ్టీలో వున్న ఇద్దరు కాన్‌స్టేబుల్స్ వున్నారు. షెట్టి నివాసానికి ఒక్కరొక్కరుగా చాలామంది రావడం వారు గమనించారు. అక్కడ ఎం.ఎన్.రాయ్ ఉండవచ్చు అని వారికి అనుమానం కలిగింది. వెంటనే ఈ సమాచారాన్ని పోలీసు కమీషనర్‌కు అందజేసారు.

రాయ్‌కి షెట్టి నివాసానికి ప్రక్కనే వున్న ఇంటిలో బస ఏర్పాటుచేశారు. సమావేశం అయిన తర్వాత, బసకు వెడుతున్న ఒక భారీ మనిషిని మసక దీపం వెలుగులో చూశారు. అతడే రాయ్ అని నిర్ధారణ చేసుకున్నారు. అర్ధరాత్రి రాయ్ తన బసకువెళ్ళడం కూడా పోలీసులు చూశారు. ఈ విషయాలన్నీ వారు పోలీస్ కమిషనర్‌కు తెలియజేశారు.

తెల్లవారుఝామున 4 గంటలకు మూడో అంతస్థులో వున్న రాయ్ ఫ్లాట్ తలుపును పోలీసులు తట్టారు. ఆ తర్వాత, గదిలో నిద్రపోతున్న రాయ్‌ని లేపి, కాన్పూర్ కుట్రకేసులో అతడిని నిందితుడుగా డిప్యూటీ పోలీస్ కమిషనర్ అరెస్టు చేశాడు.

రాయ్ అరెస్ట్ దేశంలో సంచలనాన్ని కలిగించింది. పత్రికలు ఈ వార్తను ప్రముఖంగా ప్రచురించాయి. జాతీయ నాయకులందరూ రాయ్ అరెస్ట్‌ను ఖండించారు. రాయ్ అరెస్ట్‌కు నిరసనగా బొంబాయి, కలకత్తా వంటి నగరాలలో నిరసన ప్రదర్శనలు జరిగాయి. కొన్నిచోట్ల సమ్మెలు కూడా జరిగాయి.

అరెస్ట్ అయిన వెంటనే రాయ్‌ని కాన్పూర్‌కు తీసుకువెళ్ళారు. 1924లో నమోదు అయిన కేసు ప్రకారం ఘనత వహించిన బ్రిటిష్ చక్రవర్తిని సింహాసనం నుండి దించడానికై కుట్ర చేసిన వ్యక్తులలో రాయ్ కూడా ఒక ముద్దాయి. ఈ విషయంలో జైలు శిక్ష అనుభవిస్తున్న

ముజఫర్ అహ్మద్, డాంగే, షేకర్ ఉస్మానీ, నళినీ గుప్తాలు యిచ్చిన వాఙ్మూలాలు ఇదివరకే ధృవీకరించటం జరిగింది. ఇప్పుడు రాయ్ కేసు నడవవలసి వున్నది.

రాయ్ కేసు విచారణ మామూలు కోర్టులో జరగలేదు. అతడిని బంధించిన జైలులోనే జరిగింది. కోర్టుకు తీసుకువెడితే, మధ్యలో అతడు పారిపోవడానికి అవకాశం వుందని పోలీసుల ఆలోచన. అదీగాక మామూలు కోర్టులో అతడిని విచారిస్తే కోర్టుముందు ప్రదర్శనలు జరగడం, అలజడులు జరగడం వంటి వాటికి అవకాశం వుందని కూడా వారు భావించారు.

జ్యూరీ సభ్యులు వుండే కోర్టులో తనను విచారించమని రాయ్ పెట్టుకున్న అభ్యర్థనను కోర్టు త్రోసిపుచ్చింది. అంతేకాదు ఎలాంటి నేరస్తులకు అయినా వుండే కనీస అవకాశం కూడా అతడికి లభించలేదు. తాను దోషిని కానంటూ తన వాదనను తాను చెప్పుకునేందుకు కూడా అనుమతించలేదు. (తరువాతి కాలంలో ఆనాడు తాను చెప్పదలుచుకున్న విషయాలు అన్నింటినీ వివరిస్తూ రాయ్ My Defence అనే పేరుతో ఒక పుస్తకం వెలువరించాడు.)

నామమాత్రంగా విచారణ జరిపి రాయ్‌కి 12 సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించడం జరిగింది. గతంలో ఇదేకేసులో అరెస్టు అయిన ముద్దాయిలకు కోర్టు నాలుగు సంవత్సరాలు మాత్రమే శిక్ష విధించడం గమనించదగ్గ విషయం. దీనిని బట్టి బ్రిటిష్ ప్రభుత్వానికి రాయ్ మీద ఎంతటి కక్ష వున్నదో అర్థం అవుతుంది. తనకు బెయిలు యిప్పించమని పెట్టుకున్న అభ్యర్థనను కూడా కోర్టు అంగీకరించలేదు.

శిక్ష పడిన కొన్నాళ్ల తర్వాత, రాయ్ తన శిక్షను తగ్గించమని పిటిషను పెట్టుకుంటే చివరకు దానిని అంగీకరించి, 12 సంవత్సరాల కఠిన కారాగార శిక్షను ఆరు సంవత్సరాల కఠిన శిక్షగా తగ్గించడం జరిగింది. అదికూడా జైలు సెల్‌లో ఒంటరిగా వుంచే నిర్బంధం.

ప్రభుత్వం దృష్టిలో రాయ్ అతిపెద్ద రాజద్రోహి. పోలీసులు అతడిని పట్టుకోవాలని 1915 నుంచి ప్రయత్నిస్తున్నారు. అతడిని జెయిలులో వుంచితే విద్రోహచర్యలు చెయ్యడానికి అవకాశం వుండదు అనేది ప్రభుత్వ అభిప్రాయం. ఖైదీగా రాయ్ సత్ప్రవర్తనను కలిగివుండేవాడు. అతడికి అప్పగించిన పనులన్నీ చేసేవాడు. జెయిలు వార్డర్లు, ఇతర అధికారులు, వీళ్లందరితో చాలా మంచిగా వుండేవాడు. వారు గూడా ఇతడికి వీలయినన్ని సదుపాయాలు చేస్తూ వుండేవారు.

ఈ చనువును ఉపయోగించుకుని రాయ్ తాను ఒంటరిగా జెయిలులో నిర్బంధించబడి నప్పుడు రాసిన వ్యాసాలను, పుస్తకాలను బయటకు పంపించేవాడు. అవి అన్నీ "యస్.కె. విద్యార్థి" అనే పేరుతో ప్రకటించబడేవి. రాయ్ రచించిన "మనం చెయ్యాల్సిన పని" (Our Task in Indai) వంటి పుస్తకాలు రాయిస్టులను ఉత్తేజపరిచేవి. ఇలా జైలు నుండి వచ్చినవే

"మై డిఫెన్స్" "లెటర్స్ టు ది కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ", "చైనా తిరుగుబాటు" వంటి పుస్తకాలు. జెయిలులో నుండే రాయ్ జవహర్‌లాల్ నెహ్రూకు రెండు ఉత్తరాలు రాశాడు.

తరచు వార్డర్లు మారుతూ వున్నా, రాయ్ తాను చేయదలచిన కార్యక్రమాలు చేస్తూనే వుండేవాడు. జైలులో వున్నా బయట వున్నా, అతడి తపన ఒక్కటే. కర్షక, కార్మిక,ఉద్యమాల ద్వారా భారతదేశానికి స్వతంత్రం లభించాలని.

రాయ్ కాన్పూర్ చెరసాలలో విచారణలో వున్న ఖైదీగా వున్నప్పుడు అతడికి జెయిలులో 'ఏ' క్లాస్ సెల్ ఇవ్వబడింది. అయితే శిక్ష పడిన తర్వాత, అతడిని 'ఏ' క్లాసు నుండి 'బి' క్లాస్ ఖైదీగా మార్చేశారు. రాయ్ మేథాశక్తిని, అంతర్జాతీయంగా అతడికిగల గుర్తింపును కోర్టువారు పరిగణలోనికి తీసుకోలేదు.

అతడిని కేవలం ఒక సాధారణ విప్లవవాదిగా మాత్రమే చూశారు. ఇతర దేశాలలో వున్న రాయ్ అభిమానులు దీనికి నిరసన వ్యక్తం చేసినా, ప్రభుత్వం పట్టించుకోలేదు.

'బి' క్లాసు ఖైదీగా రాయ్ నెలకు ఒక ఉత్తరం మాత్రమే రాయవలసి వుంటుంది. రాసుకోడానికి కలం, కాగితాలు దొరకడం చాలా పెద్ద సమస్య. ప్రభుత్వానికి, జైలు అధికారులకు, పదేపదే విజ్ఞప్తులు పెట్టుకున్న తర్వాత రాయ్‌కి ఒక నోట్‌బుక్, కలం, యివ్వడానికి అనుమతి లభించింది. ఆ పుస్తకం పూర్తి అయిన తర్వాత జెయిలు అధికారులకు చూపిస్తే మరొక నోట్‌బుక్ యిస్తారు. చదువుకోడానికి పుస్తకాలు ఏవీ అనుమతించరు.

అయితే వార్డర్లను 'మంచి' చేసుకుని రాయ్ స్నేహితులు అతడికి చాలా పుస్తకాలు అందజేస్తూ వుండేవారు. ఇది ఎవరికయినా తెలిస్తే, తమ పీకలమీదకు వస్తుందని వార్డర్లు మూడు పుస్తకాల కన్నా ఎక్కువ పుస్తకాలు రాయ్ దగ్గిర వుండడానికి అనుమతించే వారు కాదు. "ఇందువల్ల ప్రణాళికాబద్ధమైన పరిశోధన చెయ్యడం చాలా కష్టంగా వుండేది" అని రాయ్ తన "జ్ఞాపకాలు"లో రాసుకున్నాడు.

అయితే చరఖావడకడానికి రాయ్‌కు జెయిలు అధికారులు అనుమతించారు. ఈ విషయాన్ని గురించి తన "జ్ఞాపకాలు"లో రాస్తూ రాయ్

"ప్రపంచాన్ని రక్షించడానికి అవసరమని గాంధీజీ భావించిన చరఖాతో నూలు వడకడం ఎలాగో నేర్చుకుంటున్నాను. నేను ఇలా చెయ్యవలసి రావడం విధి విలాసం ! ఈ విషయం గాంధీజీ తెలిస్తే నామీద గెలుపు సాధించానని సంతోషిస్తాడు ! అని రాసుకున్నాడు.

వార్డర్లను "మంచి" చేసుకోవడం వల్ల వారు రాయ్‌కు కష్టమైన పనులను అప్పగించేవారు కాదు. చదువుకోడానికి, రాసుకోడానికి, అతడికి సమయం వుండేది.

తనతోబాటు జైలులో నిర్బంధించబడిన ఖైదీలతో, రాజకీయ ఖైదీలతో, రాయ్‌కి మైత్రీ సంబంధాలు వుండేవి. అందుచేత వారుకూడా రాయ్ రచించిన వ్యాసాలను, పుస్తకాలను, బయట ప్రపంచానికి అందజెయ్యడంలో సహకరించేవారు. ఇక, రాజేంద్రదత్ అనే ఖైదీ రాయ్ పట్ల మరింత అభిమానంగా వుండేవాడు. రాయ్ వివిధ అంశాలపై రాసిన వ్రాత ప్రతులను తన చేతితో మళ్లీరాసి, ఒక వేళ పట్టుబడినా అది రాయ్ చేతి వ్రాతతో లేదు కాబట్టి అతడు రాసిందని ఎవరూ అనుకోకుండా, రహస్యంగా బయటకు తరలించేవాడు.

జైలు అధికారులు రాయ్ రచనలు బయటకు వెళ్లకుండా వుండేందుకు విశ్వప్రయత్నం చేశారు. కానీ, అది ఫలించలేదు.

జైలు జీవితంలో రాయ్ ఎదుర్కొన్న మరొక ఇబ్బంది బంధువులు తప్ప మిగతా వారెవరూ కలుసుకోడానికి వీలులేకపోవడం. ఈ కారణంచేత, తన సహచరులు చాలా మందిని రాయ్ కలుసుకోలేకపోయేవాడు. అనధికారికంగా వార్డర్లు ఈ ఇబ్బందిని కొంతవరకూ తగ్గించగలిగినా, అది స్వల్పంగా మాత్రమే వుండేది.

ఈ సందర్భంలోనే 'ఎల్లెన్ రాయ్' గురించి కూడా చెప్పాలి. ఎల్లెన్ రాయ్ పూర్తి పేరు "ఎల్లెన్ గోట్ షాక్" (Ellen Got Shalk) 1936లో రాయ్ జైలు నుండి విడుదల అయ్యేవరకు భారతదేశానికి రాలేదు. విదేశాల్లో వుండి, రాయ్‌కి సహాయకారిగా వుండేది. రాయ్ జైలు నుండి విడుదల అయ్యాక 1937లో వీరిద్దరి వివాహం జరిగింది. (రాయ్‌కి మొదటి భార్య 'ఎనిలిన్'తో సంబంధాలు అతడు చైనా వెళ్లేనాటికే తెగిపోయాయి. ఎందుకు? ఎలా ? అనే విషయాలలో స్పష్టత లేదు. రాయ్ ఇద్దరి భార్యల గురించి మరిన్ని వివరాలు "అనుబంధం"లో ఇవ్వడం జరిగింది)

ఇంతకీ ఇప్పుడు తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే రాయ్‌కి కావలసిన పుస్తకాలను విదేశాల నుండి తెప్పించి అతడికి అందజేసే ఏర్పాటులో ఆమె సహకారం అపారం. రాయ్ కోరిన గ్రంథాలలో, తత్వశాస్త్ర గ్రంథాలు, విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు,నవలలు, కూడా వుండేవి. రాయ్‌కి అన్ని విషయాలనూ తెలుసుకోవాలనే కోరిక వుండేది. అందుకే అతడు వివిధ విషయాలకు చెందిన పలు గ్రంథాలు చదివేవాడు.

ఒకప్పుడు రాయ్ తనది "ఉక్కు శరీరం" అని చెప్పుకుంటూ వుండేవాడు. కాని, అంతటి ఉక్కు శరీరాన్ని దుర్భర జైలు జీవితం నాశనం చేసింది.

అన్నింటికన్నా పెద్దనరకం ఏమిటంటే చిన్న జైలు గదిలో వేసవి వేడిని భరించలేక పోవడం. ముఖ్యంగా కాన్పూర్, బరేలి చెరసాలల్లో ఈ వేడిబాధ మరింత అధికంగా వుండేది. అందుచేత–తన శరీరం వేసవివేడిని తట్టుకోలేకపోతున్నదనీ, శీతలప్రాంతాలలో వుండే చెరసాలకు తనని

మార్పించమనీ, ప్రభుత్వానికి ఎన్నో అర్జీలు పెట్టుకుంటే కొంతకాలం అతడిని 'అల్మోరా' చెరసాలలో వుంచారుగానీ వేసవి తగ్గగానే 'బరేలీ' చెరసాలకు మళ్లీ తీసుకువచ్చేసే వారు. ఆతర్వాత అతడిని 'డెహరాడూన్' చెరసాలకు తరలించారు. 1936లో రాయ్ డెహరాడూన్ చెరసాల నుండే విడుదల అయ్యాడు. జైలు జీవితంలో రాయ్ ఆరోగ్యం బాగా పాడయింది. గుండె జబ్బు వచ్చింది. ఛాతీలో నొప్పి వస్తూండేది. తరచూ జ్వరం వస్తూ వుండేది. వీటన్నింటి వల్లా అతగు శారీరకంగా బాగా బలహీనుడైపోయాడు. జైలులో వున్నప్పుడు కొన్నాళ్లు అతడిని ఆస్పత్రిలో వుంచి, మళ్ళీ జైలుకు తీసుకువస్తూ వుండేవారు.

రాయ్ అనారోగ్యం సంగతి విని చాలామంది ఖిన్నులయ్యారు. ఎందరో ప్రపంచ ప్రసిద్ధ వ్యక్తులు రాయ్‌ని చెరసాల నుండి విడుదల చెయ్యాల్సిందిగా కోరుతూ ప్రభుత్వానికి లేఖలు రాశారు. అలా రాసినవారిలో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ వంటి గొప్ప శాస్త్రజ్ఞులు కూడా వుండడం విశేషం.

రాయ్ అనారోగ్యం జవహర్‌లాల్ నెహ్రూను ఎంతగానో బాధించింది. ఉత్తరప్రదేశ్‌కు చెందిన ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు గోవింద వల్లభ పంత్‌కు నెహ్రూ ఒక లేఖ రాస్తూ - "రాయ్ ఆరోగ్యం ఏమీ బాగాలేదు. అయిదేళ్ళు ఒంటరి చెరసాల జీవితం ఎవరినయినా మానసికంగా, శారీరకంగా కృంగదీస్తుంది. అతడి విడుదల కొంత త్వరగా జరిగేందుకు మీరుగానీ, మీ స్నేహితులుగానీ, ఏమయినా చెయ్యగలిగితే సంతోషిస్తాను. రాయ్‌ని కాంగ్రెస్ నాయకులకన్నా దుర్భర పరిస్థితులో వుంచుతున్నారు" అని రాశాడు.

రాయ్‌ని ఉంచిన డెహరాడూన్ చెరసాల ఉత్తరప్రదేశ్‌కు చెందింది కాబట్టి, నెహ్రూ గోవింద వల్లభ పంత్‌కు ఉత్తరం రాశాడు. (గొప్ప త్యాగధనుడు, దేశభక్తుడు అయిన గోవింద వల్లభ పంత్ ఆ తర్వాత కాలంలో ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగానూ, కేంద్ర ప్రభుత్వంలో హెూమ్ మంత్రిగానూ పనిచేశాడు.)

ఎవరు ఎన్నివిధాల ప్రయత్నించినా, రాయ్ చెరసాల జీవితం కోర్టు విధించిన శిక్ష ప్రకారమే జరిగింది.

* * * * *

ఎం.ఎన్.రాయ్ డెహరాడూన్ జైలు నుండి 1936వ సంవత్సరము నవంబరు 26వ తేదీన విడుదల అయ్యాడు. అయిదు సంవత్సరాల నాలుగు నెలలు అతడు జైలులో వున్నాడు. (జైలు శిక్షాస్మృతి ప్రకారం సత్ప్రవర్తన గల ఖైదీలకు శిక్షలో కొంత మినహాయింపు లభిస్తుంది.)

రాయ్ జైలు నుండి విడుదల కాగానే అతడికి డెహరాడూన్ మునిసిపాలిటీ ఛైర్మన్ "కుర్‌షెజ్‌లాల్" (ఇతడు కాంగ్రెస్ పార్టీకి చెందినవాడు) స్వాగతంపలికాడు. నెహ్రూ అతడికి రాయ్‌ని నేరుగా తన యింటికి తీసుకువెళ్లమని చెప్పాడు. అంతేకాదు రాయ్ విడుదల సందర్భంగా

హడావిడి, ఆర్భాటం చెయ్యవద్దని చెప్పాడు. రాయ్ వెళ్ళాక ఆ యింటిలోనే కాంగ్రెస్‌వారు, రాయిస్టులు, రాయ్ మిత్రులు అందరూ సమావేశం అయ్యే ఏర్పాటు జరిగింది.

రాయ్ విడుదల అయ్యాడని తెలుసుకుని, పత్రికలవారు రాయ్‌ని ఒక పత్రికా విలేకరుల సమావేశం ఏర్పాటుచెయ్యమని కోరారు. కాని, రాయ్ తాను అనారోగ్యంగా వుండడంచేత, పత్రికా విలేకరుల సమావేశం ఏర్పాటు చెయ్యలేనన్నాడు. అయితే ఒక పత్రికా ప్రకటనను మాత్రం యిస్తానన్నాడు.

ఆ పత్రికా ప్రకటన సారాంశం మాత్రం ఇస్తాను

"నేషనల్ కాంగ్రెస్ పతాకం క్రింద లక్షలాదిమంది జనం ప్రజాస్వామ్యంతో కూడిన స్వేచ్ఛకోసం ఉధృతంగా పోరాడాలి. ఇందుకు ఒక ప్రణాళికాబద్ధమైన కార్యక్రమం వుండాలి. సోషలిజమా, కమ్యూనిజమా అన్నది ఇవాళ ముఖ్యంకాదు. నిజమైన సోషలిస్టులు, కమ్యూనిస్టులు దేశ స్వాతంత్ర్యంకోసం పోరాడేసమయంవచ్చిందని గ్రహించాలి. మనందరికీ నేషనల్ కాంగ్రెస్ ఒక వేదిక.

ముందు నేను లాంఛనంగా కాంగ్రెస్ సభ్యుడుగా నమోదు కావాలి. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, వేరు కాదని గ్రహించాలి. వారందరు కూడా ఈ భూమి పుత్రులేననీ, జాతీయ కాంగ్రెస్ పతాకం క్రింద దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడేవారనీ, నేను భారతదేశ ప్రజలకు తెలుపదలిచాను.

అయితే "ఇవన్నీ వెంటనే చెయ్యడానికి తగిన ఆరోగ్యం నాకు లేదు. జైలులో వుండడం వల్ల నా ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. అది బాగుపడి రాజకీయాలలో చురుకుగా పాల్గొనేందుకు కొంత సమయం పడుతుంది. ఈ ప్రకటన ద్వారా నా హృదయపూర్వక అభినందనలను కాంగ్రెస్‌వారికీ, ట్రేడ్ యూనియన్లవారికీ, రైతులకు తెలియజేస్తున్నాను"

రాయ్ ప్రకటనను పత్రికలు ప్రముఖంగా ప్రకటించాయి. అతడు చేసిన ప్రకటన అటు సోషలిస్టులను, కమ్యూనిస్టులను సంతృప్తిపరచలేదు. ఇటు కాంగ్రెస్‌వారికికూడా అనేక సందేహాలు కలిగించాయి. అతడి ప్రకటనలో మహాత్ముని ప్రస్తావన లేకపోవడం అందుకు ఒక కారణం.

ఆ తర్వాత, రాయ్‌ని బరేలీలో జరిగిన సమావేశంలో కాంగ్రెస్ సభ్యుడుగా నమోదు చేశారు. కాంగ్రెస్‌వారందరూ అతడిని హృదయపూర్వకంగా కాంగ్రెస్‌లోకి ఆహ్వానించారు. యు.పి. కాంగ్రెస్ కమిటీలోకి, అఖిలభారత కాంగ్రెస్ కమిటీలోకి, అతడిని సభ్యుడుగా చేర్చుకున్నారు.

నెహ్రూ రాయ్ ఆరోగ్యం గురించి ప్రత్యేక శ్రద్ధ చూపించేవాడు. ఆరోగ్యం కుదుట పడేవరకూ అలహాబాద్‌లోని తమ "ఆనంద భవన్"లో విశ్రాంతి తీసుకోమని కోరాడు. నెహ్రూ కోరికను అనుసరించి, రాయ్ కొన్నాళ్ళు నెహ్రూతోబాటు "ఆనందభవన్"లో వున్నాడు.

ఆ తర్వాత, 'ఫేజ్‌పూర్' కాంగ్రెస్ సమావేశం జరిగింది. ఆ సమావేశానికి నెహ్రూ అధ్యక్షుడు. దానికి రాయ్ కాంగ్రెస్ కార్యనిర్వాహక సభ్యుడుగా హాజరయ్యాడు. అంతేకాదు పెద్ద పెద్ద కాంగ్రెస్ నాయకులకోసం కేటాయించిన కుటీరాలలో ఒక దానిని నెహ్రూ ఎం.ఎన్. రాయ్‌కి కేటాయించాడు. నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో రాయ్ గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాడు. వేదికపైన రాయ్‌ని ఆసీనుడిని చేశాడు.

రాయ్ తన ఉపన్యాసంలో – ప్రజలు అధిక సంఖ్యలో కాంగ్రెస్ ఉద్యమంలోనికి చేరేందుకు ఒక ప్రణాళికను చెప్పాడు. అతడి ఉపన్యాసం కాంగ్రెస్‌లోని వామపక్షవాదులను ఎంతగానో ఉత్తేజపరిచింది. తాము కోరుకున్న విప్లవ మార్గాన్ని గురించి రాయ్ చెబుతున్నాడని వారు సంబరపడిపోయారు.

ఈ కాంగ్రెస్ సమావేశంలోనే రాయ్ మొదటిసారిగా గాంధీజీని సన్నిహితంగా చూశాడు. ఇద్దరూ అతి కొద్దిసేపు మాట్లాడుకున్నారుగాని, యిద్దరి ఆలోచనలకూ మధ్య వున్న తేడా ఇరువురికీ అర్థం అయిపోయింది. ఆ తర్వాత, గాంధీజీ రాయ్‌ని ప్రార్థనా సమావేశానికి రావలసిందిగా ఆహ్వానించాడు. కాని, రాయ్ ఆ ఆహ్వానాన్ని తిరస్కరించాడు. దానితో గాంధేయ కుటుంబంలోనికి రాయ్ వెళ్ళే మార్గం మూసుకుపోయింది. గాంధీ కాకుండా మరొక నాయకుడు కాంగ్రెస్‌కు అవసరమనే భావం (Alternative Leader Ship) రాయ్‌లో బలపడిపోయింది.

ఇంతలో 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వం రాష్ట్రాలకు ఎన్నికలు ప్రకటించింది. ఈ ఎన్నికల్లో పాల్గొనాలని కాంగ్రెస్ నిర్ణయించింది. ఎన్నికల ప్రచారంలో రాయ్ విస్తృతంగా ప్రచారం చేశాడు.

ఈ పరిస్థితుల్లో రాయ్ తన అభిప్రాయాలను వ్యక్తీకరించేందుకు ఒక పత్రిక వుంటే బాగుంటుందని అభిప్రాయపడ్డాడు. ఈ అభిప్రాయాన్ని నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ బలపరిచారు. కాని, గాంధీజీ ఇందుకు అంగీకరించలేదు. చెయ్యగలిగినపని నిశ్శబ్దంగా చెయ్యడం మంచిదని సలహా యిచ్చాడు !

కాని, గాంధీజీ సలహాను లక్ష్యపెట్టకుండా రాయ్ ఏప్రిల్ 1939లో తన సంపాద కత్వంలో "ఇండిపెండెంట్ ఇండియా" అనే ఒక వారపత్రికను ప్రారంభించాడు. జాతీయ, అంతర్జాతీయ, విషయాలపై రాయ్ అందులో నిర్మొహమాటమైన రీతిలో వ్యాసాలు రాస్తూ వుండేవాడు.

ఇలాంటి సమయంలో రాయ్‌కి ఇన్నాళ్లూ సహకరిస్తూ వచ్చిన ప్రియురాలు 'ఎల్లెన్ గోట్ షాక్' (Ellen Got Shalk) భారతదేశానికి వచ్చింది. అతడితో బాంధవ్యం కలుపకోవ డమే ఈ రాకలోని అంతరార్థం.

1937లోనే వీరిద్దరి వివాహం జరిగింది. ఆమె అతడికి కేవలం భార్యగానే మాత్రమే కాకుండా అతడి కార్యకలాపాలన్నింటిలోనూ సహచరిగా పనిచేసింది.

ఎల్లెన్ రాయ్ వచ్చిన తర్వాత, రాయ్ దంపతులు డెహ్రాడూన్‌లోని నెం.13, మోహినీ రోడ్‌లో వున్న ఒక యింటిని తీసుకుని, దానిని తమ స్థిరనివాసంగా చేసుకున్నారు.

రాయ్ ఆ యిల్లు కొనేనాటికి ఇంటి చుట్టూ వున్న పెద్ద పెరడులో చాలా దుబ్బులూ, పొదలూ వుండేవి. అదొక చిన్న అడవిలా వుండేది. ఆ యిల్లు తీసుకున్న తర్వాత రాయ్ దంపతులు చుట్టూవున్న మొక్కలను నరికి, దానినొక సుందర ఉద్యానవనంగా మార్చారు. ఆ ఉద్యానవనంలో రాయ్‌కి ఎంతో ప్రశాంతత లభించేది. ఇంతకూ ఆ ఇల్లు ఊరికి చాలా దూరంలో వుండడం ఒక కారణం.

రాయ్ ఇంటికి ఎంతోమంది రాయిస్టులూ, సామాజిక, రాజకీయ కార్యకర్తలూ, వస్తూ వుండేవారు. వారందరికీ ఆతిధ్యం ఇచ్చే బాధ్యత ఎల్లెన్‌రాయ్‌దే.

రాయ్ కాంగ్రెస్‌లో చేరడానికి ప్రధాన కారణం – దేశాన్ని విదేశీ పాలననుండి విముక్తి చెయ్యాలని మాత్రమేకాదు. అంతకు మించిన ఉన్నత లక్ష్యాలెన్నో అతడికి వున్నాయి.

దేశంలో దారిద్ర్యం అనేది లేకుండా చెయ్యడం, చెమటోడ్చి వస్తువులను ఉత్పత్తిచేసిన శ్రామికుడికే అవి చెందేలా చూడడం, కర్షకులకు – కార్మికులకు 'నిజమైన' స్వాతంత్ర్యం లభించేలా చూడడం, ప్రజలు రాజకీయ స్పృహకలిగి వుండేలా చూడడం, మొదలయినవన్నీ సాకారమైనప్పుడే – దేశానికి స్వాతంత్ర్యం లభించిందని చెప్పుకోవాలి అనేది రాయ్ దృక్పథం.

ఇది ఇలా వుండగా, కాంగ్రెస్ నాయకత్వంలో ప్రజాస్వామిక ధోరణి వుండాలిగాని, ఫాసిస్టు ధోరణి వుండకూడదు అని కూడా రాయ్ భావిస్తూ వుండేవాడు. కాంగ్రెస్‌లో వున్న వారందరూ ఎలాంటి ఆలోచనా లేకుండా, గాంధీజీని స్తుతిస్తూ ఆయన చెప్పినవాటన్నింటికీ అవుననడం రాయ్‌కి ఎంతమాత్రమూ నచ్చేదికాదు.

రాయ్ కాంగ్రెస్‌లోనికి చేరడం వామపక్ష భావాలుగల కాంగ్రెస్ వారికి ఆనందదాయక మైనప్పటికీ – ఇతర గాంధేయవాదులు మొదటినుండీ అతడిని సందేహాస్పద దృష్టితోనే చూశారు.

ఇది ఇలా వుండగా భారతదేశంలోని కమ్యూనిస్టు పార్టీ వారికి కూడా రాయ్ ధోరణి నచ్చలేదు. అతడు కాంగ్రెస్‌లోనికి చేరడం వారికి ఆగ్రహాన్ని కూడా కలిగించింది.

1938వ సంవత్సరములో జరిగిన కాంగ్రెస్ మహాసభ అధ్యక్ష ఎన్నికలో గాంధీజీ నిర్ణయానికి వ్యతిరేకంగా కాంగ్రెస్‌వారు సుభాష్ చంద్ర బోస్‌ను ఎన్నుకోవడం రాయ్‌కి చాలా ఆనందాన్ని కలిగించింది. గాంధీజీ తన అభ్యర్థిగా భోగరాజు పట్టాభి సీతారామయ్యను నిలబెట్టి,

"పట్టాభి ఓటమి నా ఓటమి" అని బహిరంగంగా ప్రకటించినా కాంగ్రెస్‌వారు సుభాష్ చంద్రబోస్‌నే ఎన్నుకొన్నారు. ఇది చూచిన రాయ్ "ప్రత్యామ్నాయ నాయకత్వానికి" (Alternative Leadership) సమయం వచ్చింది అని సంబరపడిపోయాడు.

కాని అతడు ఊహించినట్లుగా పరిస్థితులు మారలేదు. కొన్నాళ్లకు బోస్ రాజీనామా చెయ్యడం, పట్టాభి సీతారామయ్య కాంగ్రెస్ అధ్యక్షుడు కావడం జరిగి పగ్గాలు తిరిగి గాంధీజీ చేతిలోకే వచ్చాయి. ఇది రాయ్‌కి ఎంతమాత్రమూ నచ్చిన విషయంకాదు. ఇక, [illegible]దేమీ లేక, కాంగ్రెస్‌లోనే "వామపక్ష కాంగ్రెస్‌వాదుల సమాఖ్య" (League of Radical Congress men) అనునొకదానిని ఏర్పాటు చేశాడు.

అంతేకాదు 1940లో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేసి, ఓడిపోయాడు. అతడి ఉద్దేశం ఎన్నికల్లో నెగ్గాలని కాదు కాంగ్రెస్ అవలంభిస్తున్న విధానాలకు ఒక నిరసన ఉందని చెప్పడమే అతడి ఉద్దేశం.

ఆ రోజులలోనే సుభాష్ చంద్రబోస్ "ఫార్వర్డ్ బ్లాక్" అనే పేరుతో కాంగ్రెస్‌లో మరొక వర్గాన్ని ఏర్పాటు చేశాడు. అది చూచి – రాయ్ కాంగ్రెస్‌లోని వామపక్ష వర్గాలన్నింటినీ సుబాస్ చంద్రబోస్ ఏకం చెయ్యగలడని ఆశించాడు. కాని, అలాంటి ప్రయత్నం ఏదీ బోస్ చెయ్యలేదు. అదొక చీలిక వర్గం అంతే ! ఒక సందర్భంలో రాయ్ సుభాష్ చంద్ర బోస్ గురించి చెబుతూ, "బోస్‌కు భారతమాత తప్పించి, మరొకటి ఏదీ ముఖ్యం కాదు" అని అన్నాడు".రాయ్ ధోరణి అదికాదు కదా !

ఆ రోజుల్లోనే రాయ్ దేశమంతా పర్యటించి, ట్రేడ్ యూనియన్లు (కార్మిక సంఘాలు) పటిష్టం అయ్యేందుకు ఎంతో కృషిచేశాడు. అంతేకాదు ఆరోజుల్లో విద్యార్థి సంఘాలతోకూడా సన్నిహితంగా వుండేవాడు. మార్క్సిజమ్, కమ్యూనిజమ్ వంటి విషయాలపై ఉపన్యసిస్తూ వారిని ఉత్తేజపరిచేవాడు. ఏ రాజకీయ ఉద్యమమైనా విజయవంతం కావడానికి హేతువాద, శాస్త్రీయ దృక్పధాలను పెంపొందించుకోవలసిన ఆవశ్యకతను గురించి తెలియబరిచేవాడు. రాయ్ రాసిన చాలా పుస్తకాలు ఆ రోజుల్లోనే ప్రచురితమయ్యాయి. వాటిల్లో "ఫాసిజమ్", "ఇస్లామ్ చారిత్రక పాత్ర" వంటివి కూడా వున్నాయి.

రాయ్ యువకులకు ఇచ్చే సందేశాల్లో "తిరగబడండి. సంప్రదాయం మీద తిరగబడండి. అధికారం మీద తిరగబడండి. మేధాపరమైన బానిసత్వంపై తిరబడండి. వలస రాజ్య విధానంపై తిరగబడండి" అంటూ తిరుగుబాటును ప్రబోధించడమే అధికంగా వుండేది. అతడు వారికి స్వాతంత్ర్య సాధన అంటే కేవలం రాజకీయపరమైన మార్పు కాదనీ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక

పరమైన భావవిప్లవం జరిగినప్పుడే – అది సాధించబడుతుందనీ చెప్పేవాడు. పలు సామాజిక అరిష్టాలకు మూలకారణమైన మనుధర్మ శాస్త్రాన్ని దుయ్య బట్టేవాడు.

1937 జులైలో రాయ్ మద్రాసు వచ్చి, మద్రాసు రాష్ట్ర యువజన కాంగ్రెస్‌ను ఉద్దేశించి ప్రసంగించాడు. ఆ తర్వాత, ఆగస్టులో ఆంధ్రాలో పర్యటించాడు. నెల్లూరులో వ్యవసాయ కార్మికుల సభలో ప్రసంగించాడు. ఎక్కడకు వెళ్లినా రాయ్‌కు ఘన స్వాగతం లభించేది. తన పర్యటనల్లో రాయ్ ఖద్దరు లాల్చీ, ఖద్దరు పైజమా, గాంధీ టోపీ ధరించేవాడు. పొడుగైన భారీ విగ్రహం గల రాయ్ అనర్గళంగా అంతకుముందు తామెన్నడు వినని విషయాలను ఆసక్తికరంగా చెబుతూ వుంటే శ్రోతలు మంత్రముగ్ధులై వింటూ వుండేవారు.

ఆ సమయంలోనే రాయ్ పలు పత్రికా సమావేశాలుకూడా నిర్వహించాడు.

ఆంధ్రా పర్యటనలో భాగంగా రాయ్ తెనాలి, గుంటూరు, విజయవాడ, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణం, విజయనగరం వంటి నగరాలతో బాటు పలు గ్రామాలను కూడా సందర్శించాడు. ఎక్కడికి వెళ్లినా అక్కడి కాంగ్రెస్ వారందరూ అతడికి ఘన స్వాగతం పలికేవారు.

కాకినాడ పర్యటనలో రాయ్ అస్వస్థుడు అయ్యాడు. ఎల్లెన్ రాయ్ అక్కడికి వచ్చి, అతడికి శుశ్రూషలు చెయ్యవలసి వచ్చింది. కొన్నాళ్ళు తర్వాత, పర్యటన యథావిధిగా సాగింది.

ఈ పర్యటనల్లోనే రాయ్ 1938లో కలకత్తా వెళ్ళాడు. 23 ఏళ్ల తర్వాత స్వరాష్ట్రానికి వచ్చిన రాయ్‌కి హౌరా స్టేషన్‌లో ఘనస్వాగతం లభించింది. ఆ రోజు సాయంత్రం బెంగాలు రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ అతడికి పెద్ద స్వాగత సభ నిర్వహించింది. ఇలా ఆ రోజుల్లో దేశమంతా తన సందేశాన్ని వినిపిస్తూ పర్యటించాడు.

ఇంతలో ప్రపంచమంతటా యుద్ధ మేఘాలు కమ్ముకున్నాయి. చివరకు సెప్టెంబరు 1939లో యుద్ధం మొదలయింది. ఈ యుద్ధంలో నాజీ జర్మనీ, ఫేసిస్టు ఇటలీ ఒకవైపు ఇంగ్లాండ్,ఫ్రాన్స్, మరొక వైపు వున్నాయి. జర్మనీ, ఇటలీ, నియంతృత్వంలో వున్న దేశాలు. ఇంగ్లాండ్, ఫ్రాన్స్, ప్రజాస్వామ్య దేశాలు.

మొదటిలో గాంధీజీ ఈ యుద్ధంలో ఇంగ్లాండ్‌కి, షరతులతోకూడిన మద్దతు ఇవ్వాలని అభిప్రాయపడ్డారు. ఆ తర్వాత, తన అభిప్రాయం మార్చుకున్నాడు. భారతీయులతో సంప్రదించకుండా వైస్రాయ్ భారతదేశాన్ని యుద్ధంలో దింపాడు కాబట్టి, బ్రిటిష్ వారికి మద్దతు ఇవ్వడంలో అర్థంలేదని భావించాడు. రాష్ట్రాలలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వాలు పార్టీ ఆదేశం ప్రకారం రాజీనామా చేశాయి. 1942లో గాంధీజీ "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని ప్రకటించాడు.

దేశంలో జరుగుతున్న విషయాలు రాయ్‌కి ఎంతమాత్రం ఆమోదయోగ్యంగా అనిపించ లేదు. కాంగ్రెస్ పార్టీ ఈ యుద్ధ స్వరూపాన్ని సరిగా అర్థం చేసుకోలేదని భావించాడు రాయ్. ఇది ఫాజిసమ్ అనుకూల శక్తులకూ, వ్యతిరేక శక్తులకూ మధ్య జరుగుతున్న యుద్ధమని అతడి అభిప్రాయం. అందుచేత ఈ సమయంలో బ్రిటన్‌ను వ్యతిరేకించడం అంటే ఫాసిజమ్‌ను సమర్థించడమేనని అతడు భావించాడు. 'ఏ.ఐ.సి.సి.' సభ్యుడుగా (అఖిలభారతకాంగ్రెస్ కమిటీ) రాయ్ కాంగ్రెస్ అధ్యక్షుడికి ఈ విషయం వివరంగా ఉత్తరం రాశాడు. కాని, ఎవరూ రాయ్ ఉత్తరాన్ని పట్టించుకోలేదు. మహాత్ముని అభిప్రాయమే వారికి శిరోధార్యం.

1940 వచ్చేసరికి హిట్లర్ దాదాపుగా పశ్చిమ యూరోపు దేశాలన్నింటినీ జయించాడు. ఆ దేశాలకు వున్న స్వేచ్ఛను కబళించాడు. తను చెప్పినట్టు నడుచుకునే ప్రభుత్వాలనే ఆయా దేశాలలో హిట్లర్ ఏర్పాటు చేశాడు.

ఇక ఇంగ్లాండ్ ఒక్కటే మిగిలిపోయింది. దానిని కూడా హిట్లర్ కబళిస్తే, యూరోపులో "స్వేచ్ఛ" అనే మాటే వినబడదు. కాబట్టి ఫాసిజమ్‌కు ఎట్టి పరిస్థితుల్లోనూ మనుగడ వుండ కూడదు అని భావించే మేధావులు అందరూ కాంగ్రెస్ ధోరణిని వ్యతిరేకించాలని రాయ్ కోరుకున్నాడు.

ఇట్లాంటి పరిస్థితుల్లో సెప్టెంబరు 1వ తేదీన ఫ్రెంచి విప్లవం వార్షికోత్సవం వచ్చింది. ఈ సందర్భంగా ఫ్రాన్సును సమర్థిస్తూ – దేశంలో ప్రదర్శనలు జరగాలని రాయ్ ఒక కార్యక్రమం రూపొందించాడు. ఇది కాంగ్రెస్ ఆధ్వర్యంలో జరగాలని రాయ్ కాంగ్రెస్ అధ్యక్షుడికి లేఖరాస్తే, దానిని కూడా ఎవరూ పట్టించుకోలేదు. అంతేకాదు అలాంటి ప్రదర్శనలేవీ నిర్వహించవద్దని రాయ్‌కి ఆదేశం వచ్చింది.

అయినా రాయ్ తన కార్యక్రమం ప్రకారం ప్రదర్శనలు నిర్వహించాడు. దీనిని సహించలేని 'యు.పి.' (యునైటెడ్ ప్రావిన్సెస్; ఇప్పుడు ఉత్తరప్రదేశ్) కాంగ్రెస్ కమిటీ రాయ్‌ని కాంగ్రెస్ నుండి బర్తరఫ్ చెయ్యదలచింది. అలా జరగకుండా వుండాలంటే రాయ్ తనకు తానుగా రాజీనామా చెయ్యాలంది. ఇలాంటి పరిస్థితుల్లో రాయ్ తన కాంగ్రెస్ ప్రాథమిక సభ్యత్వానికి రాజీనామా చేశాడు. ఒకప్పుడు 'కమింటరన్'లో జరిగినట్టే, ఇప్పుడు కాంగ్రెస్‌లో కూడా జరిగింది.

రాయ్ జీవితంలో మరో అధ్యాయం ముగిసింది.



## 8
## రాడికల్ డెమోక్రటిక్ పార్టీ ఆవిర్భావం - మరికొన్ని వివరాలు

**ఎం.** ఎన్.రాయ్ కాంగ్రెస్‌తో విభేదించడానికి ప్రధాన కారణం అతడికి గాంధీజీ నాయకత్వంపట్ల గల విముఖతే అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

అయితే గాంధీజీ వ్యక్తిత్వంలోగల ఔన్నత్యాన్ని అతడు ఎన్నడూ శంకించలేదు. ఎంతటి గొప్ప వ్యక్తి అయినా సరే, అతడి విధానం సరయినది కాదు అని తనకు అనిపించినప్పుడు దానిని వ్యతిరేకించడానికి రాయ్ ఎన్నడూ వెనుకాడడు. గాంధీజీ విధానమే కాంగ్రెస్ విధానం కాబట్టి, అతడు కాంగ్రెస్‌తో విభేధించాడు.

రాయ్ మార్క్సిస్టు కావడంచేత, ప్రధానంగా భౌతికవాది, అన్ని తరహాల మతధోరణు లకు అతడు వ్యతిరేకి. అలాంటప్పుడు "మతపరమైన ప్రమేయం లేకుండా నేను ఏ విషయాన్నీ చెప్పలేదు" అనే గాంధీజీ (ఆయన మతధోరణి ఎంత విశాలమైనదయినా సరే) లోని ఆధ్యాత్మిక వాదాన్ని రాయ్ ఎలా సమర్థించగలడు ? గాంధీజీని దేమునిగా నమ్మి, అతడిని ఆరాధించే జాతీయ నాయకులకు "ఈ దేశానికి ఒక 'కెమల్ పాషా' కావాలి. నెత్తిమీద పిలకలను కత్తిరించేయాలి. ముఖంమీద పుస్తీలు వున్న వారిని శిక్షించాలి" అంటూ అతివాద ధోరణిలో మాట్లాడేవాడు. ఇలాంటి ఎం.ఎన్.రాయ్‌ని ఆధ్యాత్మికవాదులు అంగీకరించలేక పోవడంలో విశేషం ఏముంది?

కాంగ్రెస్‌వారికీ, రాయ్‌కీ, సరిపడకపోవడానికి మరో ముఖ్యమైన కారణంకూడా వుంది. అది ఆర్థిక అంశాలకు సంబంధించింది-భారతదేశంలో రైతులు అధికసంఖ్యలో వున్నారు కాబట్టి విప్లవం అనేది గ్రామస్థాయి నుండే ప్రారంభం కావాలనేది రాయ్ దృక్పథం. రైతుల అభ్యున్నతి అనేది కాంగ్రెస్‌వారు కూడా అంగీకరించే విషయమే కాని, రాయ్ విప్లవ ఆలోచనా సరళి వారికి నచ్చదు.

ఈ విషయాల గురించినచర్చ ఎలావున్నా, కాంగ్రెస్ నుండి రాయ్ బయటకు రాగానే ఆయన అనుచరులుగా వున్న "లీగ్ ఆఫ్ రేడికల్ కాంగ్రెస్ మెన్" కూడా బయటకు వచ్చేశారు. ఆ తర్వాత, వీరందరితోనూ రాయ్ "రేడికల్ డెమోక్రటిక్ పార్టీ" (ఆర్.డి.పి.) అనే దానిని స్థాపించాడు.

ఈ పార్టీ 'ఆవిర్భావ సమావేశం' (Inaugural Conference) బొంబాయిలో జరిగింది. ఈ పార్టీని ప్రజల పార్టీగా మార్చుదామని రాయ్ ఉద్దేశం. ఒకప్పుడు రాయ్‌కి కాంగ్రెస్‌ను ప్రజల పార్టీగా మార్చాలనే కోరిక వుండేది. కాని – అది విఫలమయ్యింది.

ఆనాటికి ప్రపంచంలో జరుగుతున్న యుద్ధం విషయంలో ఒక వ్యక్తి ఎలాంటి అభిప్రాయం కలిగివున్నాడన్న విషయాన్ని బట్టి, అతడు పురోగమనవాదా లేక తిరోగమన వాదా అనే విషయం నిర్ణయించడం జరుగుతందనేది రాయ్ అభిప్రాయం. రాయ్ ఉద్దేశంలో రెండవ ప్రపంచ యుద్ధం అనేది హిట్లర్ అనుకూల, ప్రతికూల, వర్గాల మధ్య జరుగుతున్నది అనే విషయాన్ని ఇదివరకే చెప్పుకున్నాం. కాబట్టి, బ్రిటన్ మన దేశాన్ని దోచుకుంటున్న దేశం అయినా సరే ఫాసిజంకు వ్యతిరేకంగా పోరాడుతున్నది కాబట్టి, మనం బ్రిటన్‌ని సమర్థించాలి. అలా కాకుంటే మనం తిరోగమనవాదులం అవుతాం.

ఈ వాదం ప్రకారం ఇంగ్లాండ్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ పురోగమనవాది అవుతాడు. యుద్ధ సమయంలో బ్రిటన్‌ను వ్యతిరేకిస్తూ ఉద్యమాలు నిర్వహించిన గాంధీ, నెహ్రూ వంటి మహా నాయకులు తిరోగమనవాదులవుతారు. ఫాసిజమ్‌కు అనుకూలురవుతారు. ఇలాంటి వాదాన్ని గాంధీజీ వాక్కు దేవవాక్కు అని భావించే ప్రజలు ఎలా ఆమోదిస్తారు ?

తన ఆలోచనలకు వ్యతిరేకం అయిన కాంగ్రెస్‌నూ, కాంగ్రెస్ నాయకులను రాయ్ తీవ్ర పదజాలంతో దూషించేవాడు. దీనివలన అతడికి ఖ్యాతి రావడానికి బదులుగా అపఖ్యాతి లభించింది. దీనిని రాయ్ గ్రహించినా, ఒక్క అడుగుకూడా వెనుకకు వెయ్యలేదు. ఇదే రాయ్‌లోని విలక్షణత. ఎదుటి వ్యక్తులు తాను చెప్పింది అంగీకరించినా, అంగీకరించక పోయినా పొగిడినా, తెగిడినా స్వేచ్ఛగా తాను చెప్పాలనుకున్నది చెప్పడం రాయ్‌లోని ప్రత్యేకత.

"భారతదేశము–యుద్ధము" (India and War) అనే పుస్తకంలో రాయ్ ఇలా చెబుతాడు

"మనం ఫాసిజిమ్ ఓడిపోవాలని కోరుకోవాలి. ఎందుకంటే మనం విప్లవకారులం కాబట్టి. ఫాసిజమ్ ఓడిపోతే, సామ్రాజ్యవాదం బలహీనపడుతుంది. ఫాసిజమ్ విజయవంతం అయితే ఏమవుతుందో ఒక్క క్షణం ఆలోచించండి. అప్పుడు ప్రపంచంలో జరిగే విప్లవాలన్నీ క్రూరంగా అణచివేయబడతాయి. భారతదేశానికి స్వతంత్రం రావడం అసాధ్యమైపోతుంది. ఇది మనం కోరుకోకూడదు. దాని నాశనానికి చెయ్యాల్సిన చర్యలన్నీ చెయ్యాలి. బ్రిటిషువారు మనలను పెట్టిన బాధలు ఎలావున్నప్పటికి ప్రపంచ యుద్ధం విషయంలో వారికి మద్ధతు ఇవ్వాలి. స్వాతంత్ర్య సమరయోధులందరూ బ్రిటిష ప్రజాస్వామ్యంతో సహకరించాలి"

ఈ విషయాలన్నింటి గురించి చెబుతూ 'వి.బి.కార్నిక్' తాను రచించిన "ఎం.యన్. రాయ్" అనే పుస్తకంలో రాయ్ అభిప్రాయాలతో ఒక్క జవహర్‌లాల్ నెహ్రూ తప్ప రాజకీయ నాయకులెవరూ ఏకీభవించలేదు. కానీ, అతడు గాంధీజీ నిర్ణయాలకు వ్యతిరేకంగా ఏమీ చెయ్యలేదు – అని రాశాడు.

ఆరోజుల్లో విజయం తర్వాత విజయంతో హిట్లర్ దూసుకుపోతున్నాడు. హిట్లర్ పాదాలకు యూరోప్ మోకరిల్లుతున్న చీకటి దినాలవి.

ఈ పరిస్థితులను గురించి చెబుతూ రాయ్ Whither Europe ? అనే పుస్తకం రాశాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ విజయాన్ని సాధిస్తే, భారతదేశానికి బ్రిటిష్ ప్రభుత్వ పాలన తొలగిపోయి, జర్మన్ ఫాసిస్టు ప్రభువుల పాలన మొదలవుతుంది. ఒకసారి ఫాసిస్టు ప్రభుత్వం గద్దెనెక్కిన తర్వాత అతడిని గద్దెదించడం చాలా కష్టం. ఒక నియంత అధికారానికి లోబడి బ్రతకడం మాత్రమే జరుగుతుంది.

ఇక "భారతదేశము – యుద్ధము" (India and War) అనే గ్రంథంలో రాయ్ ఇలా అంటాడు "ఫాసిజమ్ విజయవంతం అయితే భారతదేశంతో సహా ప్రపంచ రాజ్యాలన్నీ కుక్కలపాలవుతాయి. ప్రపంచ దేశాలన్నీ అనాగరిక, ప్రాంత పాలనకు బలి అవుతాయి."

ఇలాంటి అభిప్రాయాలనే రాయ్ తన రచనలన్నింటా వ్యక్తం చేస్తాడు.

ఆ సమయంలో దేశమంతటా గాంధీజీ నాయకత్వంలో బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమాలు జరుగుతున్నాయి. రాయ్ ధోరణి ఇలా వున్నది.

మొదటిలో బ్రిటిష్ ప్రభుత్వం రాయ్‌ని అనుమానించిందిగాని, క్రమక్రమంగా అనుమానాన్ని తగ్గించుకున్నది. అంతేకాదు రాయ్‌వల్ల తమకు ప్రయోజనం వుంటుంది అనికూడా భావించింది. ఒక దశలో రాయ్‌ని వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సభ్యుడుగా తీసుకుంటారనే వదంతికూడా వ్యాపించింది. అందుచేత రాయ్ ఎన్ని ప్రతిఘటనలు ఎదురయినా తన భావాలను నిస్సంకోచంగా ప్రచారం చేస్తూ వుండేవాడు.

ప్రపంచ యుద్ధం ప్రారంభమైన మొదట్లో హిట్లర్ రష్యా జోలికి పోడనే అందరూ భావించారు. కాని, రాయ్ మాత్రం హిట్లర్ రష్యాను వదిలిపెట్టడు అనే చెబుతూ వచ్చాడు. చివరగా జూన్ 1941 నాటికి రాయ్ జోస్యమే నిజమైంది. 1941 జూన్‌లో జర్మనీ రష్యాపై యుద్ధం ప్రకటించింది.

1942 ప్రారంభంలో భారతదేశంపైన కూడా యుద్ధ మేఘాలు అలుముకున్నాయి. మద్రాస్, కలకత్తా వంటి ప్రాంతాలలో బాంబింగు జరిగింది. తమమీద పడుతున్న యుద్ధం నుండి రక్షించుకోడానికి ప్రభుత్వం దగ్గిర తగిన ప్రణాళికలేదు. ఏంచెయ్యాలో తెలియని స్థితి.

ఇలాంటి సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశానికి "క్రిప్స్" రాయబారాన్ని పంపింది. ఈ రాయబారం ప్రధాన లక్ష్యం కాంగ్రెస్‌వారినీ, ముస్లిమ్‌లీగ్‌నూ మంచి చేసుకుని యుద్ధ సమయంలో బ్రిటన్‌కు భారతీయులు సానుకూలంగా వుండేటట్లు చేయడం.

క్రిప్స్ రాయబారంలో యుద్ధానంతరం భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తిని ఇవ్వడానికి బ్రిటన్ అంగీకరించిందని చెప్పడం జరిగింది. అయితే క్రిప్స్ రాయబారంలోని కుటిలత్వాన్ని గ్రహించిన కాంగ్రెస్ ఈ రాయబారాన్ని అంగీకరించలేదు. ఈ రాయబారంలో చెప్పబడిన అంశాలను ఎద్దేవా చేస్తూ గాంధీజీ "ఒక దివాళా కొట్టబోతున్న బేంక్ ఆతర్వాతి కాలంలో చెల్లు బాటయ్యేటట్టుగా యిచ్చిన చెక్కులా వుంది ఈ రాయబారం" అని అన్నారు

అంతేకాదు తాము అంతకుముందునుండీ చేస్తున్న సహాయ నిరాకరణోద్యమాన్ని ఉధృతం చేస్తూ 1942వ సంవత్సరము ఆగస్టు 9వ తేదీన కాంగ్రెస్ "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభించింది.

ఇది రాయ్‌కి ఎంతమాత్రమూ నచ్చలేదు. "దేశ రక్షణ అనేది చాలా ముఖ్యమైన విషయం. దేశం ప్రమాదకర పరిస్థితిలో వున్నప్పుడు ఇలాంటి ఉద్యమాలు చేపట్టడం చాలా ఘోరమైన విషయం" అని ప్రకటన ఇచ్చాడు.

గాంధీజీ యిచ్చిన "క్విట్ ఇండియా" (ఇండియాను విడిచిపెట్టి వెళ్లండి) అనే పిలుపు దేశమంతటా, వాడవాడలా ప్రతిధ్వనిస్తున్న రోజులవి. ఇది తెల్లదొరలపై జరుగుతున్న ఆఖరి పోరాటం అని భావించి, ప్రజలందరూ సమరోత్సాహంతో ఉద్యమంలో పాల్గొంటున్న సమయంలో రాయ్ ఇలా అనడం వారికి ఆగ్రహాన్ని తెప్పించింది.

రాయ్ భావాలను అనుసరించేవారిని చితకబాదడం, వాళ్లపై రాళ్లు వెయ్యడం ఇలాంటి సంఘటనలు పలు ప్రాంతాలలో జరిగాయి.

అయినా రాయ్ వెనక్కు తగ్గలేదు. తన భావాలను తెలియజెప్పే ఉద్దేశంతో బహిరంగ సభలు నిర్వహించాడు. వాటిని కాంగ్రెస్‌వారు భగ్నం చెయ్యడానికి చూచినా అతడు జంకలేదు. ఇలా పట్టువిడవకుండా రాయ్ చేస్తున్న పనినిచూచి, బ్రిటిష్ ప్రభుత్వం మెచ్చుకుని, అతడికి నెలకు 13,000 రూ. ఆర్థిక సహాయం చేసింది. (చూ.వి.బి.కార్నిక్ ఎం.ఎన్.రాయ్) ఈ సహాయం రెండేళ్ళపాటు కొనసాగిందని "కార్నిక్" తన పుస్తకంలో రాశాడు. రాయ్ తనకు బ్రిటిష్ ప్రభుత్వం చేస్తున్న ఆర్థిక సహాయానికి సంబంధించి, ప్రతి పైసాకు ప్రభుత్వానికి లెక్కచూపించేవాడు. ఇది వాస్తవమే అయినప్పటికీ అలా బ్రిటీష్ వారి దగ్గిరనుండి డబ్బు తీసుకొనడం చాలా తప్పు అంటూ రాయ్ విమర్శకులు తీవ్రంగా విమర్శించారు.

1942 చివరకు వచ్చేసరికి, హిట్లర్ ఓడిపోక తప్పదని స్పష్టం అయిపోయింది. దీని ఫలితంగా భారతదేశానికి స్వతంత్రం రాకతప్పదని రాయ్ ఉద్దేశం.

అందుచేత అతడు స్వతంత్ర భారతదేశంలో రాజకీయ వ్యవస్థ ఎలా వుండాలి, ఆర్థిక వ్యవస్థ ఎలా వుండాలి అనే విషయాల గురించి ఆలోచించడం ప్రారంభించాడు.

అప్పట్లో అతడు "ఇండిపెండెంట్ ఇండియా" అనే పత్రికను నడుపుతూ వుండేవాడు. అందులో అతడు ఈ విషయాలకు సంబంధించిన ఎన్నో వ్యాసాలు రాశాడు. అంతేకాదు "భారతదేశ రాజ్యాంగం" అనే విషయంపై ఒక గ్రంథం రాశాడు. స్వతంత్ర భారతదేశం రష్యావలె దేశ ఆర్థికాభివృద్ధికి ప్రణాళికా విధానాన్ని అవలంబించాలని భావించాడు. అతడి అనుచరులు జి.డి.పారిఖ్(G.D.Parikh), వి.ఎం.తార్కుండే (V.M.Tarkhunde), బి.ఎన్.బెనర్జీ (B.N.Banerjee), రాయ్ భావాలకు అనుగుణంగా భారతదేశంలో అమలుపరచాల్సిన "పదేళ్ళ ప్రణాళిక" (Ten years plan) ను రూపొందించారు. (అప్పట్లో రష్యాలో పదేళ్ల ప్రణాళికలు వుండేవి. అందుచేత మన దేశంలో కూడా పదేళ్ల ప్రణాళికలు వుండాలని రాయ్ భావించాడు) రాయ్ అనుచరులు రూపొందించిన ప్రణాళికను "ప్రజా ప్రణాళిక" (పీపుల్స్ ప్లాన్) అని చెప్పడం జరిగింది. ఈ ప్రణాళిక 1944-54 సంవత్సరాల మధ్యగల పదేళ్ల కాలంలో అవలంబించవలసిన ఆర్థిక వ్యూహాన్ని గురించి చెబుతుంది.

ఈ ప్రణాళికలో ప్రథమ ప్రాధాన్యత వ్యవసాయరంగానికుంటుంది. సామాజిక సేవలకు కూడా అధిక ప్రాధాన్యత వుంటుంది. ద్వితీయ ప్రాధాన్యత పారిశ్రామిక రంగానికి వుంటుంది. ఇందులో కూడా చిన్నతరహా మధ్యతరహా పరిశ్రమలకు అధిక ప్రాధాన్యత వుంటుంది.

"పీపుల్స్ ప్లాన్" వెలువడిన రోజుల్లోనే బొంబాయిలోని పెట్టుబడిదారీ దృక్పథంగల కొందరు అర్థశాస్త్రవేత్తలుకూడా పారిశ్రామిక వేత్తల ప్రోద్బలంతో 'బొంబాయి ప్రణాళిక' అనే పేరుతో మరో ప్రణాళికను రూపొందించారు. ఈ ప్రణాళిక పారిశ్రామిక రంగానికి, ప్రత్యేకించి పెద్దతరహా పరిశ్రమలకూ ప్రాధాన్యత ఇస్తుంది. ఆ తర్వాతే వ్యవసాయ రంగం.

ఇలా-ఎందరుఎన్ని దేశాల ప్రణాళికల గురించి ఊహించినా, వీరు ఊహించినట్టుగా 1944లో స్వతంత్రం రాలేదు. స్వతంత్రం ఇవ్వడంలో అనేక రాజకీయమైన చిక్కుముడులు వున్న కారణంగా వాటినన్నింటినీ విప్పుకున్న తరువాత 1947కు గాని, స్వతంత్రం రాలేదు. 1951 నాటికి గాని, మనదేశంలో ప్రణాళికా యుగం ప్రారంభంకాలేదు. మనదేశంలో రాయ్ కోరుకున్నట్టుగా దశవర్ష ప్రణాళికలుగాక, పంచవర్ష ప్రణాళికలు ప్రారంభమయ్యాయి.

అయితే అంతకు ముందు జరిగిన కథ కొంచెం చెప్పాలి.

1945 వచ్చేసరికి భారతదేశానికి స్వతంత్రం ఇచ్చేదిశగా బ్రిటిష్ ప్రభుత్వం సన్నాహాలు ప్రారంభించింది. ఈ పరిస్థితుల్లో, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు 1945–46 మధ్య ఎన్నికలను నిర్వహించారు. ఎన్నికల్లో వున్నవి ప్రధానంగా రెండే పార్టీలు ఒకటి భారత జాతీయ కాంగ్రెస్, రెండోది ముస్లింలీగ్. ఇలాంటప్పుడు, ఎం.ఎన్.రాయ్ తన రేడికల్ డెమోక్రటిక్ పార్టీని కూడా ఎన్నికల్లో నిలబెట్టాడు.

రాడికల్ డెమోక్రటిక్ పార్టీ ఎన్నికల సభల్లో రాయ్ గాంధీజీని తీవ్రంగా విమర్శించేవాడు. ఇది ఎంతమాత్రమూ సహించలేని ప్రజలు సభల్లో చాలా అల్లరిచేసేవారు. రాడికల్ డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థులను చితకబాదేవారు. ఇదంతాచూచి రాయ్ ఈ ఎన్నికలు "హిట్లర్ ఎన్నికలు" అనేవాడు.

చివరకు రాయ్ తన పార్టీ తరఫున నిలబెట్టిన అభ్యర్థులందరూ ఎన్నికల్లో చిత్తుగా ఓడి పోయారు. అయితే రాయ్‌పై సానుభూతిగల బ్రిటిష్ ప్రభుత్వం రాయ్‌కి సంబంధించిన "ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్" అధ్యక్షురాలు "మనీబెన్‌కారా"ను కేంద్ర శాసనసభకు శ్రామికవర్గ ప్రతినిధిగా నామినేట్ చేసింది.

అ పరిస్థితులన్నింటినీ చూచి రాయ్1946లో రాజకీయాల నుండి తప్పుకున్నాడు. "రాజకీయాల నుండి విరమించి, నేను చెయ్యదగ్గ పనిని చెయ్యదలుచుకున్నాను" అని ప్రకటించాడు. తాను స్థాపించిన రాడికల్ డెమోక్రటిక్ పార్టీ'ని రద్దుచేశాడు.

అతడు "చెయ్యదగ్గపని" – ఒక తాత్విక సిద్ధాంతానికి రూపకల్పన చెయ్యడం. సెప్టెంబరు 1946లో రాయ్ డెహరాడూన్‌లో 'నవ్య మానవవాదం' (New Humanism or Radical Humanism) అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, తత్వవేత్తగా మారాడు. అతడి సిద్ధాంతానికి అంతర్జాతీయ ప్రఖ్యాతి లభించింది.

దీనిని గురించి మరో అధ్యాయంలో ముచ్చటించుకుందాం.



# 9
# మార్క్సిజమ్ - ఎం.ఎన్.రాయ్

ప్రపంచం మొత్తంమీద మేధావుల ఆలోచనలను అత్యధికంగా ప్రభావితం చేసిన సిద్ధాంతాల్లో మార్క్సిజం ప్రముఖమైంది. "కారల్ మార్క్సు" (1818–1883) సిద్ధాంతాల సారాంశాన్ని 'మార్క్సిజం' అని వ్యవహరిస్తూ వుంటారు.

మార్క్సిజం అనే మాటను వివరిస్తూ ఎం.ఎన్.రాయ్ "పంతొమ్మిదవ శతాబ్దంలో ముఖ్యంగా ఐరోపా ఖండంలో వున్న అభివృద్ధిచెందిన దేశాల్లో వున్న పెట్టుబడిదారీ విధానాన్ని పరిశీలించి, మార్క్సు కొన్ని సిద్ధాంతాలను రూపొందించాడు. అవే 'మార్క్సిజం' పేరుతో కమ్యూనిజానికి, కమ్యూనిస్టు పార్టీలకు మార్గదర్శకమయ్యాయి –" అని అన్నాడు.

ఈ సిద్ధాంతాల ప్రభావంతో రష్యాలో విప్లవం జరిగింది. లెనిన్ ఆధ్వర్యంలో ప్రపంచం మొత్తంమీద మొదటి కమ్యూనిస్ట్ పార్టీ ప్రభుత్వం ఏర్పాటయింది. ఆ తర్వాత, ప్రపంచం రెండు భాగాలుగా విడిపోయింది. ఒకటి – మార్క్సిజమ్‌ను అనుసరించే దేశాలు, రెండోది పెట్టుబడిదారీ విధానం అమలులో వున్న దేశాలు. (కొంత కాలం అయిన తర్వాత కథ మారిపోయిందనుకోండి – అది వేరే విషయం)

1883వ సంవత్సరం మార్చి 14వ తేదీన తన పుట్టిన రోజుకు కొద్ది వారాల ముందు మార్క్సు మరణించినప్పుడు అతడికి తుది వీడ్కోలు పలకడానికి స్మశానవాటికకు పది పన్నెండు మంది మించి రాలేదు. కాని, ఆ తర్వాతి కాలంలో మార్క్సు సిద్ధాంతాలు ప్రపంచ మంతటా అలజడిని రేపి మార్క్సును చిరంజీవిని చేశాయి. ఒక విధంగా చెప్పాలంటే మరణించిన తర్వాతే మార్క్సు జీవించాడు.

మే 5,1818వ సంవత్సరంలో జర్మనీలోని యూదు (JEW) వంశంలో మార్క్సు జన్మించాడు. అయితే అతడి తల్లిదండ్రులు క్రైస్తవ మతం స్వీకరించారు. యూదులుగా ఉండే దానికంటే క్రైస్తవులుగా మారితేనే ఎక్కువ గౌరవాన్ని పొందగలమని వారి ఉద్దేశం.

కారల్ మార్క్సు పెద్దవాడయిన తర్వాత, జర్మనీలో ప్రసిద్ధిచెందిన 'బాన్' (Bonn) విశ్వ విద్యాలయంలో న్యాయశాస్త్ర పట్టభద్రుడయ్యాడు. ఆ తర్వాత 'జెనా(Jena) విశ్వవిద్యా లయంలో పరిశోధక విద్యార్థిగా చేరి, 1841లో తాను సమర్పించిన పరిశోధక వ్యాసానికి (Thesis) డాక్టరేట్ పట్టాను పొందాడు. డెమోక్రటస్ (Democratus) తత్వశాస్త్రానికీ, ఎపిక్యూరస్ (Epicurus) మధ్యగల తేడాను వివరించే తత్వశాస్త్రానికి సంబంధించిన సిద్ధాంత వ్యాసమిది.

అతడు పొందిన డాక్టరేట్ పట్టా ఏ విశ్వవిద్యాలయంలోనయినా ఆచార్య వృత్తిని చేపట్టడానికి ఉపకరిస్తుంది. అతడికిగల న్యాయశాస్త్ర పట్టా న్యాయవాద వృత్తిని చేపట్టడానికి ఉపకరిస్తుంది. అభ్యుదయ భావాలుగల మార్క్స్ ఈ రెండు పనులలోనూ ఇమడలేక పోయాడు.

తత్వశాస్త్రవేత్త హెగెల్ (Hegel) శిష్యుడు నిర్వహించే ఒక పత్రికలో వ్యాసాలు రాస్తూ వుండేవాడు. ఆనాటి ప్రష్యన్ ప్రభుత్వపు తిరోగమన, నియంతృత్వ, ధోరణులను విమర్శిస్తూ అందులో ఘాటయిన వ్యాసాలు రాస్తూ వుండేవాడు.

ఆ తర్వాత, పేరిస్‌కు వెళ్లాడు. అక్కడే అతడికి జీవితకాలం ఆప్తమిత్రుడుగా వున్న 'ఫ్రెడరిక్ ఎంగెల్స్' (Friedrich engles) పరిచయం అయ్యాడు. మార్క్స్ కొన్నాళ్లు అక్కడ వుండి, ఆ తర్వాత లండన్ వెళ్ళిపోయిన తర్వాత కూడా, ఈ బంధం కొనసాగడమే కాకుండా – మరింత బలపడింది.

లండన్‌లో మార్క్స్ తన కాలమంతా పరిశోధనతోటే గడిపాడు. ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలయాలలో ఒకటయిన బ్రిటిష్ మ్యూజియమ్ గ్రంథాలయంలో పుస్తకాలను మధించి ఒక సిద్ధాంతాన్ని రూపొందించడానికి కావలసిన సరంజామాను తయారు చేస్తున్నాడతడు. మార్క్స్ చేస్తున్న ఈ యజ్ఞానికి ఎంగెల్స్ ఎంతో తోడ్పాటు నిస్తూ వుండేవాడు. మార్క్స్ పరిశోధనా వ్యాసంగంలో మునిగి తేలుతూ వుంటే, సంసారం గడవడానికి మార్గం వుండదు కాబట్టి దానికి కావలసిన ఆర్థిక సహాయాన్ని కూడా ఏంగెల్స్ చేస్తూ వుండేవాడు.

వీరిద్దరి సంయుక్త కృషితో–అపూర్వ సంచలనాన్ని సృష్టించిన "కమ్యూనిస్ట్ పార్టీ మానిఫెస్టో" వెలువడింది. ఆ తర్వాత, మార్క్స్ బృహత్ గ్రంథం "కేపిటల్" మూడు వాల్యూములుగా వెలువడింది. ఈ రెండు పుస్తకాలూ–ప్రపంచ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, రంగాలలో చేసిన అలజడి అసామాన్యమైంది.

1848లో ప్రచురించబడిన "కమ్యూనిస్టు పార్టీ మానిఫెస్టో"లో మార్క్స్, ఎంగెల్స్ ఇలా అంటారు.

"ఇప్పటివరకూ జరిగిన మానవజాతి చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర..... కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలను, భావాలను దాచుకోవడానికి యిష్టపడరు. వర్తమాన సాంఘిక వ్యవస్థను బలప్రయోగంతో పడగొడితేనే తమ ఆశయాలు నెరవేరడానికి వీలవుతుందని వారు బహిరంగంగా ప్రకటిస్తారు.

కమ్యూనిస్టు విప్లవంపట్ల భయంతో పాలకవర్గాలు వణికిపోవాలి. కార్మికులకు పోయేదేమీ లేదు సంకెళ్లు తప్ప. ఇక క్రొత్త సామ్రాజ్యం వారిదే అవుతుంది. ప్రపంచ కార్మికులారా ఏకంకండి".

"కమ్యూనిస్ట్ పార్టీ మేనిఫెస్టో"లోని కొన్ని ప్రపంచ ప్రసిద్ధ వాక్యాలనే ఇక్కడ నేను ఉదహరించాను. ఈ వాక్యాలన్నీ ఆలోచనాపరులకు సుపరిచితాలే.

ఇక మార్క్సు రచించిన "కేపిటల్" మూడు వాల్యూములూ మొదట జర్మన్ భాషలో వచ్చాయి కానీ, ఆ తర్వాత ప్రపంచ భాషన్నింటిలోకీ అనువదించబడ్డాయి. అయితే ప్రథమ అనువాదం రష్యన్ భాషలో వచ్చింది.

మార్క్సు తాను కలలుగన్న విప్లవరాజ్య స్థాపన పారిశ్రామిక రంగం అధికంగా వున్న ఇంగ్లాండ్‌లో మొదట జరుగుతుందనుకున్నాడు. కాని, మార్క్సు ఎంగెల్స్‌ల ఊహకు అతీతంగా వ్యావసాయిక దేశం, వెనుకబడిన దేశం, క్రూరమైన జార్ ప్రభువుల పాలనలో అణగారిపోయిన దేశం, రష్యాలో కమ్యూనిస్ట్ విప్లవం ఆవిష్కరించబడింది.

నిజానికి మార్క్సుతోనే "సోషలిజమ్" అనే భావన ప్రారంభంకాలేదు. అయితే అంతకు ముందు వున్న భావనలకూ మార్క్స్‌కూ చాలా తేడా వుంది.

మార్క్సు తత్వవేత్త హెగెల్ భావాల వలన ప్రేరితుడయినప్పటికీ హెగెల్‌వలె అతడు భావము (Idea) అనేదానికీ, భావవాదము (Idealism) అనేదానికీ ప్రాధాన్యతను ఇవ్వలేదు.

హెగెల్ ప్రతిపాదించిన గతితార్కిక విధానమునకు మాత్రమే ప్రాధాన్యతను ఇచ్చాడు. అందులోనూ–భౌతిక శక్తులకు మాత్రమే ప్రాధాన్యతను ఇస్తూ "గతి తార్కిక భౌతికవాదం" అనే విధానాన్ని అనుసరించాడు. ఈ విధానం ప్రకారం ప్రతి వస్తువులోనూ రెండు విరుద్ధమైన శక్తులుంటాయి.

ఒకటి ధనాత్మక లక్షణం గలది. మరొకటి దానికి విరుద్ధమైన 'నెగిటివ్' లక్షణం గలది. ఒకటి స్వభావం వృద్ధి చెందడానికి ప్రయత్నిస్తుంటే మరొకటి దానిని ఆటంకపరుస్తూ వుంటుంది. ఈ రెండు వ్యతిరేక శక్తుల మధ్యా పోరాటం అనివార్యమవుతుంది. ఈ సంఘర్షణ మొదట మామూలు స్థాయిలో వుండి, ఆ తర్వాత తీవ్రమవుతుంది. ఈ తీవ్ర సంఘర్షణలో నశించిపోతున్న శక్తి మీద వృద్ధిచెందుతున్న శక్తి విజయం సాధిస్తుంది. అదే మహావిప్లవం. ఆ మహావిప్లవం నుండే ఒక నూతన వ్యవస్థ ఆవిర్భవిస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని పరస్పర విరుద్ధ శక్తుల మధ్య సంఘర్షణ విజృంభించి, ఆ వ్యవస్థను నాశనం చేస్తాయని మార్క్సు జోస్యం చెప్పాడు. మార్క్సు చెప్పిన విషయాలు ఇరవయ్యో శతాబ్దంలో ఆలోచనాపరులందరినీ ఆకట్టుకున్నాయి. కార్యోన్ముఖులను చేశాయి. కాలక్రమంలో "మానవులు తమ చరిత్రను తామే నిర్మించుకుంటారు" అన్న మార్క్సు పలుకులు నిజమయినాయి.

* * * * *

అమెరికాలో వుండగా ఎం.ఎన్.రాయ్ మార్క్సు భావాలవల్ల ఆకర్షితుడై నిబద్ధత గల కమ్యూనిస్టుగా మారాడనే విషయం ఇదివరకటి అధ్యాయాల్లోనే చెప్పుకున్నాం. ఈ నిబద్ధతే అతడిని లెనిన్ వంటి మహా నాయకుడికి ఆత్మీయుని చేసింది.

అయితే భారతదేశం తిరిగి వచ్చాక, క్రమక్రమంగా అతడి ఆలోచనల్లో మార్పు వచ్చింది. కమ్యూనిస్ట్ పార్టీ విధానాలలోను, మార్క్సు సిద్ధాంతంలోను వున్న బొమ్మా, బొరుసుల గురించి ఆలోచించడం ప్రారంభించాడు.

"మార్క్సిజం ప్రకారం వర్గానికున్నంత ప్రాముఖ్యం సంఘంలోని వ్యక్తులకు ఇవ్వబడ లేదు. మార్క్సు చరిత్రలో ప్రతిదానికి వర్గమే ప్రధానం అన్నాడు. మానవ సంఘంలో జరిగే ప్రతి చిన్న విషయానికీ, పెద్ద విషయానికీ, మార్క్సు వర్గ దృష్టితోనే అర్థం చెప్పసాగాడు" అని విమర్శించాడు రాయ్ "మార్క్సిజం" అనే వ్యాసంలో. (రాయిస్టు వ్యాసాలు : అనువాదం : కోగంటి రాధా కృష్ణమూర్తి)

"ప్రతిదానికీ వర్గాన్ని ముడిపెడుతూ వుంటే యదార్థ పరిస్థితులు తెలుసుకోలేము. వ్యక్తి ప్రాముఖ్యతకు, వ్యక్తి స్వాతంత్ర్యేచ్ఛకు, స్వతంత్ర భావాలకు, యివ్వవలసిన ప్రాధాన్యం మార్క్సిజం ఇవ్వలేదు. కాని, గతచరిత్రలో వర్గంకంటే వ్యక్తులే ప్రధానపాత్ర వహించినట్లు కనబడుతుంది" అన్నాడు రాయ్.

అంతేకాదు "ఫ్రెంచి విప్లవానికి ప్రజలను చైతన్యపరచిన – రూసో, వోల్టేర్ వంటివారు శ్రామికులు కాదు. పెట్టుబడిదారీ వర్గానికి చెందినవారుకూడా కాదు. కమ్యూనిజమ్‌కు పునాది వేసిన కారల్ మార్క్సు శ్రామికుడు కాదు, రష్యా విప్లవానికి నాయకత్వం వహించిన లెనిన్ శ్రామికుడు కాదు. ప్రజలను చైతన్య పరచిన వారిలో గ్రంథకర్తలు, శాస్త్రజ్ఞులు, మొదలయిన వారు కూడా వుంటారు. వీరు ఏ వర్గానికీ చెందినవారు కాదు" అంటూ రాయ్, మార్క్సు సిద్ధాంతంలోని వర్గ పోరాట విషయాన్ని విమర్శించాడు.

ఇంతటితో ఆగకుండా "ఫాసిజం జాతిపేర మానవుని దాస్యంలో నొక్కిపెడుతూ వుంటే కమ్యూనిజం వర్గం పేరుతో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికడుతుంది" అని అనడానికి గూడా రాయ్ వెనుకాడలేదు.

మార్క్సు ఆలోచనలను విమర్శిస్తూ – రాయ్ మరొక మాటకూడా అన్నాడు.

"కారల్ మార్క్సు సిద్ధాంతం ప్రకారం విప్లవం అనేది పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన జర్మనీ వంటి దేశాలలో రావలసి వుంది. 'రోజ్ ఎగ్జంబర్గ్' వంటి వారు నాయకత్వం వహించినా, ఆ దేశంలో కార్మిక విప్లవం రాలేదు. ఆ దేశంలోని కార్మిక వర్గం విప్లవపాత్ర వహించలేకపోవడం వల్ల దేశంలో కార్మిక విప్లవం రాలేదు. అంతేకాదు ఆదేశంలో కమ్యూనిజమ్‌కు బదులుగా 'ఫాసిజం' వచ్చింది.

జర్మనీలోనే కాదు యూరోపులోని ఇతర పారిశ్రామిక దేశాల్లోకూడా కార్మిక విప్లవం రాలేదు. ఆ దేశాలన్నింటికన్నా వెనుకబడి, జార్ ప్రభువుల భూస్వామ్య జమీందారీ వ్యవస్థలో

భూస్వాముల ఇనుప పాదాల క్రింద నలిగిపోతున్న కర్షకుల వలన అక్కడ విప్లవం వచ్చింది. అక్కడ విప్లవం నెగ్గడానికి పరిస్థితులు సానుకూలంగా లేకపోయినా, లెనిన్ వంటి మహా నాయకుడు నాయకత్వం వహించడం వల్ల విప్లవం విజయవంతమైంది.

కాబట్టి విప్లవం అనేది ఫలానా పరిస్థితుల వలన వస్తుందని గాని, కార్మికవర్గం నాయకత్వం వహించడంవలన వస్తుందని గాని గీత గీసి చెప్పడం పొరబాటు".

"రాయ్ వ్యాసాలు"లో మార్క్సిజం వ్యాసంలోని కొన్ని భాగాలను సంగ్రహంగా ఉదహరించడం జరిగింది. ఆధారం : కోగంటి రాధాకృష్ణమూర్తి అనువాదం

మార్క్స్ కార్మిక వర్గానికి ప్రాధాన్యతను ఇచ్చి మధ్య తరగతి వారిని బూర్జువా వర్గంగా అభివర్ణించి, అభివృద్ధి నిరోధకులుగా భావించాడు, కాని – రాయ్ దీనిని పూర్తిగా వ్యతిరేకించాడు. బూర్జువా వర్గం అని చెప్పబడిన మధ్య తరగతి వారిలో చైతన్యానికి దోహదం చేసిన మేధావులు వున్న సత్యాన్ని విస్మరించకూడదన్నాడు.

మార్క్స్ సిద్ధాంతంలోని మరొక ముఖ్యమైన విషయం "అదనపు" విలువ సిద్ధాంతం" (Theory of Surplus Value) ఈ సిద్ధాంతం ప్రసిద్ధ సంప్రదాయ అర్థశాస్త్రవేత్త, పెట్టుబడి దారీ దృక్పథంగల అర్థశాస్త్రవేత్త అయిన డేవిడ్ రికార్డో రూపొందించిన ఉత్పత్తి వ్యయ విలువ సిద్ధాంతం (Cost of production theory of value)ని ఆధారం చేసుకుని రూపొందించ బడింది. (అర్థశాస్త్ర ప్రపంచంలో నిపుణుడయిన అర్థశాస్త్రవేత్తలలో రికార్డో ప్రత్యేకించి పేర్కొనదగినవాడు)

ఇందులో చిత్రం ఏమిటంటే ఒక పెట్టుబడిదారీ సిద్ధాంతంను ప్రాతిపదికగా చేసుకుని కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని రూపొందించడం. ఒకడి చేతివేలుతో అతడి కన్నునే పొడవడం లాంటిది యిది !

కారల్‌మార్క్స్ రికార్డో సిద్ధాంతాన్ని ఎలా ఉపయోగించుకున్నాడో, ఒక చిన్న ఉదాహరణతో వివరించవచ్చు. విలువ నిర్ణయ సిద్ధాంతాలలో ప్రముఖమైన రికార్డో విలువ సిద్ధాంతంలో–ఒక వస్తువు ధర దాని ఉత్పత్త వ్యయాన్ని బట్టి నిర్ణయించబడుతుంది. ఉత్పత్తి వ్యయం అంటే ఈ సిద్ధాంతం ప్రకారం శ్రామికులకు ఇచ్చిన వేతనం మాత్రమే – అందువల్లనే దీనిని 'శ్రమజన్య విలువ సిద్ధాంతం' (Labour Theory of Value) అనికూడా అంటారు.

ఒక కుర్చీని తయారుచెయ్యడానికి నలుగురు శ్రామికులను వినియోగించారనుకుందాం. ఒక్కొక్క పనివానికి పదిరూపాయల చొప్పున వేతనం యిస్తే మొత్తం ఉత్పత్తి వ్యయం రికార్డో సిద్ధాంతం ప్రకారం 40 రూ. అవుతుంది. అదే దాని ధర అవుతుంది.

ఈ అంశాన్ని ప్రాతిపదికగా తీసుకుని కారల్‌మార్క్స్–వ్యాపారస్తుడు కుర్చీధరను రూ. 40 కాక రూ. 60 గా నిర్ణయిస్తున్నాడు. 40 రూ.వుండాల్సిన కుర్చీ ధర మార్కెట్‌లో 60 రూ.

వుంటోంది. ఇందులో వున్న అదనపు విలువ (Surplus Value)ను శ్రామికులకు రావలసిన రూ. 20 ను అక్రమంగా వ్యాపారస్తుడు అనుభవిస్తున్నాడు. ఇది శ్రామికులకే చెందాలి అంటూ తన అదనపు విలువ సిద్ధాంతాన్ని (Theory of Surplus Value) కారల్ మార్క్స్ కేపిటల్ గ్రంథంలో వివరంగా చర్చించాడు.

ఈ విషయాన్ని గురించి విశ్లేషిస్తూ రాయ్ "సిద్ధాంతరీత్యా ఈ వాదనలో కొంత సబబు వుంది. కాని, ఆచరణలో ఇది అసాధ్యం. కమ్యూనిస్టు ప్రభుత్వాలలో కూడా ఇది అమలు అయ్యే వీలులేదు. రష్యాలో ఏర్పడిన శ్రామికరాజ్యంలో కూడా ఇది అమలు కాలేదు"

"పరిపాలన చెయ్యాలంటే, శ్రామిక రాజ్యాలలో కూడా ప్రభుత్వాలకు కొంత ద్రవ్యం అవసరం. ప్రబుత్వం ఎవరి శ్రమకు తగిన ద్రవ్యం వారికి యిచ్చేస్తున్నదని అనుకున్నా ప్రభుత్వ పరిపాలన చెయ్యడానికి కొంత ద్రవ్యం శ్రామికులనుండి వసూలుచెయ్యక తప్పదు. అంటే ప్రభుత్వం కొంత అదనపు విలువను గ్రహిస్తున్నదని చెప్పుకోవాలి – అంటే సోషలిస్టు ప్రభుత్వ ఖజానాలోనికి కొంత 'అదనపు' విలువ చేరుతున్నది. ఇదే పెట్టుబడిదారీ వ్యవస్థలో అయినట్టయితే, "అదనపు విలువ" పెట్టుబడిదారుల ఖాతాలోనికి చేరుతుంది. అందుచేత "అదనపు విలువ" ఎవరికి చేరుతున్నది అనేదాంట్లోనే తేడా వున్నది. కాబట్టి – సోషలిస్ట్ దేశాలలో "స్టేట్ కేపిటలిజమ్" (State Capitalism) వుంటుందని చెబితే సరిపోతుంది."

ఇదేవిధంగా రాయ్ మార్క్సిస్టు దేశాలలో "శ్రామిక నియంతృత్వం" వుంటుందని చెప్పడాన్నికూడా నిశితంగా విమర్శించాడు.

"నియంతృత్వం అంటే నిరంకుశంగా పాలించడం. అది శ్రామిక నియంతృత్వం (Dictatorship of Proletariat) అయినా, పెట్టుబడిదారీ నియంతృత్వమైనా ఒక్కటే"

నిరంకుశ అధికారం అనేది మానవుల స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి వ్యతిరేకం, ఎలాంటి అడ్డంకులూ లేకుండా స్వేచ్ఛగా అభివృద్ధిచెందుతూ వుండడం స్వాతంత్ర్యం. మనుషులను కీలుబొమ్మలుగా చెయ్యడం నియంతృత్వం. ఈ రెండూ ఒకదానికొకటి చుక్కెదురు".

"రష్యాలో శ్రామిక నియంతృత్వం వున్నదనీ, దేశంలో కార్మిక పాలన స్థాపించబడిందనీ చెబుతూ వుంటారు. కాని, అధికారంగల ఉద్యోగాల్లో ఎంతమంది శ్రామికులు వున్నారని అడిగితే వచ్చే సమాధానం నిరాశాజనకంగా వుంటుంది. అత్యున్నతమైన సుప్రీమ్ కౌన్సిల్‌లో ఆరువందల మంది అధికార్లు వుంటే, వారిలో అరవైమంది కన్నా కార్మికులు వుండరు. మిగతావారంతా కమ్యూనిస్టు పార్టీవారే.

"రష్యాలో వున్నది కార్మిక నియంతృత్వం కాదు. కమ్యూనిస్టు పార్టీ నియంతృత్వం మాత్రమే అక్కడ వున్నది. ఈ కమ్యూనిస్టు పార్టీ స్టాలిన్ వంటి వారి చేతుల్లో వుండి, వారెలా చెబితే అలా నడుస్తుంది".

"కేవలం ఆర్థిక సమానత్వం వుండడం ఒక్కటే స్వాతంత్ర్యం కాదు. మానవుని బుద్ధిని వికసింపచేసే అవకాశమున్నప్పుడే, స్వాతంత్ర్యం వుందని చెప్పాలి. ప్రజలు తమ అభిప్రాయాలను బాహాటంగా వెల్లడించుకోవడానికి గాని, తమ కనుకూలమైన రాజకీయాలు చేపట్టడానికి గాని, పార్టీని నిర్మించుకోడానికి గాని, రష్యాలో అవకాశం లేదు. ఆర్థిక సమానత్వంలేని రాజకీయ స్వాతంత్ర్యం నిరుపయోగమైనట్లే, రాజకీయ స్వాతంత్ర్యం లేని ఆర్థిక సమానత్వం కూడా నిరుపయోగం. ఇవి రెండూ బండి చక్రాల్లాంటివి. ఇవి రెండూ సమానంగా నడిచినప్పుడే సమాజం ముందుకు సాగుతుంది."

రష్యాలో వున్న సోషలిజంను విమర్శిస్తూ రాయ్ పలికిన పలుకులివి.

రష్యాలోని సోషలిజమ్ ఇంకా శైశవదశలోనే వుంది. ఆదశ బలపడిన తర్వాత కమ్యూనిస్టు దశకు చేరవలసివుంది. కమ్యూనిస్టుదశకు చేరినతర్వాత,క్రమక్రమంగా అధికారాలు కేంద్రీ కృతమయ్యే దశ మారిపోతుంది. ఆ తర్వాత, రాజ్యాంగ యంత్రాంగమే అదృశ్యమైపోతుంది (విదరింగ్ ఎవే ఆఫ్ ది స్టేట్) అనే మార్క్స్ చిలకపలుకులు కొందరు వల్లెవేస్తారు.

ఈ విషయాన్ని కూడా రాయ్ అంగీకరించలేదు. రష్యా సోషలిజమ్‌ను చేపట్టి, చాలా కాలం అయింది. అయినా అక్కడ కమ్యూనిస్టు వ్యవస్థ యింకా స్థాపించబడలేదు. ప్రభుత్వ అధికారం నానాటికీ మరింత ఎక్కువగా కేంద్రీకరించబడుతున్నది. ఇట్లాంటి పరిస్థితిలో రష్యా మార్క్స్ చెప్పిన మార్గంలో ఎలా పయనిస్తున్నదని, ఆ దేశంలో కమ్యూనిజం ఎలా ఏర్పడుతుం దని, సూటిగా విమర్శిస్తాడు రాయ్.

ఈ విషయాన్ని గురించి చెబుతూ–వాస్తవానికి మార్క్స్ ఆలోచనా విధానంలోనే లోపము న్నదన్నాడు. కార్మిక విప్లవాలు జరిగిన దేశాలలో–ముందు సోషలిజమ్ ఆ తర్వాత కమ్యూనిజమ్, ఆ పైన రాజ్యరహిత సమాజం ఏర్పడతాయి అన్నాడు. మార్క్స్.

అట్లాంటి రాజ్య రహిత సమాజాలలో – మనుషుల మధ్య అంతరాలు వుండవు. శారీరక, మానసిక శ్రమల మధ్య వ్యత్యాసాలు తొలగిపోతాయి. ప్రజలు స్వేచ్ఛా సమాజంలో జీవిస్తారు. ఇట్లాంటి పరిస్థితుల్లో రాజ్యం అవసరం వుండదు. కాలక్రమేణా రాజ్యం అంతర్ధానమైపోతుంది అంటాడు మార్క్స్.

ఇది పూర్తిగా అవాస్తవిక మన్నాడు రాయ్. ప్రభుత్వం, రాజ్యాంగ యంత్రం అనేవి కమ్యూనిజమ్ ఏర్పడిన తర్వాత కూడా అవసరం. రాజకీయాలు అనేవి వున్నంతకాలం ప్రభుత్వ యంత్రాంగం అనేది వుండాలి. అయితే ఆ రాజకీయాలు సంఘంలో అభివృద్ధికి తోడ్పడేవిగా మాత్రమే వుండాలి.

ఇలా, మార్క్సిజమ్‌ను విమర్శించిన రాయ్‌కి కారల్ మార్క్స్ పట్ల, అతడి సిద్ధాంతాలపట్ల గౌరవం లేదని అనుకోకూడదు. "Man is root of mankind" అనే మార్క్స్ పలుకులను ఆయన శిరోధార్యంగా భావిస్తాడు. మార్క్స్‌ను గొప్ప మానవతావాదిగా భావిస్తాడు రాయ్. కేవలం పగటి కలలతో మార్క్స్ తన సిద్ధాంతాలను రూపొందించలేదు. అతడు గొప్ప హేతువాది. ఈ హేతువాద మూలాలతోనే మార్క్స్ సిద్ధాంతకల్పన చేశాడు. "ఏదయితే హేతువాదంతో చెప్ప బడిందో, అది సరిఅయిన విషయము అవుతుంది" అనే హెగెల్ పలుకులు మార్క్స్‌కు ప్రియమైనవి అయినట్టే, రాయ్‌కి కూడా ప్రియమైనవి.

మొత్తంమీద, ఈ విషయాలన్నింటినీ సమన్వయం చేసి ఆలోచించినప్పుడు "తత్త్వ వేత్తలు" గ్రంథంలో గోపీచంద్ రాసిన వాక్యాలు పక్కానికి వస్తాయి.

"రాయ్‌కి మనిషే ముఖ్యం. ఏ వంకతోనయినాసరే, మనిషిలోని స్వాతంత్ర్యేచ్ఛ అరికట్ట బడకూడదు అని అతడి ఉద్దేశం. నేడు మనిషి అనేక సిద్ధాంతాల మధ్య సతమతమవుతున్నాడు. ఈ సిద్ధాంతాలు అతడిని అణగద్రొక్కడానికి చూస్తున్నాయి.

ఒకవంక ఆధ్యాత్మికవాదం భగవంతుని సృష్టించి, మానవుని అతడి చేతుల్లోని కీలు బొమ్మలను చేసింది. మరొకవంక భౌతికవాదాన్ని మలిన పరచడం వలన పుట్టిన ఆర్థిక సిద్ధాంతం అతడిని తన బానిసగా చేసుకొంది – ఈ రెండు సిద్ధాంతాలూ మనిషికి ఒక ప్రత్యేకత అంటూ లేకుండాచేసి, అతడిని ఒక పెద్ద యంత్రంలోని మరగా చేశాయి. దీని వలన అతడి సృజనాత్మకత నశించింది. అతడు చరిత్రను సృష్టించేవాడుగా కాక, చరిత్రకు బానిస అయ్యాడు"

ఇలా చెబుతూ, మనిషిని చరిత్రను సృష్టించేవాడుగా నిలబెట్టేందుకు రాయ్ పడిన తపనను వివరిస్తాడు గోపీచంద్ ఎం.ఎన్.రాయ్ గురించి రాసిన వ్యాసంలో ("తత్త్వవేత్తలు" పుస్తకంలో రాయ్ గురించి రాసిన వ్యాసంలోని ప్రారంభ వాక్యాలివి.)

మనిషిని మనిషిగా నిలబెట్టేందుకు రాయ్ చేసిన కృషిలో రూపొందిన సిద్ధాంతమే "నవ్య మానవ వాదం" (New Humanism).



# 10
# నవ్య మానవవాదం
## (New Humanism)

ఎం.ఎన్.రాయ్ పేరు చెప్పేసరికి మేధావులు ఎవరికయినా జ్ఞాపకం వచ్చేది "నవ్య మానవతావాదం" - అదే అతడికి భారతీయ తత్వవేత్తల సరసన ఒక సమున్నత స్థానాన్ని కల్పించింది. రాయ్ ఉగ్రవాదిగా రాజకీయ జీవన ప్రస్థానాన్ని ప్రారంభించి ఆ తర్వాత మార్క్సిజమ్‌ను గుండెలనిండా నింపుకుని పలు సంవత్సరాలు కమ్యూనిస్టుగా జీవించాడు.

ఆ తర్వాత కాలంలో, అతడు మార్క్సిజమ్‌లోని కొన్ని విషయాలతో విభేదించినా, మార్క్స్ సిద్ధాంతంలో ప్రాతిపదిక విషయంగా వున్న మానవతా వాదాన్ని శిరోధార్యంగానే భావించుకున్నాడు. ఈ విషయాన్ని వివరిస్తూ రాయ్ సన్నిహితుడు 'వి.ఎం.తార్కుండే' "నవ్య విధాన తత్వవేత్త" అనే వ్యాసంలో ఇలా అంటాడు "మార్క్సిస్టు పథంలోనే పయనిస్తూ రాయ్ మార్క్స్‌ను మించిపోయాడు" (M.N.Roy A Biography of vision and Ideas అను వ్యాస సంకలనంలో)

"న్యూ హ్యూమనిజమ్" లేదా "రాడికల్ హ్యూమనిజమ్" అని పిలువబడే తాత్విక ధోరణిని వివరిస్తూ ఎం.ఎన్.రాయ్ "రాడికల్ హ్యూమనిస్టు సూత్రాలు" అనే పేరుతో 22 సూత్రాలు ప్రతిపాదించాడు. (దీనినే Twenty Two Thesesగా చెప్పడం జరిగింది.)

ఈ సూత్రాలను రాయ్ బొంబాయిలో జరిగిన (1946 డిసెంబరు) 'రాడికల్ డెమోక్రటిక్ పార్టీ' మహాసభలో మొట్టమొదటిసారిగా ప్రతిపాదించాడు. పార్టీ ఏకగ్రీవంగా దీనిని ఆమోదించింది. ఆ తర్వాత, 1948 డిసెంబరులో రాయ్ ఆ పార్టీని రద్దుచేసి, హ్యూమనిస్ట్ ఉద్యమంగా మార్చినప్పుడు ఈ లక్ష్యాల సాధన తన జీవితగమ్యంగా పెట్టుకున్నాడు. రాజకీయాలకు దూరంగా ఒక తత్వవేత్తగా తన భావాలను ప్రచారంచేసేవాడు. గ్రంధాలు రచించేవాడు. రాయిస్టులకు రాయ్ పలుకులే మార్గదర్శకాలు.

రాయ్ వలెనే కొంతకాలం కమ్యూనిజమ్‌ను ఆరాధించి, ఆ తర్వాత కమ్యూనిజమ్‌తో తెగదెంపులు చేసుకున్నవారు మరికొందరు వుండవచ్చు. కాని, వారిలో చాలామంది ఆధ్యాత్మిక వాదాన్ని స్వీకరించి, మతవాదులయ్యారు.

కాని, రాయ్ కమ్యూనిజమ్‌నుండి, దానికి ప్రాతిపదిక అయిన మానవతావాదానికి ప్రయాణించాడు. ఏనాడూ తానునమ్మిన విలువలు విడనాడలేదు.

ఈ ప్రయాణంలో అతడికి మార్గ నిర్దేశకులు లేరు. తనకు తానే మార్గ నిర్దేశకత్వం చేసుకోవలసి వుంది. తనకు తానే వేసిన ప్రతి అడుగులోని తప్పొప్పులను బేరీజు వేసుకుని, సరి అయిన విషయాన్ని నిర్ధారించుకోవలసి వుంది. అలా ఆవిర్భవించిందే "నవ్య మానవ వాదం."

ఈ విషయాన్ని గురించి చెబుతూ రాయ్ "నేను విశ్వవిద్యాలయాల్లో పెద్ద చదువులు చదువుకున్న తత్వ వేత్తను కాను. నేను నా తత్వానికి సంబంధించిన నిర్ణయాలను గ్రంథాలనుండి కాక, అనుభవం ప్రాతిపదికగా తీసుకున్నాను. నా చిన్నతనం నుండీ నేను అన్యాయాన్ని ఎదిరించి, స్వేచ్ఛకోసం పోరాడాను. సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంనుండి వచ్చిన నాకు ఇది కష్టసాధ్యమే కావచ్చును. కాని, నేను వెనుకాడలేదు" అని అన్నాడు.

నిజమే. చాలామంది తత్వవేత్తలు లాగా అతడు విశ్వవిద్యాలయాల్లో చదువుకున్న వాడు కాడు. పాఠశాల విద్యకు మించి అతడికి సాధారణ విద్యలేదు. కాని, రాయ్ ప్రపంచ భాషల్లో వచ్చిన గొప్ప గ్రంథాలన్నింటినీ అధ్యయనం చేశాడు. అంతేకాదు బహుభాషావేత్తగా పలు ప్రపంచ భాషల్లో గ్రంథాలు రాశాడు. వివిధ అంశాలపై వుండే ఈ గ్రంథాల పేర్లు చదివితేచాలు అతడి మేధాశక్తి ఎంత విస్తృతమైందో, లోతయిందో తెలుస్తుంది. అంతకుమించి, జీవితాన్ని విస్తృతంగా చదువుకున్నవాడు. అంతేకాదు లెనిన్ ఆధ్వర్యంలో రష్యాలో ఏర్పాటయిన ఒక విశ్వవిద్యాలయానాకి వైస్ ఛాన్సలర్‌గా కూడా పనిచేశాడు.

రాయ్ పై మాటలను వినమ్రతతో చెప్పుకున్నా ఒక తత్వాన్ని ఆవిష్కరించడానికి రాయ్ కన్నా అర్హులు ఎవరు ?

దేశంలో ఏ రాజకీయ వ్యవస్థ వున్నా, అందులో వ్యక్తికి సంపూర్ణమైన స్వేచ్ఛ వుండాలి. వ్యక్తిలో అంతర్గతంగా వున్న శక్తులు వికసించడానికి అవకాశం వుండాలి. వ్యక్తి లేనిదే సమాజం లేదని గ్రహించాలి అనేది నవ్య మానవవాదంలోని కీలకమైన అంశం.

నవ్య మానవవాదం అనేది - స్వేచ్ఛ; హేతువాదం, నైతికత అనే మూడు అంశాలపై ఆధారపడి వుంది అంటాడు "తార్కుండే". మానవత్వం అనే పదంలోనే ఈ మూడూ ఇమిడి ఉన్నాయి. మానవుడు హేతువాది కాబట్టే నైతికతను కలిగి వున్నాడు - అంటాడు రాయ్.

హేతువాదానికీ, నీతికీ మధ్య వున్న సంబంధాన్ని వివరిస్తూ "కమ్యూనిజమ్ అవతల" (Beyond Communism) అనే గ్రంథంలో రాయ్ ఇలా అంటాడు "ఏ విషయాన్నయినా హేతువాదంతో పరిశీలించి, అది సరయినదా కాదా అనే విషయాన్ని నిర్ణయించుకోవాలనే వ్యక్తి మానవులందరికీ యిట్లాంటి హేతుజ్ఞానమే వుంటుందని సహజంగానే గ్రహిస్తాడు" అంతేకాదు "సామరస్యపూర్వకమైన, పరస్పర లాభదాయకమైన రీతిలో హేతుబద్ధమైన వాంఛతో 'నీతి' అనే దాన్ని రూపొందించుకుంటాడు"

ఇదే విషయాన్ని (Reason, Romanticism and Revolution) అనే గ్రంథంలో మరికొంత వివరిస్తూ "ఏది మంచి ఏది చెడు అనే విషయాన్ని అనుభవాన్నిబట్టి మానవుడు తెలుసుకుంటాడు. తనకు 'మంచి' అయింది ఇతరులకు కూడా మంచి అయ్యేలా తనకు 'చెడ్డ' అయింది ఇతరులకు కూడా 'చెడ్డ' అయ్యేలా 'నీతి' అనేదానిని రూపొందించుకుంటాడు" అని అన్నాడు.

ఇక్కడ ఒక విషయాన్ని మాత్రం గ్రహించాలి. ఏది నీతి, ఏది అవినీతి అనే దానిని మానవుడు ఐచ్ఛికంగా తనకు తాను గ్రహించాలిగాని, ఇందులో బయటి శక్తుల ప్రమేయం వుండకూడదు.

మతాధికారులు 'నీతి', 'అవినీతి' అనే వాటిని 'పాపం', 'పుణ్యం' అనేవాటితో ముడిపెడ తారు. 'నీతి'ని అనుసరిస్తే పుణ్యంవస్తుంది, 'అవినీతి'ని ఆచరిస్తే నరకంవస్తుంది అని అంటారు. అంతేకాదు పుణ్యం చేసుకున్నవారు స్వర్గసుఖాలు అనుభవిస్తారని ప్రలోభపెడతారు. పాపం చేసుకున్నవారు నరకంలో నానాబాధలూ పడతారని భయపెడతారు.

ఇలా మతం చెప్పింది 'నీతి' అని భావించడం రాయ్ దృష్టిలో సరి అయిన విషయం కాదు. Reason, Romanticism and Revolution అనే గ్రంథం (రెండో భాగంలో) రాయ్ "నైతిక తత్వానికీ, మతపరమైన నమ్మకానికీ ముడిపెడితే అది మామవుడి సర్వస్వతంత్రతనూ, స్వేచ్ఛనూ అరికడుతుంది. మనిషి తనంతట తాను నీతిమంతుడుగా వుండాలి గాని, ఇది ఒక మతపరమైన అధికారంవలన జరగకూడదు" అని అంటాడు.

మానవుడు నీతివంతుడుగా వుంటేనే నైతిక సమాజం ఏర్పడుతుంది. కాని, ఇది బయటి శక్తుల ప్రేరణ వలన జరగకూడదు అని మాత్రమే రాయ్ చెప్పేది. సాధారణంగా 'మతం' అనేది మనిషిని తనకు బానిసగా చేసుకుంటూ వుంటుంది. ఈ మతం అనేది దేముడి గురించి చెప్పే మతం అయినా సరే, దేముడితో సంబంధం లేనిది అయినా సరే, ఇవి మానవుడి స్వేచ్ఛకు సంకెళ్లు వేసేవే. ఆస్తిక మతాలూ, నాస్తిక మతాలు మానవుడి స్వేచ్ఛను అరికట్టడంలో ఒకేలా ప్రవర్తిస్తాయని రాయ్ అభిప్రాయం.

మానవుని 'నీతి'కీ, 'స్వేచ్ఛ'కూ గల సంబంధాన్ని చెప్పిన రాయ్ ఈ 'స్వేచ్ఛ' బహు ముఖంగా వుండాలనికోరుకున్నాడు. రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలన్నింటి లోనూ–మానవుడికి 'స్వేచ్ఛ' వుండాలని రాయ్ భావించాడు.

నీతి వలెనే తన నవ్య మానవవాద తత్వంలో రాయ్ సత్యానికి (Truth) కూడా చాలా ప్రాధాన్యతను ఇచ్చాడు. నవ్య మానవవాదం ప్రకారం మానవుడు తన జీవితయాత్రలో తాను చేరాల్సిన గమ్యాన్ని తనకు తానే నిర్దేశించుకుంటాడు. (Man is the maker of his own

destiny) దానిని చేరుకోడానికి స్వేచ్ఛతో నిరంతర అన్వేషణ గావించి, తాను చేరుకోవలసిన తీరానికి చేరుకుంటాడు. అదే అతడి సత్యసాధన అంటాడు రాయ్. అస్తిత్వవాద తత్వశాస్త్ర వేత్తలు కూడా కోరుకునేది ఇలాంటి సత్యసాధననే.

* * * * *

మొత్తంమీద చూస్తే, రాయ్ దృక్పథంలో మూడు అంశాలు కనబడతాయి. అవి -

1) భౌతికవాదం (Materialism)

2) లౌకికవాదం (Secularism)

3) హేతువాదం (Rationalism)

ఇవి అన్నీ మానవుడి స్వేచ్ఛా పిపాసతోనూ, సత్యాన్వేషణతోనూ, నైతిక ప్రవర్తనతోనూ సంబంధం కలిగినవే.

“రెండో ప్రపంచ యుద్ధ కారణంగా ప్రపంచంలో వున్న ఫాసిస్టు ప్రభుత్వాలు నాశనం చెయ్యబడ్డాయి. కాని, ఫాసిజం అనేది నాశనం కాలేదని గ్రహించాలి. ఏదో ఒక రూపంలో పలు సందర్భాలలో ఫాసిజం తలెత్తుతూనే వుంది” అనే రాయ్ మతం, ఆధ్యాత్మిక దృక్పథం, ప్రజాస్వామ్యం వుంపని చెప్పుకునే పార్లమెంటరీ ప్రభుత్వాలు, ఇవన్నీ ఫాసిజమ్‌కు ప్రతిరూపాలు గానే వుంటున్నాయి అంటాడు.

ఫాసిజం అనేది హిట్లర్, ముస్సోలినీ వంటి కొద్దిమంది వ్యక్తులవల్ల మాత్రమే రాలేదు. ప్రజల అజ్ఞానం, అంధ విశ్వాసాలు, మూఢాచారాలు, మతవ్యామోహం, జాత్యహంకారం, జాతి ద్వేషం, మత ద్వేషం, కుల ద్వేషం ఇవి అన్నీ ఫాసిజమ్‌కు పట్టుకొమ్మలు. వీటన్నింటినీ నాశనం చేస్తే గాని, ఫాసిజమ్ నాశనం చెయ్యబడదు.

మనిషి బానిసగా మారాల్సి వస్తే, అది మతాధిపతికైతేనేమి ? పీఠాధిపతికైతేనేమి? ఏదయినా ఒక్కటే ! మనిషి స్వేచ్ఛగా జీవించాలంటే, అన్నిరకాల బానిసత్వాల నుండి అతడు విముక్తుడు కావాలి. అలాంటి స్వేచ్ఛను సాధించాలి.

స్వేచ్ఛ అంటే, ఆకలి సమస్య నుండి విముక్తుడు కావడం ఒకటే కాదు. అలా అయితే కమ్యూనిస్టు దేశాలలో ఇది సాధించబడినా అక్కడి వారికి స్వేచ్ఛ అనేది లేదు.

మనిషి మనుగడకు విరుద్ధమైన శక్తులన్నింటినుండీ విముక్తుడు కావడమే ‘స్వేచ్ఛ’ అనే మాటకు అర్థం. స్వేచ్ఛా సమాజాన్ని సాధించాలనుకుంటే, ముందు స్వేచ్ఛా పిపాసులయిన మానవులుండాలి. (A Free Society will be the creation of spiritually free men and women) అనేది రాయ్ దృక్పథం.

**రాయ్ దృక్పథం :**

ప్రకృతి నుండి ఉద్భవించిన మానవుడు తన జ్ఞానంద్వారా - ఏది సరి అయినది, ఏది సరిఅయినదికాదు, అనే విచక్షణ ద్వారా హేతుత్వంద్వారా, ప్రకృతిలోని రహస్యాలను ఛేదించ గలుగుతున్నాడు.

"ఇదంతా జరగాలంటే, మానవుడి జ్ఞాన సముపార్జనకు స్వేచ్ఛ వుండాలి." అంటూ రాయ్ మానవుడి సర్వసహాధికారాన్ని చెబుతాడు. అతడి దృష్టిలో మానవుడే అన్నింటికీ కేంద్రం. మానవ శ్రేయస్సు సాధనే దాని పరిధి. మానవుడిపై ఏ శక్తికీ అధికారం లేదు. సూక్ష్మంగా చెప్పాలంటే ఇదే రాయ్ ప్రతిపాదించిన నవ్య మానవవాదం.

ఈ నవ్య మావనవాద దృక్పథంలోంచి ఆలోచించితే - అమలులో వున్న రాజకీయ, ఆర్థిక విధానాలన్నీ మరోకోణంలోంచి కనబడతాయి.

రాజకీయ విధానం విషయంలోనికి వస్తే "ప్రస్తుతం అమలులో వున్న ఏ వ్యవస్థాకూడా మానవ స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను రక్షించేందుకు ఉపకరించేవిధంగా లేదు" అంటూ రాయ్ పీడితులను రక్షించడానికి ఉద్భవించిన మార్క్సిజంను అనుసరిస్తున్నామని చెప్పుకునే దేశాలలోనూ, ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తున్నామని చెప్పుకునే పార్లమెంటరీ ప్రభుత్వం వున్న దేశాలలోనూ, మానవుడి స్వేచ్ఛకు అవకాశం లేదు అంటాడు రాయ్.

Democracy అనే మాటకు అర్థం చెబుతూ ఏనాడో అబ్రహాంలింకన్ ఇచ్చిన నిర్వచనం (Of The people, By the people, For the people) ను చాలామంది వల్లెవేస్తూ వుంటారు. కాని, నిజంగా ఇలాంటి ప్రజాస్వామ్యం ఎలాంటి తరహా ప్రభుత్వంలోనూ అమలు జరగటంలేదు అంటాడు రాయ్.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో మానవుడికి ఓటు వేసే అధికారం మాత్రమే వుంటుంది. ఈ ఓటును పౌరుడు సాధారణంగా ఏదో ఒక పార్టీకి వేస్తాడు. (స్వతంత్ర అభ్యర్థుల విషయాన్ని ప్రస్తుతానికి పక్కన పెడితే) పార్టీలు చాలా వుంటాయి. ఓటరు ఒక పార్టీకి చెందిన అభ్యర్థికి ఓటు వేస్తాడు. ఇలా - వివిధ పార్టీలకు చెందిన ప్రజాప్రతినిధులు ఎన్నిక అవుతారు. ఏ పార్టీ అధిక సంఖ్యలో ప్రతనిధులను గెలపించుకోగలిగిందో ఆ పార్టీ అధికారంలోనికి వస్తుంది. ఇలా అధికారంలోనికి వచ్చిన పార్టీవారు తమ నాయకుణ్ణి ఎన్నుకుంటారు. యిలా ఆ నాయకుడు ప్రజలందరి పక్షాన పరిపాలనా బాధ్యతను స్వీకరిస్తాడు.

ఈ వ్యవస్థలో ప్రజాప్రతినిధులు - పేరుకు ప్రజా ప్రతినిధులయినా, తమను ఎన్నుకున్న ప్రజలకు ప్రతినిధులుగా భావించరు. తమ పార్టీకి, తమ నాయకుడికీ మాత్రమే బాధ్యులుగా వుంటారు. ప్రజల సంగతి పట్టించుకోవాలనే నియమం వారికి వుండదు. అంటే 'ప్రజాస్వామ్యం' అనేది 'పార్టీస్వామ్యం'గానో 'నాయకస్వామ్యం'గానో మారిపోతుంది.

ప్రభుత్వ కార్యకలాపాలలో ప్రజలపాత్ర ఏదీ వుండదు. అయిదేళ్లకో లేదా మరో నిర్ణీత గడువుకో ఓటు పెట్టెలో ఓటు వెయ్యడం మాత్రమే అతడి పని. అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం ప్రజలకు శ్రేయోదాయకమైన పనులు చేసినా, శ్రేయోదాయకంకాని పనులు చేసినా, నిస్సహాయంగా చూస్తూ వుండడమే వారి పని. తిరుగుబాటు ఉద్యమాలు చేపడితే వారిని జెయిళ్ళలోకుక్కి తిరుగుబాటును అణచివేస్తారు. అందుచేత తాను ఎన్నుకున్న ప్రభుత్వానికి తానే బానిసగా బ్రతకవలసి వుంటుంది.

మరో అయిదేళ్ల తర్వాత కూడా ఇదే కథ. ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి రాయ్ రాజ్యాంగ వ్యవస్థలో ఒక క్రొత్త విధానాన్ని ప్రతిపాదించాడు. అదే పార్టీరహిత ప్రజాస్వామ్య విధానం (Party Less Democracy).

ఈ విధానంలో పార్టీల మధ్య కుమ్ములాటలుగాని, ఒక పార్టీ నుండి మరోపార్టీకి మారడానికి ప్రజాప్రతినిధులను ప్రలోభపెట్టడంగాని వుండదు. అదేవిధంగా వివిధ పార్టీలవారు ఆచరణగాని వాగ్దానాలు చేస్తూ ప్రజలను మోసం చెయ్యడంగాని, ద్రవ్యాకర్షణతో ప్రలోభ పెట్టడం గాని వుండదు. ప్రజాప్రతినిధులు పార్టీకి కాక, ప్రజలకు జవాబుదారీగా వుంటారు. ఆ ప్రజాప్రతినిధులు ప్రజల అభీష్టానుసారం పనిచెయ్యడంలేదని అనిపించినప్పుడు, వారిని గద్దెనుండి దింపే అధికారం కూడా ప్రజలకు వుంటుంది.

రాయ్ రూపొందించిన రాజ్యాంగ వ్యవస్థ"పిరమిడ్" ఆకారంలో వుంటుంది. క్రింద భాగం పెద్దదిగా వుండి పై భాగం చిన్నదిగా వుంటుంది. ఒక విధంగా చెప్పాలంటే ఇది త్రిభుజాకారంలో వుంటుంది. ఈ విధానంలో పార్టీలు అనేవి వుండవు. వాటి స్థానంలో ప్రజాసంఘాలు వుంటాయి. ఉద్యమస్ఫూర్తిగల వ్యక్తులు గ్రామాల్లో, పట్టణాల్లో, ప్రజా సంఘాలను (పీపుల్స్ కమిటీస్) స్థాపిస్తారు.

ఈ ప్రజా సంఘాలవారు గ్రామాల్లో, పట్టణాల్లో వున్న ప్రజల సమస్యలను తీరుస్తూ పరిపాలనను నిర్వహిస్తూ వుంటారు. ఈ ప్రజా సంఘాలు ఎలా పనిచేస్తున్నాయి అనేది ప్రజలు ఎంతవరకూ చైతన్యవంతులయ్యారు అనే దానిని బట్టి ఆధారపడి వుటుంది. ప్రొఫెసర్లు, డాక్టర్లు, శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు, ప్రజలను చైతన్య వంతులను చేస్తూ వుంటారు.

ప్రజాసంఘాలు బలపడిన కొద్దీ, దేశంలో పార్టీల ప్రాముఖ్యత తగ్గుతుంది. గ్రామాల్లో, పట్టణాల్లో ఏర్పడిన ప్రజా సంఘాలు జిల్లా నాయకులు, పార్లమెంట్, ఎసెంబ్లీ, నాయకులను ఎన్నుకుంటారు. పార్లమెంట్ లేదా ఎసెంబ్లీ నాయకులు దేశానికి, రాష్ట్రానికి ముఖ్య నాయకుడిని ఎన్నుకుంటారు. ఇందులో ప్రజాసంఘాలదే కీలకమైన పాత్ర. ప్రజా సంఘాలలో గాని, రాష్ట్ర కేంద్ర స్థాయిలోగాని ఎవరయినా అనవసర పెత్తనాన్ని చేసి, ప్రజల శ్రేయస్సుకు దోహదం

కలిగించని రీతిలో ప్రవర్తిస్తే ప్రజలు వారిని తిరిగి రప్పించేందుకు అవకాశం వుంటుంది. దేశ ముఖ్య నాయకుడు కూడా ఇందుకు మినహాయింపు కాదు. మొత్తంమీద పార్టీల వారు, మెజారిటీ పార్టీ నాయకుడు సార్వభౌమాధికారాన్ని కలిగి వుండరు. ప్రజలే నిజంగా అక్షరాలా సార్వభౌములు.

మన దేశంలో అమలులో వున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి రాయ్ "సమగ్ర ప్రజాస్వామ్య" విధానానికీ, మధ్యగల తేడా ఏమిటంటే

ఈ తరహా విధానంలో రాజకీయ పార్టీలు వుండవు. కులతత్వాలు, మతతత్వాలు వంటి వాటికి చోటుండదు. ప్రజలు చైతన్యవంతులయి వుంటారు.

ప్రజాసంఘాలు రాష్ట్ర స్థాయిలో గాని, కేంద్ర స్థాయిలోగాని, ప్రజలు ఆశించిన విధంగా పని చెయ్యకపోతే ప్రజా సంఘాలు సమావేశమై, ఆ నాయకుని ఎన్నుకుంటారు. దీనినే రాజకీయ శాస్త్రంలో Re-call (తిరిగి రమ్మని చెప్పుట) అని అంటారు.

అదేవిధంగా పార్లమెంటరీ స్థాయిలోగాని, రాష్ట్రస్థాయిలోగాని ప్రజాప్రతినిధులు కొన్ని వివాదాస్పద విషయాలపై నిర్ణయాలు తీసుకోవలసి వచ్చినప్పుడు-ఏం చెయ్యమంటారు ? అని ప్రజలనే అడుగుతారు. ప్రజలందరికీ ఈ విషయంలో ఓటింగు పెడతారు. ఓటింగులో అత్యధిక సంఖ్యాకులయిన ప్రజలు ఏం చెబితే అది చేస్తారు. దీనినే రాజకీయ శాస్త్రంలో "రిఫరెండమ్" (Referendum) అని అంటారు.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తమ ప్రభుత్వంలో కేవలం ప్రజా ప్రతినిధులకేగాక, మేధావులకు కూడా చోటు కల్పిస్తారు.

అయితే - యిలాంటి సభ్యులుగా ఎవరిని నామినేట్ చెయ్యాలి అనే విషయాన్ని ప్రజా సంఘాలే నిర్ణయిస్తాయి.

యిలా మొత్తంమీద రాయ్ కలలుగన్న 'సమగ్ర ప్రజాస్వామ్యం'లో ప్రజా సంఘాలదే అంటే, ప్రజలదే కీలకమైన పాత్ర.

రాజకీయ విషయాలలోనే కాదు ఆర్థిక విషయాలలో కూడా ఇలాంటి వికేంద్రీకరణ విధానానికే ప్రాధాన్యతను ఇచ్చాడు. దేశ పరిపాలనలో రాజకీయ, ఆర్థిక విధానాలు నిర్వహించగల పాత్రను చెబుతూ రాయ్ ఇలా అంటాడు. -

"ఆర్థిక స్వాతంత్ర్యంలేని రాజకీయ స్వాతంత్ర్యం నిరుపయోగమయినట్టే - రాజకీయ స్వాతంత్ర్యంలేని ఆర్థిక స్వాతంత్ర్యం కూడా నిరుపయోగం. ఈ రెండింటిని రక్షించి ఆచరణ యోగ్యం చెయ్యగలిగినప్పుడే - మానవుడు వ్యక్తిగా పరిగణించబడడానికి, అతడిలోని శక్తి బహుముఖంగా వికసించడానికి అవకాశం వుంటుంది." అంటూ తరచూ చెప్పేవాడు రాయ్.

ఒక బండి నడపడానికి కావలసిన ఈ రెండు చక్రాలూ వున్న రాజ్యాంగ విధానాన్ని అతడు రూపొందించాడు. అంతేకాదు – ఈ రాజ్యంగ విధానంలో వ్యక్తి కేంద్ర బిందువుగా వుంటాడు అని కూడా గ్రహించవలసి ఉంటుంది.

ఇక తన ఆర్థిక విధానం గురించి చెబుతూ రాయ్

ప్రపంచంలో రెండు ప్రధాన ఆర్థిక విధానాలున్నాయి.

1) పెట్టుబడిదారీ ఆర్థిక విధానం. 2) సామ్యవాద ఆర్థిక విధానం.

ఈ రెండు విధానాల్లోనూ మనిషిని ఒక ఉత్పత్తి సాధనంగా చూడడం జరుగుతున్నదే గాని, అతడికి ఏ విధమైన స్వేచ్ఛ లేదు. యజమానులకు లాభాలు ఆర్జించి పెట్టే యంత్రాలుగా మాత్రమే వారు బ్రతుకుతున్నారు అంటాడు రాయ్

పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో లాభాలు పెట్టుబడిదారులకు చెందుతాయి. కమ్యూనిస్టు వ్యవస్థలో లాభాలు ప్రభుత్వానికి చెందుతాయి. అంతే తేడా.

మనిషి యంత్రంలో మరగా బ్రతకకుండా తానుచేస్తున్న పనిలో ఆనందాన్ని పొందుతూ, తాను చేస్తున్న పనిలో సృజనాత్మకతను చూపించే రీతిలో వ్యవహరించేందుకు తగిన ఆర్థిక వ్యవస్థ వుండాలని రాయ్ 'సహకార విధానం' (Co-operative system) ఇందుకు సరి అయినదిగా భావించాడు. వ్యవసాయరంగంలోను, పారిశ్రామిక రంగంలోనూ కూడా ఈ సహకార విధానం వాంఛనీయమన్నాడు.

సహకార ఆర్థిక వ్యవస్థలో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, ఇట్లాంటి విలువలు అన్నీ వుంటాయి. శ్రామికుడు ఇంకొకరు చెప్పింది తప్పనిసరిగా ఆచరించాల్సిన బానిసకాదు. అతడే యజమాని, అతడే పనివాడు. సృజనాత్మకతను కలిగి, అధిక ఉత్పత్తికి క్రొత్త విధానాలను సూచించగలుగుతాడు. దానివలన కలిగిన లాభాలను ఇతరులతో బాటు తానూ అనుభవించ గలుగుతాడు.

సహకార వ్యవస్థను సరిగా నిర్వహించగలిగితే అది ప్రజలకు ఆర్థిక భద్రతను ఇస్తుంది. దేశంలోని ఉత్పత్తి సాధనాలు (భూమి,మూలధనము,శ్రమ), మారకము (Exchange), పంపకము (Distribution), ఇవన్నీ ఒకపెట్టుబడిదారుకు కాక ప్రజలందరకూ చెందుతాయి.

సహకార ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక అధికారం వికేంద్రీకరించబడుతుంది. పెట్టుబడిదారు వలన గానీ, రాజ్యం వలన గానీ, ఎలాంటి దోపిడీ జరిగేందుకు అవకాశం వుండదు. సహకార ఆర్థిక వ్యవస్థలో రాజ్యం ఏవిధంగానూ జోక్యం చేసుకోదు. ఈ ఆర్థిక వ్యవస్థ సామ్యవాద ఆర్థిక వ్యవస్థలోని ప్రయోజనాలన్నింటినీ కలిగి వుంటుంది. ఇందులో అధికార యంత్రాంగం, రాజ్యం చేసే జులుం వుండదు.

ఒక కేంద్ర ప్రణాళికా సంఘం దేశమంతా భారీపరిశ్రమలు ఏర్పాటు చెయ్యడానికి పథకాలు రచిస్తే – తొలిదశల్లో వాటిల్లో సహకార విధానం అమలుచెయ్యడం సాధ్యంకాదు.

ఇది పారిశ్రామిక రంగంనుండి కాకుండా వ్యవసాయ రంగం నుండి ప్రారంభం కావాలి. అయితే సోవియట్ యూనియన్ మాదిరిగా రాజ్యం వ్యవసాయ భూములన్నింటినీ స్వాధీనం చేసుకుని, ఉమ్మడి వ్యవసాయ పద్ధతిని (Collective Farming) అమలు పరచడం కూడా వాంఛనీయంకాదు. ఈ విధానంలో కూడా వ్యవసాయదారుడు వ్యవసాయ కూలీగా మారిపోతాడు. అతడి సృజనాత్మకతకు అవకాశం వుండదు. అన్నింటికీ మించి, రైతుకు తన భూమిపై హక్కు వుండదు.

సహకార వ్యవసాయ విధానంలో రైతుకు తన భూమిపై హక్కు వుంటుంది. అంతే కాదు వ్యవసాయం చేయడంలో తనకుగల తెలివితేటల్ని ప్రదర్శించి, అందరి సహకారంతో ఉత్పత్తిని పెంచగలుగుతాడు. అందరితో బాటు తానూ అధిక ఆదాయాన్ని పొందగలుగుతాడు. సోవియట్ యూనియన్‌లో ఉమ్మడి వ్యవసాయ పద్ధతిని ప్రారంభించినప్పుడు ఎకరా ఒక్కింటికి వచ్చిన ఉత్పత్తిని, రైతు తన భూమిలో తాను వ్యవసాయం చేసుకుంటున్నప్పుడు ఎకరా ఒక్కింటికి వచ్చిన ఉత్పత్తిని పోలిస్తే ఉమ్మడి వ్యవసాయ పద్ధతిలో ఎకరా ఒక్కింటికి వచ్చిన ఉత్పత్తి తక్కువగా వుంది. "తన భూమికి తాను స్వంతదారు కాదు" అనే భావం వలన ఉత్పాదకత తగ్గిపోతుంది.

ఇలా ఈ సహకార పారిశ్రామిక వ్యవస్థను మొదట కుటీర పరిశ్రమలకు చిన్న, మధ్యతరహా పరిశ్రమలకు వర్తింపచేసి, క్రమక్రమముగా పెద్దతరహా, భారీ పరిశ్రమలకు విస్తరించేలా చూడాలి.

వినియోగదారుకు కావలసిన వస్తువులు చిన్న, మధ్యతరహా పరిశ్రమలలో తయారయ్యేటట్లు చూడాలి. తొందరపడి భారీ పరిశ్రమల జోలికి పోకూడదు.

ఇదంతా జరిగేందుకు దేశం మొత్తంమీద ఒక ప్రణాళికా సంఘం వుండకూడదు. ప్రణాళికా విధానంలో కూడా వికేంద్రీకరణ వుండాలి. వికేంద్రీకృత ప్రణాళికా విధానంలో గ్రామాలలో, చిన్న పట్టణాల్లో ప్రజల అవసరాలను గమనించి, దానికి అనుగుణంగా పారిశ్రామిక విధానాన్ని రూపొందించుకునేందుకు అవకాశం వుంటుంది.

ఈ విధంగా రాయ్ తన వ్యవసాయ, పారిశ్రామిక రంగాలకు సంబంధించి ఆర్థిక విధానంలో మండల స్థాయిలో కూడా ప్రణాళికా సంఘాలు వుండవలసిన ఆవశ్యకతను చెబుతాడు. అయితే – ఈ ప్రణాళికా సంఘాల విషయంలో కూడా రాయ్ ప్రజలకే ప్రాధాన్యతను యిచ్చాడు. కేంద్ర ప్రణాళికా సంఘం ఆదేశాలను బట్టి, మండల ప్రణాళికా సంఘం పనిచేయదు. మండల ప్రణాళికా సంఘం గుర్తించిన ప్రజల అవసరాలకు తగినట్లుగా కేంద్ర ప్రణాళికా సంఘం నిర్ణయాలు తీసుకుంటుంది. ఆర్థికాభివృద్ధి అనేది పైనుండి క్రిందకు కాకుండా, క్రింద నుండి

పైకి జరుగుతుంది. దీనినే అర్థశాస్త్రంలో (Development from Below) అని అంటారు. రాయ్‌ప్రతిపాదించిన ఆర్థిక విధానంకూడా "పిరమిడ్" లాగా త్రిభుజాకారంలో వుంటుంది.

రాయ్ ఆర్థిక విధానంలో సహకార విధానానికి ప్రాముఖ్యత వున్న విషయం ఇది వరకే చెప్పడం జరిగింది. సహకార రంగంలో వున్న పరిశ్రమలలో యజమాని, కూలి అనే భావం వుండదు. పరిశ్రమలలో వచ్చిన ఉత్పత్తి, దానిద్వారా వచ్చిన ఆదాయం తమదే కాబట్టి, శ్రామికులు శ్రద్ధగా పనిచేస్తారు. పనిలో ఆనందాన్ని పొందుతారు. వర్గ సంఘర్షణ అనే దానికి అవకాశం వుండదు. ఈ పరిశ్రమలలో తయారయిన ఉత్పత్తి వినియోగదారులకు వారికి ఉన్న సహకార సంస్థల ద్వారా పంపిణీ అవుతుంది.

ఇదంతా చెబుతూ రాయ్ ప్రజలలో నైతిక స్థాయి అధికంగా వున్నప్పుడే, సహకార రంగం విజయవంత మవుతుందన్నాడు. ప్రజలను నైతికపరంగా విద్యావంతులను చేయవలసిన బాధ్యత విద్యాలయాలదని అన్నాడు. చదువుకునే రోజులలో నుండి, వారికి నైతిక విలువల ప్రాధాన్యతను చెప్పినప్పుడు సహజంగానే నైతిక సమాజం ఏర్పడుతుంది. ఈ బాధ్యతను సాంస్కృతిక సంస్థలు కూడా తీసుకొనవలసి వుంటుంది.

దేశంలోని విద్యా సంస్థలు విద్యార్థులను చైతన్యవంతులుగాను, స్వేచ్ఛా ప్రియులుగాను తీర్చిదిద్దాలి. ఈ తరహా విద్య విద్యార్థులకే కాదు ప్రతి పౌరునికీ అందేట్లు చూడవలసిన బాధ్యత ప్రజాసంఘాలది (పీపుల్స్ కమిటీలు)

స్వేచ్ఛ, హేతువాదం, నీతి అనే మూడు అంశాలలో ఏది లోపించినా రాయ్ దృష్టిలో మానవవాదం కాదు. ఈ మూడింటి మూలాన్ని రాయ్ భౌతిక ప్రపంచంలోనే చూశాడు. ఆధ్యాత్మికవాదం అనే దానికి అవకాశం లేదు.

నవ్య మానవవాదాన్ని గురించి వివరిస్తూ "Humanism of Mahatma Gandhi and M.N.Roy" అనే గ్రంథంలో 'యస్. అబ్దుల్ సత్తార్' (S. Abdul Sattar) ఇలా అంటాడు. ఒక దేశం సామాజిక రంగంలో ఎంతవరకూ అభ్యుదయాన్ని సాధించింది అనే విషయం శ్రామికులు ఉత్పత్తి చేసిన సంపద ఎంతవరకూ వారికి చేరువవుతున్నది అనే అంశంపై ఆధారపడి వుంటుంది అంటాడు రాయ్. శ్రామికుల వెతలు తీరేందుకు విప్లవాలు జరగాలని రాయ్ కోరుకోలేదు. సహకార విధానం విజయవంతంగా అమలుజరగాలని మాత్రమే కోరుకున్నాడు. ఇందుకుగాను ప్రజలలో నైతికత పెరగడం అవసరం అని భావించాడు.

దేశంలో ఆర్థిక అసమానతలు రూపుమాసిపోవాలని రాయ్ కోరుకున్నాడు. అయితే అతడు దీనికన్నా ఈ దేశంలో సామాజిక అసమానత అనేది చాలా ప్రమాదకరమైన వ్యాధి. ఈ దేశంలోని జనం వర్గాలుగానే కాక కులాలుగా కూడా విడిపోయారు. ఈ కులవ్యవస్థను

రూపుమాపితేనేగాని, ఈ సామాజిక వ్యాధి నివారించబడదు. కుల వ్యవస్థను రూపుమాపుతూ చట్టాలుచేసి ప్రయోజనం లేదు. ప్రజల మనసుల్లో మార్పు కలిగించాలి. ఈ కుల వ్యవస్థ నుండి పుట్టుకొచ్చిన మరొక మహమ్మారి అస్పృశ్యత. అస్పృశ్యతను పాటించడం నేరమని చట్టం చేయబడింది. కాని, ఆ సమస్య అలాగే వుంది. వీటన్నింటినీ నివారించేందుకు సామూహిక చైతన్యం రావాలి. ఇది ప్రభుత్వ స్థాయి నుండి కాకుండా ప్రజల స్థాయి నుండి రావాలి. ప్రజలు తాము ఒక కులానికి చెందినవారమని కాకుండా, తాము మానవులమని, మానవులందరూ సమానులే అని గ్రహించగలగాలి.

రాయ్ ప్రతిపాదించిన రాడికల్ హ్యూమనిజమ్ లేదా నవ్య మానవవాదంలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలోని అంశాలను సంక్షిప్తంగా ఇలా వివరించవచ్చును. రాడికల్ హ్యూమనిజమ్‌ను వివరిస్తూ రాయ్ ప్రతిపాదించిన 22 సూత్రాల సారాంశం కూడా యిదే !

ఈ విషయాన్ని వివరిస్తూ ఆవుల సాంబశివరావుగారు ఒక వ్యాసంలో

"అన్నింటికీ మూలం మానవుడు. ఒక రాజ్యానికే కాదు సమాజానికి కూడా వ్యక్తి సూత్ర ప్రాయుడు. ప్రతి పౌరుడు ఒకవ్యక్తి. ఆ వ్యక్తి వ్యక్తిత్వం పూర్తి వికాసం పొందే రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక జీవితం కావాలి. అతడిని పట్టి పీడిస్తున్న మత, సామాజిక, ఆర్థిక, రాజకీయ, శక్తుల చెరసాల నుండి అతణ్ణి విముక్తుణ్ణి చెయ్యాలి"

రాయ్ కోరుకున్నది అక్షరాలా ఇదే ! ('ఎం.ఎన్.రాయ్ దర్శనం'లో ఆవుల సాంబశివ రావుగారు రాసిన వ్యాసం నుండి)



# 11
# రాయ్ యిజమ్ - గాంధీ యిజమ్

గాంధీజీ, ఎం.ఎన్.రాయ్ ఇద్దరూ భారతదేశం పరదేశ పాలన నుండి విముక్తి సాధించాలని పరితపించినవారు, ఉద్యమాలు నిర్వహించినవారు. లక్ష్యము ఒకటే అయినా దానిని చేరుకోడానికి వీరు అవలంబించిన మార్గాలు వేరు.

ఇక ఇద్దరూ మనుషుల మధ్య ఆర్థిక, సామాజిక, అసమానతలు వుండకూడదనీ, మనిషి మనిషిగా బ్రతకాలనీ ప్రబోధిస్తూ సిద్ధాంతాలు ప్రతిపాదించారు. ఇద్దరూ భారతదేశ ప్రజలేకాదు ప్రపంచ ప్రజలందరూ సుఖశాంతులతో వుండాలని కోరుకున్నారు.

కాని, నిశితంగా పరిశీలిస్తే, ఇద్దరిమధ్యా ఎంతోవ్యత్యాసముంది. "మత ప్రమేయం లేనిదే నేను ఏ సిద్ధాంతమూ చెప్పలేదు" అన్న గాంధీజీని పూజారీ కుటుంబం నుండి వచ్చినా, మతం అనే దానిని ఒక మహమ్మారిగా భావించిన రాయ్‌నీ సరిపోల్చేటప్పుడు వారిద్దరి దృక్పథాలూ ఉత్తర దక్షిణ ధృవాల్లాంటివి అని అనిపించడం సహజం.

అయితే రాయ్‌కి గాంధీజీ వ్యక్తిత్వం మీద విశేష గౌరవం వుండేది.

రాయ్ భారతదేశానికి తిరిగి వచ్చినప్పుడు ఒకరు ఆయనను ఇంటర్వ్యూ చేస్తూ, గాంధీజీ ప్రస్తావన తెస్తే రాయ్ "గాంధీజీ గొప్పదనాన్ని ఆయనను అనుసరిస్తున్నామని చెప్పుకునే వారికన్నా, నేను ఎక్కువగా ప్రశంసిస్తాను" అని అనడం గమనించదగ్గది.

ఈ విషయాన్ని మరికొంత వివరిస్తూ రాయ్ "MEN I MET" అనే వ్యాస సంపుటిలో ఇలా అంటాడు

"నేను ఎవరినీ గుడ్డిగా అనుసరించేవాడిని కాను. ఒక విషయాన్ని ఒకరు చెప్పారు కాబట్టి, సరి అయినదని నేను ఎప్పుడూ భావించను. ఎంతటివారు చెప్పిన విషయాన్నయినా, నేను విమర్శనాత్మకంగా పరిశీలిస్తాను. చెప్పినదానిలో ముందు చెప్పినదానికి ఆ తర్వాత చెప్పిన దానికి సంబంధం వుందా లేదా అనే విషయాన్ని గమనిస్తాను. అలాలేకపోతే, ఎంత పెద్దవారు చెప్పినా, దానిని నేను ఖండిస్తాను. అయితే ఈ పరిశీలనలో ఆ విషయాన్ని చెప్పిన వ్యక్తి ప్రవర్తనను కూడా గమనిస్తాను.

ఆ వ్యక్తి చెప్పినదాంట్లో మంచి విషయాలు ప్రశంసించదగ్గ విషయాలు వుంటే వాటి విషయంలో నాకెలాంటి అభ్యంతరాలూ వుండవు. లేదంటే దానిని విమర్శిస్తాను.

గాంధీజీ వ్యక్తిత్వం, ఆయన సిద్ధాంతాల విషయంలో కూడా నేను ఇదే విధానాన్ని అనుసరించాను. ఆయన చెప్పినదాంట్లోని మంచి విషయాలు ఆయన అనుచరులమని చెప్పుకునే వారికన్నా, నాకే ఎక్కువగా తెలుసు"

ఇదే విషయాన్ని రాయ్ "గాంధీయిజమ్, మార్క్సిజమ్ అండ్ హ్యూమనిజమ్" అనే వ్యాసంలో చెబుతూ "గాంధీ తత్వంలోని గొప్ప విషయం ప్రజాజీవితాన్ని పవిత్రంచేసి, రాజకీయాల్లో నైతిక విలువలను ఉద్దీపింపచెయ్యడానికి తపనచెందడం" అని అంటాడు. అయితే ఇదే విషయాన్ని మరికొంత చెబుతూ "ఆయన అనుచరులకు ఈ విషయంమీద ఎలాంటి పట్టుదలా లేదు. తమ స్వార్థం నెరవేరడం కోసం ఎలాంటి అనైతిక కార్యాలు చెయ్యడానికి కూడా వారు వెనుకాడరు" అని అంటాడు.

అయితే గాంధీజీ మతానికి, రాజకీయాలకూ ముడిపెట్టడం రాయ్‌కి ఎంతమాత్రమూ నచ్చలేదు.

"గాంధీజీ మతాన్ని రాజకీయాల్లోకి, సామాజిక శాస్త్రాల్లోకి తీసుకువచ్చాడు. మానవుడు మతపరమైన నమ్మకాలనుండి, అలౌకిక శక్తులపట్ల వున్న నమ్మకం నుండి (Super Natural Forces) మూఢనమ్మకాల నుండి విముక్తుడు కావాలని 15వ శతాబ్దంలోవచ్చిన పునరుజ్జీవన (Renaissance) ఉద్యమం చెప్పింది.

గాంధీజీ భగవంతుని పట్ల నమ్మకం వుంటేనే రాజకీయాలు పవిత్రమవుతాయని భావించాడు. అంటే 15వ శతాబ్దం నాటి పునరుజ్జీవనోద్యమ కాలానికంటే వెనుకగా గాంధీజీ ఆలోచిస్తున్నాడు" అంటూ రాయ్ మానవ శక్తికి అతీతమైన మానవాతీత శక్తి ఏదీ లేదని పదే పదే చెప్పాడు.

ఈ కారణంవల్లనే ఒకప్పుడు లెనిన్ గాంధీజీని విప్లవకారుడుగా అభివర్ణిస్తే, రాయ్ అంగీకరించలేక పోయాడు.

ఈ విషయానికి గురించిన చర్చ ఎలా వున్నా, ఇద్దరూ మనిషికీ, అతడి స్వేచ్ఛకీ ప్రాధాన్యతను ఇచ్చారు. పేదరికం నిర్మూలించబడాలని పరితపించారు. బెంథామ్ (Bentham) అనే అర్థశాస్త్రవేత్త చెప్పినట్టుగా "అధిక సంఖ్యాకులకు అత్యధిక సంతృప్తి" (Maximum hapiness of maximum number of people) అనే సూత్రాన్ని గాంధీజీ అంగీకరించలేదు. అత్యధిక సంతృప్తి అందరికీ లభించడాన్నే ఆయన కోరుకున్నాడు (Maximum happiness of All peopel) రాయ్ ఆలోచనలకు ఇది భిన్నంగా వుండదు.

“మతం” అనేది గాంధీజీకి ప్రియమైనదయినా మనిషిని నమ్మిన గాంధీజీ మతాన్ని నమ్ముకుని వెళ్ళాడలేదు.

“అన్నంలేక ఆకలితో అలమటించే నిర్భాగ్యులకు మతపరమైన ధర్మబోధన చెయ్యడం నిరర్థకం. అన్నమే బీదల పాలిట దైవం. చేతనయితే ఆ ఉపదేశం చెయ్యండి. చూపగలిగితే పని చూపండి. విందులు ఆరగించి, సుఖంగా కూర్చున్నవారు ఎన్ని ఉపన్యాసాలయినా ఇవ్వగలరు. ఒక్క పూటకూడా తిండి లేక మలమల మాడేవారి ఎదుట మతం గురించి మాట్లాడడం ఎలా సాధ్యం ?అనే గాంధీజీ ఆలోచనలు, రాయ్ ఆలోచనలకు దూరమైనవి కావు. అయితే ఇందులో ‘మతం’, ‘దైవం’ అనే మాటల ప్రస్తావన వుందంటే మాత్రం అది వేరే విషయం.

ఈ విషయాన్ని గురించి రాస్తూంటే, గాంధీజీ చెప్పిన మరొక మాట కూడా జ్ఞాపకానికి వస్తుంది.

1916వ సంవత్సరములో అలహాబాద్‌లోని ‘ఎకనమిక్ సొసైటీ’ వారు గాంధీజీని “ఆర్థికవృద్ధికి, నిజవృద్ధికి, మధ్య వైరుధ్యం వున్నదా ?” అనే అంశంమీద అర్థశాస్త్ర విద్యార్థులను ఉద్దేశించి, ప్రసంగించమని కోరారు.

అప్పుడు గాంధీజీ “ఒక దేశంలో భౌతిక వస్తు సముదాయం పెరుగుతూ, అదే సమయంలో ఎక్కువ మంది కడుపునిండా ఒక పూటకూడా తినడానికి లేకుండా వున్నప్పుడు దేశం నైతికంగా అభివృద్ధి చెందనప్పుడు ఆ దేశం సాధించిన ఆర్థికాభివృద్ధి నిజమైన అభివృద్ధి కాదు” అని తన ఉపన్యాసంలో స్పష్టంగా చెప్పారు.

ఇక, మార్క్సిజమ్ ప్రతిపాదించే ‘రాజ్యరహిత సమాజం’ విషయంలో గాంధీజీని, రాయ్‌ని సరిపోలుస్తూ "Humanism of Mahatma Gandhi and M.N.Roy" అనే గ్రంథంలో S. Abdul Sattar (యస్.అబ్దుల్ సత్తార్) ఇలా అంటాడు “గాంధీ, రాయ్ ఇరువురూ రాజ్యరహిత సమాజాన్నే కోరుకున్నారు. వారి ఉద్దేశంలో రాజ్యం వుండాల్సిన అవసరాన్ని వ్యక్తి అధిగమించాలి. వీరిరువురూ వర్గరహిత, రాజ్యరహిత సమాజాన్నే ఆదర్శంగా పెట్టుకున్నారు గాంధీజీ దృష్టిలో రాజ్యాధికారం అనేది ఎవరికీ లక్ష్యం కారాదు. ప్రజలు తమ జీవితాలను మెరుగుపరుచుకొనేందుకు రాజ్యం ఒక సాధనంగా మాత్రమే వుండాలి. ప్రజలు తమకుతాము విధించుకున్న నిబంధనలను అనుసరించేవారుగా వుండాలి. పరిస్థితులకు ‘అనుగుణంగా తమను తాము నియంత్రించుకోవాలి. ప్రతివాడూ తనకు తనే పాలకుడుగా వుండాలి. ఇలా గాంధీజీ కలలుగన్న ఆదర్శ రాజ్యం అవతరించినప్పుడు ప్రభుత్వం అవసరమేమున్నది ? ఇంచుమించు రాయ్ కన్నకలలు కూడా ఇవే !

గాంధీజీ, రాయ్ ఇద్దరూ రాజకీయ రంగంలోను, ఆర్థికరంగంలోనూ వికేంద్రీకృత విధానాన్నే కోరుకున్నారు. అధికార కేంద్రీకరణ ఇద్దరి దృష్టిలోనూ వాంఛనీయంకాదు.

ప్రజాశ్రేయస్సే ప్రధానమైనదిగా భావించే గాంధీజీ పార్టీ రాజకీయాలకు ప్రాధాన్యతను ఇవ్వలేదు. స్వాతంత్ర్యం అరుణోదయవేళ గాంధీజీ కాంగ్రెస్ పార్టీని రద్దు చెయ్యాలని చెప్పాడు. అంతేకాదు పార్టీ పేరును "లోక్ సేవా సంఘ్"గా మార్చమని సూచించాడు. అంతకుముందే కాంగ్రెస్ పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. ఇవన్నీ రాయ్‌కి ఎంతగానో నచ్చాయి.

ఆర్థిక రంగంలో 1) వ్యవసాయానికి, గ్రామాభ్యుదయానికి ప్రాధాన్యత లభించడం 2) ఇందుకు సహకార విధానం తోడ్పడడం 3) అభివృద్ధి అనేది ముందు వ్యవసాయ రంగంలో జరిగి, ఆ తర్వాత పారిశ్రామిక రంగానికి విస్తరించడం 4) పారిశ్రామిక రంగంలో కుటీర పరిశ్రమలకు, చిన్న తరహా, మధ్యతరహా పరిశ్రమలకు ప్రాధాన్యత లభించడం ఆ తర్వాతే భారీ పరిశ్రమల అభివృద్ధి జరగడం ఇవన్నీ గాంధీజీ తొలినాటినుండి పదేపదే చెబుతున్న విషయాలు. ఇలా జరిగినప్పుడు భారతదేశ ఆర్థిక వ్యవస్థ పటిష్టమైన పునాదులపై నిర్మించ బడుతుందని గాంధీజీ ఉద్దేశం.

రాయ్ ఆధ్వర్యంలో ఆయన శిష్యులు రూపొందించిన "ప్రజా ప్రణాళిక" (పీపుల్స్ ప్లాన్) లోని అంశాలు ఇందుకు భిన్నమైనవి కావు. రాయ్ తన ఆర్థిక విధానంలో సహకార వ్యవస్థకు చాలా ప్రాధాన్యతను ఇచ్చాడు. అంతేకాదు సహకార పద్ధతి అనేది ముందు వ్యవసాయ రంగంలో ప్రారంభం కావాలన్నాడు.

చిన్న కమతంలో వ్యవసాయం చేసే రైతు తన కుటుంబానికే కాదు తనకున్న పశువులకు కూడా తిండిపెట్టలేడు అని చెబుతూ గాంధీజీ వ్యవసాయ రంగంలో సహకార పద్ధతికిగల ప్రాధాన్యతను చెప్పేవారు. పశుపోషణ రంగానికి కూడా ఈ సహకార పద్ధతి విస్తరించ బడాలన్నారు.

చిన్నతరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, సహకార విధానం వలన పొందగల ప్రయోజనాలను గాంధీజీ చెప్పారు.

ఇలా కొన్ని పోలికలు వున్నప్పటికీ - కొన్ని ముఖ్యమైన తేడాలు కూడా వున్నాయి.

గాంధీజీ రైతుల అభ్యుదయాన్ని కోరుకున్నప్పటికీ, భూస్వామ్య విధానానికి వ్యతిరేకికాదు. భూస్వాములు, పెట్టుబడిదారులు తమ సంపదకు కేవలం 'ధర్మ కర్తలు' లాగా వుండాలని చెబుతూ గాంధీజీ ప్రతిపాదించిన 'ధర్మ కర్తృత్వ' సిద్ధాంతం రాయ్‌కి ఆమోదయోగ్యం అయ్యే అవకాశంలేదు. గాంధీజీకి ఆధునికతపై వున్న విముఖత రాయ్‌కి ఎంత మాత్రమూ రుచించదు.

ఇక, గాంధీజీ ప్రతి విషయాన్ని 'భగవంతుడి' తో ముడిపెట్టడం రాయ్‌కి చికాకు కలిగించే విషయం. (అది ఏ మతానికి చెందిన భగవంతుడు అయినా సరే)

అయితే కొన్ని విషయాలలో రాయ్ గాంధీజీని మెచ్చుకునేవాడు. వాటిని ఇలా వివరించ వచ్చు.

1) ఆసేతుహిమాచలం అందరి ప్రజలలో రాజకీయ చైతన్యం తీసుకురావడంతో గాంధీజీ నిర్వహించిన పాత్ర అసామాన్యమైంది.

2) ఈ రాజకీయ చైతన్యం కొందరు మేధావులకు, విద్యావంతులకు మాత్రమేగాక నిరక్షరాస్యులు, నిర్ధనులు అయిన అతి సామాన్యులలో, స్త్రీలలో కూడా ఆయన చైతన్యం కలిగించాడు. యావద్భారతంలో ఆయన చెప్పిందే చేయాల్సిన విషయమైంది.

3) అతిసామాన్యులకు అర్ధమయ్యే రీతిలో ఉపన్యసించగలగడం ఆయన ప్రత్యేకత.

రాయ్ వలెనే గాంధీజీ కూడా తాను నమ్ముకున్న లక్ష్యాలకు ఇచ్చిన ప్రాధాన్యత కుటుంబ జీవితానికి ఇవ్వలేదు. రాయ్‌కి ఇద్దరు భార్యలున్నారు (వారిగురించిన వివరాలు అనుబంధంలో చూడవచ్చును) అయితే వారిని రాయ్ తన కార్యక్రమాల్లో సహచరులుగానే చూచాడు. పిల్లలు వద్దనుకున్నాడు. సంసార జంజాటం పెట్టుకోలేదు.

గాంధీజీ విషయంలో రాయ్‌కి నచ్చని విషయం ప్రజలు ఆయనను అవతార పురుషుడిగా చూడడం. Men I Met అనే పుస్తకంలో రాయ్ గాంధీజీ పై రాసిన వ్యాసంలో "ఎప్పుడో కారలైల్ చెప్పినట్టుగా, ఇప్పటికీ మనదేశంలో దేశచరిత్ర అంటే గొప్ప వ్యక్తుల జీవితాలు అని ఇప్పటికీ నమ్ముతూ వుంటారు. కాని కారలైల్ కాలం తర్వాత చరిత్ర అనేది ఒక శాస్త్రంగా మారిపోయింది. గొప్ప వ్యక్తులు అనబడేవారు – ఆ కాలానికి సంబంధించి మాత్రమే గొప్పవారుగా వుంటారు. భారతీయులలో తిరుగుబాటు ధోరణిని, చైతన్యాన్ని తీసుకురావడంలో గాంధీజీ ఆ కాలానికి సంబంధించి గొప్పవాడు కావచ్చును. కాని, అతడి గొప్పదనం కాలాతీతమైంది కాదు. గొప్పవారిని అవతారపురుషులుగా భావించే సంప్రదాయం మంచిది కాదు"

(గాంధీ యుగంలో ఆయనపై దండకాలు, స్తోత్రాలు రావడం, కొందరు గాంధీజీకి గుడి కడతామనడం ఇలాంటివి ఎన్నో వున్నాయి.)

ఇలా రాసినప్పటికీ, 1948లో గాంధీజీ మతోన్మాది తుపాకీ గుండుకు బలి అయిన పుడు–రాయ్ ఒక సభలో ఉపన్యసిస్తూ వుండగా గాంధీజీ మరణవార్త తెలిసింది. ఆ వార్త వినగానే ఆయన నిశ్చేష్టుడయ్యాడు. తన ఉపన్యాసాన్ని కొనసాగించలేక మధ్యలో మానేశాడు.

ఆ తర్వాత, "ఇండిపెండెంట్ ఇండియా" పత్రికలో "త్యాగమూర్తి సందేశం" పేరుతో ఒక సంతాప వ్యాసం రాస్తూ

"నీతి, శాంతి, మానవ సౌభ్రాతృత్వాలను ప్రబోధించిన గొప్ప మతప్రవక్త లందరి వలెనే గాంధీజీ తాను కోరుకున్న విషయంలో విఫలుడయ్యాడు" అని అన్నాడు.

ఇది అక్షరాల నిజం. గాంధీ కోరుకున్నది ఒక్క స్వరాజ్యం మాత్రమే కాదు అది 'సురాజ్యం'గా వుండాలని కోరుకున్నాడు. కాని, ఆయన కాలంలో స్వతంత్ర భారతదేశంలో జరుగుతున్న సంఘటనలకు ఖిన్నుడై అనుక్షణం మృత్యువును ఆహ్వానిస్తూ రోజులు గడిపాడు. ఆయన కాలంలోనే మతోన్మాదం విలయతాండవం చేసింది. మతోన్మాదం క్రమక్రమంగా విజృంభిస్తున్నది. ఇలాంటప్పుడు సురాజ్యానికి చోటెక్కడిది ?

ఇక, మహాత్ముడు ప్రచారంచేసిన 'అహింసావాదం' అనే విషయంలో కూడా రాయ్‌కి విమర్శనాత్మక దృష్టే వున్నది. ఎం.ఎన్.రాయ్ "అహింసావాదం" అనే మకుటంతో ఒక వ్యాసం రాశాడు.

"మన రాజకీయ పోరాటంలో అహింసావాదాన్ని చొప్పించడం మహాత్మాగాంధీ ప్రత్యేకత. ఈ భావంతో ఆయన అనుచరులు చాలామంది ఈ సిద్ధాంతం ప్రపంచాని కంతటికీ మార్గదర్శకం కావాలని భావిస్తారు.

మహాత్ముడు నిజంగానే మహాత్ముడు కావచ్చు. అంతమాత్రాన, ఈ సిద్ధాంతాన్ని మూఢంగా విశ్వసించకూడదు. తర్కబుద్ధితో ఆలోచించాలి. మంచి, చెడ్డలను వివరించాలి.

ఫాసిస్టుల వంటి పశుప్రాయులు తప్ప, ఎవరూ హింసను కోరరు. అనాదిలో మానవుడు పశుప్రాయుడుగా వున్నప్పటి వాదం హింసావాదం. అయితే హింసను చెయ్యకుండా వుండడం, అహింసావాదాన్ని ప్రచారం చెయ్యడం ఒకటి కాదు. మహాత్ముని అహింసా విధానం అహింసను బోధిస్తూ హింసావాదానికి తావిస్తున్నది".

(ఇంగ్లండ్ మిత్రదేశాలు ఫాసిస్టు జర్మనీని యుద్ధంలో ఓడిద్దామని ప్రయత్నిస్తూ వుంటే గాంధీజీ ఇంగ్లాండును సమర్థించకుండా ఇంపీరియలిస్ట్ బ్రిటిష్ ప్రభుత్వం ఇండియా నుండి తొలగిపోవాలని ఉద్యమం చేపట్టడం అనేది, రాయ్ దృష్టిలో ఫాసిస్టు శక్తులను సమర్థించడం. అంటే పరోక్షంగా వారి హింసావాదానికి తోడ్పడడం అంటాడు రాయ్)

"గాంధీజీపై భక్తితో అహింసావాదానికి కట్టుబడిన కాంగ్రెస్ ఒక వేళ హింసామార్గంలో దేశానికి స్వతంత్రం రావడానికి అవకాశం వుంటే, దానిని తిరస్కరించడానికి కూడా సిద్ధపడుతుంది".

సాంఘికంగా గాంధీజీ అహింసావాదం దేశానికి మేలు కంటే కీడే ఎక్కువ చేసింది అనేది రాయ్ నిశ్చితాభిప్రాయం.

1934లో ఒక అమెరికన్ పత్రికా విలేఖరి గాంధీజీని ఇంటర్వ్యూ చేస్తూ, "స్వదేశ సంస్థానాలను తొలగించడానికి ఏదయినా హింసా కార్యక్రమం జరిగితే, దానిని మీరు సమర్థిస్తారా?" అని అడిగింది.

దానికి సమాధానం ఇస్తూ గాంధీజీ "స్వదేశీ సంస్థానాల్లో రాజులకు వ్యతిరేకంగా ఏదయినా హింస జరిగితే వారిని రక్షించడానికి నేను అన్ని విధాలా పూనుకుంటాను" అని అన్నారు. గాంధీజీ సంస్థానాధీశులకు వ్యతిరేకంగా ఏమాత్రం హింస జరిగినా సహించడు. సంస్థానాధీశులు వుండడం మంచిదా, కాదా అనే ప్రశ్న ఆయనకు అనవసరం. తన అహింసా వాదాన్ని రక్షించుకోవడమే ఆయనకు ముఖ్యం.

అలా అని ఆయన రాజులు వుండాలని కోరుకోడు. అయినా "అహింసావాదానికి వ్యతిరేకంగా ఏం జరిగినా ఆయన సహించలేరు. సంస్థానాధీశులు వుండాలని వాదించేవారు కూడా ఆ రాజులు ప్రజలను చక్కగా పరిపాలిస్తున్నారని అనలేరు".

ఇలా – గాంధీజీ ఆలోచనలను రాయ్ పలుసందర్భాలలో తీవ్రంగా విమర్శించాడు. గాంధీజీకి, రాయ్‌కి మధ్య ఎంత తేడా వున్నప్పటికీ ఇద్దరూ ప్రజల అభ్యుదయంకోసమే పాటుపడ్డారు. ఇద్దరూ ఆకలి సమస్య, దారిద్ర్యంలేని సమాజం కోసమే కలలుకన్నారు. వారి కల కేవలం భారతదేశ ప్రజలకోసమే పరిమితం కాలేదు. ప్రపంచమంతా ఇలాంటి సమాజం ఏర్పడాలని పరితపించారు. ఇద్దరూ – విశ్వమానవులు. 'గాంధీయిజమ్'ను పరికించినా 'రాయ్ యిజమ్'ను పరికించినా, మనకు అవగతం అయ్యేది ఇదే !



# 12

# ముగింపు

విభిన్న రంగాలలో విశేషమైన కృషి చేసిన మహామేధావి ఎం.ఎన్.రాయ్, తాను చేపట్టిన ప్రతీరంగంలోను తానుమేటి అనిపించుకున్నారు. అయితే ఈ రంగాలేవీ అతడికి సంతృప్తిని ఇవ్వలేకపోయాయి. చివరకు తాను కోరుకున్న సంతృప్తిని, నవ్య మానవ వాదాన్ని ఒక సిద్ధాంతంగా రూపొందించడంలో పొందగలిగాడు. ఈ ఆఖరి మజిలీ అతడికి ఆ రోజుల్లో విశేషమైన పేరు ప్రఖ్యాతులను తీసుకువచ్చింది. అతడు ఎన్ని మజిలీలు చేసినా అన్నింటా ఆయన మనిషికే ప్రాధాన్యతను ఇచ్చాడు. అతడు స్వేచ్ఛకు, ఇచ్ఛకు, హేతువాద దృష్టికి, ప్రాధాన్యతను యిచ్చాడు. మానవత ముఖ్యం అన్నాడు.

రాయ్ పడక కుర్చీ మేధావికాదు. జీవితాన్ని అనుభవించి, ఆ జీవిత తత్వాన్ని గ్రహించ గల తత్వవేత్త.

"నేను పధ్నాలుగేళ్ల బడి పిల్లవాడుగా వున్నప్పుడు రాజకీయ జీవితాన్ని ప్రారంభించాను. అప్పటికి నా ఆలోచన స్వతంత్రంగా వుండడం మాత్రమే" అన్నాడు రాయ్ ఒక ఉపన్యాసంలో. ఈ స్వతంత్రత అనేది తనకొక్కడికే కాదు–మానవులందరికీ వుండాలనేది రాయ్ తపన. ఈ స్వేచ్ఛకు అవకాశం లేనప్పుడు తాను చేపట్టిన ఏ రంగాన్నయినా, రెండో ఆలోచన లేకుండా రాయ్ విడిచిపెట్టేసేవాడు.

మేధా ప్రపంచానికి "మానవతావాదం" కొత్తది కాదు. మానవతావాదుల్లో, ఈశ్వర వాదులూ వున్నారు. నిరీశ్వరవాదులూ వున్నారు. రాయ్ ప్రతిపాదించిన మానవతావాదంలో భగవంతుడికి చోటు లేదు. కాబట్టి ఇది నిరీశ్వరవాదానికి చెందింది అని చెప్పవచ్చు.

నిరీశ్వర మానవతావాదం కూడా చాలా కాలం నుండి వుంది. అయితే ఈ తరహా మానవతా వాదాన్ని ప్రతిపాదించిన జీన్‌పాల్ సార్త్రే, జాన్‌డ్యుయీ, బెర్‌ట్రాండ్ రసెల్‌ల మానవతా వాదం భిన్నమైంది కాబట్టి, రాయ్ తన సిద్ధాంతానికి "నవ్య మానవ వాదం" అని పేరు పెట్టాడు. ఊహలకు, కల్పనలకు అవకాశం లేకుండా హేతువాద దృష్టితో, శాస్త్రీయ ధోరణిలో ఈ సిద్ధాంత రూపకల్పన జరిగింది కాబట్టి దీనిని శాస్త్రీయ మానవవాదం (Scientific Humanism) అనికూడా అనవచ్చును.

ఇలాంటి శాస్త్రీయ మానవవాదాన్ని ప్రచారం చేసేందుకే రాయ్ జీవితంలోని చివరి దశ అంకితమైపోయింది. రాజకీయాల నుండి పూర్తిగా విరమించాడు. "రేడికల్ డెమోక్రటిక్ పార్టీ"ని రద్దు చేసిన తర్వాత, తాను నిర్వహిస్తున్న "ఇండిపెండెంట్ ఇండియా" పత్రిక పేరును "రాడికల్ హ్యూమనిస్ట్"గా మార్చాడు. అతడి నిర్వహణలోనే వున్న "The Marxian way" పత్రిక పేరును "The Humanist Way"గా మార్చాడు.

దేశమంతటా నవ్య మానవ సిద్ధాంతాన్ని ప్రచారంచేస్తూ, పర్యటనలు చేశాడు. బెంగాల్‌లో రాడికల్ హ్యూమనిస్ట్ స్టడీకేంప్ నిర్వహించాడు.

ఈ కార్యక్రమాలన్నింటికీ కేంద్ర స్థానం – అతడు డెహ్రాడూన్‌లో స్థాపించిన "ఇండియన్ రినైజాన్స్ ఇన్‌స్టిట్యూట్" ఆ రోజుల్లోనే రాయ్ లెక్కలేనన్ని గ్రంథాలు నిర్విరామంగా రాశాడు. తన పత్రికల్లో తన భావాలు వ్యక్తం చేస్తూ వ్యాసాలు రాసేవాడు.

ఈ రచనా వ్యాసంగం, పర్యటనలు, అసలే అంతంతమాత్రంగా వున్న అతడి ఆరోగ్యంపై ప్రభావాన్ని చూపాయి. విశ్రాంతికోసం రాయ్ ముస్సోరీ వెళ్ళాడు. అతడితోబాటు అతడి రెండవ భార్య 'ఎలెన్' కూడా వెళ్లింది. ఈ విశ్రాంతి వలన అతడి ఆరోగ్యం కొంత మెరుగుపడునేమోగాని, ఇంతలో ఒక విషాద సంఘటన జరిగింది.

1952లో ముస్సోరీలో భార్యా భర్తలిద్దరూ వ్యాహ్యాళికి వెడుతుండగా, రాయ్ కాలు జారి లోయలో 56 అడుగుల లోతులోకి పడిపోయాడు. దీనివలన రాయ్‌కి చాలా చోట్ల దెబ్బలు తగిలాయి. అనేక వారాలపాటు మంచంమీదనే ఉండిపోవలసి వచ్చింది. అయితే ఎలెన్ రాయ్ అత్యంత శ్రద్ధాభక్తులతో చేసిన సేవల వలన కొన్నాళ్లకు అతడు తేరుకున్నాడు. తిరిగి డెహ్రాడూన్ వెళ్లి, తన కార్యక్రమాలు చేసుకోవచ్చునని రాయ్ భావించాడు.

డెహ్రాడూన్ వెళ్లిన తర్వాత రాయ్ వైద్య పరీక్షలు చేయించుకుంటే, మరొక విషాద వాస్తవం తెలిసింది. లోయలోనికి హఠాత్తుగా పడిపోవడంవల్ల, అతడి మెదడులోని రక్తకణాలు దెబ్బతిన్నాయి. అవి గడ్డకట్టుకుపోయాయి. ఇది చాలా ప్రమాదకరమైన విషయం. అయినా వైద్యుల కృషితో వ్యాధికి తాత్కాలికంగా ఉపశమనం కలిగింది. మళ్ళీ "రాడికల్ హ్యూమనిస్ట్" పత్రికకు వ్యాసాలు రాస్తూ వుండేవాడు.

1953లో అమెరికాలోని ఒక సంస్థ రాయ్‌ని అమెరికావచ్చి, ఉపన్యాసాలు ఇమ్మని కోరింది. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని, అమెరికాలో మెరుగైన వైద్యచికిత్స చేయించుకోవచ్చని భావించాడు రాయ్.

కాని ఈ లోపలే, అతడి అనారోగ్యం మళ్ళీ తిరగబెట్టింది. చాలాసార్లు మంచం మీదనే ఉండాల్సి వచ్చింది. క్రమంగా వ్యాధి ఉధృతమైంది (రాయ్‌కి వచ్చిన ఈ వ్యాధిని "సెరిబ్రల్

థ్రోంబోసిస్" అని అంటారు. Cerabral thrombosis) చాలాసార్లు మృత్యువుతో పోరాడి, చివరకు 1954 జనవరి 25వ తేదీ రాత్రి రాయ్ మృత్యువు ఒడిలో ఒరిగిపోయాడు. తెల్లవారితే దేశంలో రిపబ్లిక్ వేడుకలు.

ఆ వేడుకల హడావిడిలో మహామేధావి, గొప్ప దేశభక్తుడు, మానవతావాది అయిన రాయ్ మృత్యువును పట్టించుకున్నవారు ఎక్కువమంది లేకపోవచ్చు కాని, రాయ్ అనుచరులకు, ఆయన భావాలను ఆరాధించేవారికీ–రాయ్ మరణం తీరని వ్యధను కలిగించింది. దేశవిదేశాల్లోని ఎందరో మేధావులు రాయ్ మరణవార్తను విని కలతచెందారు.

డెహ్రాడూన్‌లోని రాయ్ నివాసం (13, మోహినీ రోడ్)కు సంతాప సందేశాలు వెల్లువలా వచ్చిపడ్డాయి. మన దేశంలోనూ, ఇతర దేశాలలోనూ సంతాప సభలు అనేకం జరిగాయి.

ఇవాళ రాయ్ మనమధ్య లేకపోవచ్చు. కాని, ఆయన రాసిన గ్రంథాలు వున్నాయి.

* * * * *

రాయ్ ఎన్ని గ్రంథాలు రాశాడు, వ్యాసాలు రాశాడు అనేది లెక్కపెట్టడం అంత సులభంగా సాధ్యమయ్యే విషయం కాదు. ఎందుకంటే అతడు ఇంగ్లీషు, స్పానిష్, ఫ్రెంచి, రష్యన్ భాషల్లో వాటిని రాశాడు. వాటిల్లో కొన్ని ఇంగ్లీషులోకి కూడా అనువదించబడ్డాయి. అందుచేత ఎక్కువమందికి తెలిసిన ఇంగ్లీషు భాషలోని గ్రంథాల గురించి, వ్యాసాల గురించి ప్రస్తావిస్తూ వుంటారు.

మరొక ముఖ్యమైన విషయం ఏమిటంటే అచ్చు అయిన రాయ్ రచనలలో చాలా గ్రంథాలు ఇవాళ లభ్యతలో లేవు. అదీగాక రాయ్ రచించిన రచనలన్నీ గ్రంథ రూపంలో లేవు. అందుచేత ఎంతటి జిజ్ఞాసగల పరిశోధకుడయినా, రాయ్ సమగ్ర సాహిత్యాన్ని పఠించ గలగడం అసాధ్యం.

నిర్మలానంద భట్టాచార్య అనే ఆయన ఈ విషయాన్ని గురించి చెబుతూ, "నిరంతర విప్లవ కార్యకలాపాలలో మునిగితేలుతూ కూడా, విజ్ఞానానికి సంబంధించిన అన్ని శాఖల్లో, అన్ని భాషల్లో, ఎప్పుడు ఎలా అంతటి పాండిత్యాన్ని సంపాదించాడనే విషయం ఏనాటికయినా ఆశ్చర్యంగానే మిగిలిపోతుంది.

ఆయన మహా పండితుడు. గొప్ప బహుభాషావేత్త. విప్లవకారుడు. సునిశిత సిద్ధాంతకర్త. మహామేధావి. అచంచల హేతువాది. స్థితప్రజ్ఞుడు. సంక్షుభితమైన ఈ యుగంలో విశ్రాంతి ఎరుగక కృషిచేసిన ఉత్తమ పురుషుడు" అని అంటారు.

రాయ్ అంటే ఎవరు ? అని అడిగేవారికి ఈ వాక్యాలు సంక్షిప్తంగా సమగ్ర సమాచారాన్ని అందిస్తాయి.

రాయ్ తన నవ్య మానవవాద సిద్ధాంత ఆచరణకు ప్రజలలో నీతి, నిజాయితీ, వుండాలని కోరుకున్నాడు. తనుకూడా అలాగే జీవించాడు.

అయితే చిత్రంగా ఇలాంటి ఎం.ఎన్.రాయ్‌కి అవినీతి మరకలు అంటించడానికి ప్రయత్నించినవారు లేకపోలేదు.

కమ్యూనిస్టుగా వున్న రోజుల్లో 'కమింటరన్' ఇచ్చిన నిధులను రాయ్ దుర్వియోగం చేశాడనీ, భారతదేశంలో కమ్యూనిజమ్ ప్రచారం చెయ్యడానికి నిర్దేశించబడిన నిధులను స్వప్రయోజనాలకు వాడుకున్నాడనీ – అంటారు వీరు. అయితే – ఇలాంటి పనులను నిస్సిగ్గుగా చేసిన ప్రబుద్ధులే రాయ్‌పై ఈ నిందలను వెయ్యడం విశేషం.

ఈ విషయాన్ని గురించి చెబుతూ 'జాన్.పి.హైడ్ కాక్స్' అనే ఆయన ఇలా అంటారు.

"నిధుల దుర్వినియోగం గురించి, సత్యేంద్రనాథ ఠాగూర్ రాయ్ చేసిన ఆరోపణలు సమర్థనీయమైనవి కావు. విప్లవ కార్యకలాపాలలో పాల్గొనడం అంటే పస్తులుండడం, సన్యాసిలా తయారవడం అని రాయ్ భావించలేదు. కాలం కలసివచ్చినప్పుడు రాయ్ సుఖంగానే జీవించాడు.

అప్పుడయినా ఆయనకు పుస్తకాలూ, బట్టలూ తప్పితే స్వంత ఆస్తి అంటూ ఏదీ లేదు. ఖర్చు బాగానే చేసేవాడు గానీ, అందులో ఆయన మిగుల్చుకున్నదీ, దాచుకున్నదీ ఏదీలేదు. 'కమింటరన్'తో సంబంధం తెగిపోయిన రోజుల్లో "ఆయన చేతిలో చిల్లిగవ్వలేదు. పూట గడవడం కోసం బెర్లిన్‌లోని మిత్రులమీద ఆధారపడవలసి వచ్చేది. తన ఆదర్శాలను కాపాడుకోవడం కోసం ఆయన ఎంతటి త్యాగానికయినా వెనుకాడేవాడు కాదు !"

ఈ మాటలు అక్షర సత్యాలు.

ఇది ఇలా ఉండగా రాయ్ మీద మరొక విచిత్ర అభియోగం కూడా వుంది. సమరేన్ రాయ్ దీనిగురించి చెబుతూ "మొదటిలో రాయ్ జాతీయవాదంపట్ల ఆకర్షితుడు కావడానికి కారణం అతడి బ్రాహ్మణత్వమే కావచ్చును. ఆ తర్వాత కాలంలో రాయ్ అప్పుడప్పుడు తన బ్రాహ్మణ గర్వాన్ని, వారసత్వాన్ని గురించి చెప్పేవాడు"

ఇది పూర్తిగా విలువలేని విషయం. జన్మతః పూజారీ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినా అతడి ఉగ్రజాతీయ వాదానికి మూలం హిందూమత భావజాలంలో వుంది కాని, కులంలో లేదు. ఆ తర్వాతి కాలంలో రాయ్ ఈ హిందూమత భావజాలంపట్ల కూడా విముఖుడయ్యాడు.

ఇంకా చెప్పాలంటే ఏ మతమైనా సరే మానవుడి ఆలోచనా శక్తిని, స్వేచ్ఛా ప్రియత్వాన్ని, హరిస్తుందని భావించాడు రాయ్.

ఈ సందర్భంలోనే మరొక విషయాన్ని గురించి కూడా చెప్పాలి. తన జీవనయానంలో రాయ్ ఇస్లామ్ మతంగురించి అధ్యయనంచేశాడు. రాయ్‌కి చాలామంది ముస్లిమ్ మిత్రులుండే వారు. ఎందరో ముస్లిమ్‌లతో కలిసి పనిచేశారు. ఇస్లామ్‌ను రాయ్ అధ్యయనం చెయ్యడం మాత్రమే కాదు ఇస్లామ్ మతానికి, యూరోపియన్ సంస్కృతికి మధ్యగల సంబంధాన్ని కనుగొన్నాడు. తమకు తెలియకుండానే వారు పునరుజ్జీవనోద్యమానికి తగిన నేపథ్యం సమకూర్చారని చెప్పేవాడు. ఈ విషయాలను వివరిస్తూ రాయ్ – "ఇస్లామ్ మతం నిర్వహించిన చారిత్రక పాత్ర" (Histori-cal Role of Islam) అనే గ్రంథాన్ని కూడా రచించాడు.

అసూయతోనూ, అజ్ఞానంతోనూ, దుష్టబుద్ధితోనూ కొందరు రాయ్‌పై చేసిన విమర్శలు మనం పట్టించుకోనవసరం లేదు.

కడిగిన ముత్యంలాంటిది రాయ్ వ్యక్తిత్వం. ఏ ఆదర్శంతో కృషిచేసినా అందులో నీతితో, నిజాయితీతో, నిబద్ధతతో పనిచేశాడు. రాయ్ నిర్వహించిన అసాధ్యమైన కార్యాలలో ఏ ఒక్కటిని సాధించినా, అతడిని ఘనుడుగా కీర్తిస్తారు. కాని, ఇన్ని కష్టసాధ్యమైన పనులను సాధించిన ఎం.ఎన్.రాయ్‌ను చాలా తక్కువమంది మాత్రమే గుర్తుకు తెచ్చుకుంటారు. అది మన దురదృష్టం.

రాయ్ గురించి చెబుతూ ఆయనను ఎంతగానో గౌరవించే రావిపూడి వెంకటాద్రిగారు "దేశంలో జ్ఞానవికాసానికి దోహదం చెయ్యగల తాత్విక సాహిత్యాన్ని రాయ్ సృష్టించి నంతగా ఇంతకు ముందు ఏ భారతీయుడూ సృష్టించలేదు" అని అంటారు. ఇది సత్యం.

ఆలోచనలోనూ, ఆచరణలోనూ రాయ్‌కున్న విశిష్టత అపూర్వమైనది. విలక్షణమైనది. రాయ్ గ్రంథాలన్నీ లభ్యతలోనికి వచ్చేటట్లు చూడడం, వాటిని యువతరం చదివే అవకాశాన్ని కల్పించడం, భారతీయులుగా మన కనీసకర్తవ్యం.



## అనుబంధం - 1

# రాయ్ వ్యక్తిగత జీవితం

నిజానికి రాయ్‌కి వ్యక్తిగత జీవితం అంటూ ఏదీ లేదు. తనను గురించి ఆయన ఏ గ్రంథలోనూ వివరంగా చెప్పుకోలేదు. తన "జ్ఞాపకాలు" మొదటి వాల్యూములో 'ఆటోబయోగ్రఫిరియల్ స్టేట్‌మెంట్' అనే మకుటంతో మొత్తం తన జీవితాన్ని 'కట్టె-కొట్టె-తెచ్చె' అనే ధోరణిలో రెండు పేజీలలో అతిక్లుప్తంగా పేర్కొన్నాడు.

రాయ్‌కి స్వంతజీవితం అంటూ ఒకటి వున్నా, అది అతడికి ముఖ్యంకాదు. ప్రజాజీవితమే ఆయనకు ముఖ్యం. ప్రజాజీవితాలు మెరుగుపడడానికి అతడు చేసిన అవిశ్రాంత పోరాటాలు, అలుపెరుగని అన్వేషణలు ఇవి మాత్రమే ముఖ్యం.

ఇక వైవాహిక జీవితం విషయానికి వస్తే, అతడు రెండుసార్లు వివాహం చేసుకున్నాడు. కాని, పిల్లలు కావాలనుకోలేదు. ఎందుకంటే అతడికి ప్రజలే ప్లిలలు. గ్రంథాలే బిడ్డలు.

మొదటి భార్య 'ఎవిలిన్ ట్రాంట్' గురించి గత అధ్యాయాల్లో చెప్పడం జరిగింది. అమెరికాకు రాయ్ వెళ్ళిన తొలినాటి నుండి, 1925 వరకూ ఇద్దరూ అన్యోన్యంగా వుండేవారు. తండ్రిని ఎదిరించి, రాయ్‌ని వివాహం చేసుకున్న ఎవిలిన్ ట్రాంట్ అతడి మజిలీలన్నింటిలోనూ తోడుగా వుండేది. ఆమెది కూడా రాడికల్ భావాలే కావడంతో అతడి రచనా వ్యాసంగంలో కూడా సహకరించేది. అనారోగ్యం సమయంలో కంటికి రెప్పలా చూచుకున్నది. చివరకు తన పేరునుకూడా "శాంతిదేవి"గా మార్చుకుంది. మాస్కోలో స్థాపించబడిన కార్మిక విశ్వవిద్యాలయానికి, రాయ్ వైస్ ఛాన్సలర్ అయితే ఆమె అందులో ఆచార్యురాలిగా పనిచేసింది. 1920లో తాష్కెంట్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపనలో ఆమె రాయ్‌తో బాటు ప్రధానపాత్ర వహించింది.

యిలా, అన్యోన్యంగా వున్న రాయ్ దంపతులు ఎందుకు విడిపోయారన్నది చిక్కు ప్రశ్న. అయితే ఒక అభిప్రాయం ప్రకారం తమ వివాహానంతరం ఎవిలిన్ స్ట్రాంట్ పిల్లలను కోరుకున్నదనీ, రాయ్ అందుకు అంగీకరించలేదనీ చెప్పడం జరిగింది. కాని – ఇవి "ఊహాగానాలు" మాత్రమే.

1925 తర్వాత, భర్తను విడిచి ఆమె అమెరికాకు వెళ్లిపోయినా, రాయ్‌ని మరచిపోలేదు. రాయ్ పునర్వివాహం చేసుకునేంత వరకూ ఆమె వివాహం చేసుకోలేదు. భారత ప్రభుత్వం రాయ్‌ని అరెస్ట్ చేసినప్పుడు దానిని ఖండిస్తూ పత్రికలలో వ్యాసాలు రాసింది. రాయ్ చనిపోయి నప్పుడు "రాడికల్ హ్యూమనిస్ట్" పత్రికలో ఒక సంతాప వ్యాసం కూడా రాసింది.

అయితే ఇలాంటి ఆదర్శ భార్య ఎవిలిన్ ట్రాంట్ గురించి రాయ్ తన "జ్ఞాపకాలు" నాలుగు వాల్యూములలో ఎక్కడా ప్రస్తావించకపోవడం విశేషం.

ఇక, రెండవ భార్య 'ఎలెన్ రాయ్' విషయానికి వస్తే ఆమె కూడా గాఢమైన కమ్యూనిస్టు భావాలుగల మహిళ. ఈమెకూడా అమెరికా దేశానికి చెందినదే.

ఈమె పూర్తి పేరు ఎలెన్ గోస్టాక్. ఈమె తండ్రి అమెరికా దేశీయుడు. తల్లి జర్మన్ దేశీయురాలు.

తల్లిదండ్రులకు దూరంగా వుండే 'ఎలెన్ గోస్టాక్' చదువుకునే రోజులలోనే కమ్యూనిస్టు భావాలతో ప్రేరేపితురాలయింది. అంతర్జాతీయ రైతు సంస్థకు యూరోపులో కార్యదర్శిగా పని చేసింది. ఆ సంస్థకు చెందిన ఒక పత్రికకు ఆమె సంపాదకురాలిగా వుండేది. ఆరోజులలోనే ఆమెకు, రాయ్‌తో పరిచయం అయింది. ఆమెకు ఇంగ్లీష్, ఫ్రెంచి, జర్మన్, భాషలలో గట్టి పట్టు వుండేది. పలు ప్రసిద్ధ గ్రంథాలను ఇంగ్లీష్ నుండి జర్మన్ భాషలోనికి అనువాదం చేసింది. అంతేకాదు ప్రసిద్ధ మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు – ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్, జర్మన్ భాషలో రాసిన గ్రంథాలను ఇంగ్లీష్‌లోనికి అనువదించింది.

ఇలాంటి 'ఎలెన్ స్ట్రాంట్' పట్ల రాయ్ ఆకర్షితుడు కావడంలో ఆశ్చర్యంలేదు. రాయ్ 1936లో జైలు నుండి విడుదల అయ్యాక, 1937లో వీరి వివాహం జరిగింది. రాయ్ నడిపిన "రాడికల్ హ్యూమనిస్ట్" పత్రికకు ఆమె సంపాదకురాలిగా కూడా వుండేది.

రాయ్ జెయిలులో వుండగా ఎన్నో పుస్తకాలు చదివేవాడు. అతడు చదివే పుస్తకాలలో తత్వశాస్త్ర గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలు కూడా వుండేవి. జెయిలు నిబంధనల ప్రకారం ఆమె రాయ్‌కు నెలకొక ఉత్తరం రాసేది. రాయ్ ఆమెకు రాసే ఉత్తరాల్లో తనకు కావలసిన పుస్తకాల జాబితా వుండేది. ఆమె వాటినన్నింటినీ ఎంతో ప్రయాసతో సేకరించి, రాయ్ మిత్రులకు పంపేది. వారు ఆ పుస్తకాలను రాయ్‌కి రహస్యంగా అందజేసేవారు. జెయిలులో వున్న రాయ్

తన ప్రియురాలికి రాసిన లేఖలు ఆ తర్వాత "Letters from Jail" అనే పేరుతో పుస్తకంగా వెలువడ్డాయి.

రాయ్ జీవించి ఉన్నప్పుడు ఆమె అతడికి యిచ్చిన సహచర్యం, చేసిన సేవలకన్నా రాయ్ మరణించిన తర్వాత, ఆతడి స్మృతిని సజీవంగా ఉంచడంకోసం ఆమె చేసిన సేవ చాలా గొప్పది.

వేలాదిగా అస్తవ్యస్తంగా వున్న రాయ్ రచనలన్నింటినీ సేకరించి, గ్రంథాలుగా వెలువ రించడంలో ఆమె చేసిన కృషి అనన్య సామాన్యమైంది. ఈ కృషితో ఆమె రోజుకు 16-18 గంటల పాటు శ్రమించేది అని తెలుసుకుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఆమె కృషి లేకపోతే రాయ్ రచించిన "Politics, Power and Parties" అనే గ్రంథం వెలువడి వుండేది కాదు అని అంటారు. ఆమె కృషి లేకపోతే ఆమె స్థాపించిన “రాయ్ రచనా వేదిక” ద్వారా రాయ్ రచనలు ఈ తరానికి అందేవి కావు.

రాయ్ స్మృతికి ఇంతగా కృషిచేసిన 'ఎలెన్‌స్ట్రాంట్' (ఎలెన్ రాయ్) 1960 డిసెంబరు 16వ తేదీన హత్య గావించబడడం ఒక విషాదం. రాయ్ గుర్తున్నంత కాలం ఆయన ఇద్దరు భార్యలూ గుర్తుంటారు.



# అనుబంధం - 2

## రాయ్ నిర్వహించిన పత్రికలు - కొన్ని

1) వేన్‌గార్డ్ (Vangaurd)
2) మాసెస్ ఆఫ్ ఇండియా (The Masses of India)
3) ఇండిపెండెంట్ ఇండియా (Independent India)
4) మార్క్సియన్ వే (The Marxian Way)
5) రాడికల్ హ్యూమనిస్ట్ (Radical Humanist)
6) ది హ్యూమనిస్ట్ (The Humanist)

## రాయ్ రచించిన కొన్ని గ్రంథాలు

రాయ్ రాసిన అసంఖ్యాకమైన గ్రంథాలలో ఇవి అతికొద్ది మాత్రమే. అవిగాక, చాలా కరపత్రాలు, విడిగా పత్రికలలో వచ్చిన వ్యాసాలు, ఇతర భాషలలో రాసిన రచనలు, యివన్నీ కలిపితే మొత్తం సంఖ్య ఎంత వుంటుందో చెప్పలేం. వాటిల్లో ఇంగ్లీషులో రాసిన కొన్ని పుస్తకాల జాబితా మాత్రం ఇవ్వడం జరిగింది.

ఇప్పుడు ఆయన రాసిన పుస్తకాల్లో చాలావరకు అలభ్యం. రాయ్ రచనలు - అచ్చు అయినవి, వ్రాత ప్రతులు, డెహరాడూన్‌లోని రినైజాన్స్ ఇనిస్టిట్యూట్‌లో కొంతవరకు భద్రపరచడం జరిగింది. రాయ్ పుస్తకాలలో కొన్నింటి జాబితా -

1. Reason, Romanticism and Revolution 2 volumes
2. Materialism - An outline History of Scientific thought
3. New orientation
4. New Humanism
5. Beyond communism
6. Revolution and counter revolution in China
7. My Experiences in China
8. Russian Revolution
9. India in Transition
10. Future of Indian Politics
11. Letters to Congress Socialist Party.

12. India and War
13. Nationalism : An Antiquated Cult.
14. National Government or Peoples Govrnemnt.
15. I.N.A. and August revolution
16. Jawaharlal Nehru
17. Politics, Power and Parties
18. Historical Role of Islam
19. Science and Superstition
20. Constitution of India - A Draft
21. Letters from Jail
22. Memories - 4 volumes
23. Men I Met
24. Prisioners Diary (2 volumes)
25. War and Revolution
26. Alphabet of Fascist Economics
27. India - Its past, Present and Future
28. Freedom and Fascism
29. Scientific Politics
30. Gandhism, Nationalism and Socialism
31. Letters to mahatma



# అనుబంధం - 3

## రాయ్ పై వచ్చిన కొన్ని పుస్తకాలు

రాయ్‌పై చాలా గ్రంథాలు వచ్చాయి. వాటిలో కొన్ని మాత్రమే లభ్యతలో వున్నాయి. మిగిలినవి గ్రంథాలయాల్లో లభించవచ్చు.

1. *G.P. Bhattacharjee* - Evolution of Political Philosophy of M.N.Roy
2. *V.B. Karmik* - M.N.Roy
3. *S.R.Sharma* - Life and Works of M.N.Roy
4. *S. Abdul Sattar* - Humanism of Mahatma Gandhi and M.N.Roy
5. *Virendra Grover (Ed)* - M.N.Roy ; A Biography of His Ideas and Vision
6. *Ramendra* - 'M.N.Roy's New Humanism and Materialism
7. *Samaren Roy* - The Restless Brahmin - Early life of M.N.Roy
8. *Samaren Roy* - M.N.Roy - A Political Biography
9. *Samaren Roy* - M.N.Roy - Philosopher and Revolutionary
10. *Jena Krishan Chandra* - Contribution of M.N.Roy to Political Philosophy
11. **ఎం.ఎన్.రాయ్ దర్శనం** – సంకలనం : రావిపూడి వెంకటాద్రి
12. **ఎం.ఎన్.రాయ్ వ్యాసాలు** – అనువాదం : కోగంటి రాధాకృష్ణమూర్తి
13. **హ్యూమనిస్ట్ సమీక్షలు** – రావిపూడి వెంకటాద్రి
14. **ఎం.ఎన్.రాయ్** – భారతకమ్యూనిజమ్ – రావిపూడి వెంకటాద్రి (రెండు భాగాలు)

తెలుగులో రాయ్‌పై వచ్చిన పుస్తకాలు పేర్లు చెప్పేటప్పుడు రావిపూడి వెంకటాద్రిగారి పేరు చెప్పకుండా వీలులేదు. రాయ్ తత్వానికి అద్దంపడుతూ ఆయన ఎన్నో గ్రంథాలు రాశారు. వారికి కృతజ్ఞతలు.





## కోడూరి శ్రీరామమూర్తి

ఎన్నో అవార్డులు రివార్డులు పొందిన కోడూరి శ్రీరామమూర్తిగారు సెప్టెంబర్ 29, 1941లో రాజమండ్రిలో జన్మించి; ఉద్యోగ విరమణానంతరం కూడా రాజమండ్రిలోనే స్థిరపడ్డారు. వివిధ ప్రక్రియల్లో 30 గ్రంథాలు ప్రచురించబడ్డాయి; రెండు గ్రంథాలు కన్నడ భాషలో అనువదించబడ్డాయి. వీరు రచించిన "నీటిలో నీడలు" నవలపై పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి యమ్. ఫిల్ పొందారు.



భారతీయ జాతీయోద్యమ స్ఫూర్తి ప్రధాతల్లో ఒకరైన ఎం.ఎన్.రాయ్ మొదట ఉగ్రవాది, ఆ తదుపరి ప్రపంచంలో పలుచోట్ల కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పాటు చేయడంలో పూనుకొన్న వ్యక్తులలో ఒకరు, ఆ తదుపరి దానితో విభేదించి జాతీయ కాంగ్రెస్‌లో చేరి దానిని వామపక్ష భావాలతో నడపదలచిన జాతీయవాది. ఆ తదుపరి కాంగ్రెస్‌ను వీడి మళ్ళీ కమ్యూనిజాన్ని బలపరచి అదికూడా నచ్చక ఒక తత్వవేత్తగా వారి నవ్యమానవతావాదాన్ని ప్రభోదించిన మానవతావాది. ఏ రంగంలో వున్నా అంకిత భావం ఆయన వ్యక్తిత్వానికి నిదర్శనం.




PALLAVI PUBLICATIONS
Dr.Premchand Complex, 1st lane
Ashok nagar vijayawada 520010
Ph: 9866115655

Price : ₹125/-